వంశీ —......

# గాలికొండపురం రైల్వేగేటు





సీరియల్



## సపరివార పత్రిక స్వాతి లో

## ప్రారంభమైంది!

ప్రారంభ సంచిక మార్కెట్లో సిద్ధంగావుంది

# మనలో మాట

**మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలందరికీ సంక్రాంతి శుభాకాంక్షలు.**

గత కొద్ది వారాలుగా ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆలస్యంగా విడుదల అవుతున్నప్పటికీ ఎప్పటి మాదిరిగానే పాఠకులు తమ ఆదరాభిమానాలని అందచేస్తున్నందుకు కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాము. న్యూస్‌ప్రింట్ సమస్య కారణంగా అనివార్యమైన ఈ ఆలస్యాన్ని తగ్గించి సకాలంలో వారపత్రికని విడుదల చెయ్యటానికి తగిన ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాము.

ఈ సంచికలో ప్రధాన ఆకర్షణగా ఆంధ్రుల అభిమాన రచయిత శ్రీ మల్లాది వెంకటకృష్ణమూర్తి తొలిసారిగా ఆంధ్ర సచిత్ర వారపత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన అహ్లాదభరితమైన సరికొత్త సీరియల్ నవల "వినాయకరావు పెళ్లి" ప్రారంభిస్తున్నాము. ఈ సీరియల్ పాఠకులని విపరీతంగా ఆకట్టుకుంటుందని అనుకుంటున్నాము.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1987 దీపావళి కథల పోటీలో రు. 700/- బహుమతి పొందిన ఆరు కథలపై నిర్వహించిన పాఠకుల బాలట్. ప్రాస రచన పోటీలలో ఎంతో ఉత్సాహంగా పాల్గొని వాటిని జయప్రదం చేసిన వారందరికీ మా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాము.



శ్రీమతి అవధానుల విజయలక్ష్మి



శ్రీమతి పేరేపు లక్ష్మి



శ్రీమతి కె. వీణారెడ్డి

శ్రీమతి అవధానుల విజయలక్ష్మి రాసిన "జాతస్య హి ధ్రువో మృత్యు..." బాలట్‌లో మొదటి కథగా పాఠకులు ఎన్నిక చేసారు. బాలట్‌లో రెండవదిగా శ్రీమతి పేరేపు లక్ష్మి రాసిన "ఆయమ్మ", మూడవదిగా శ్రీమతి కె. వీణారెడ్డి రాసిన "క్షీరధార" కథలని పాఠకులు నిర్ణయించారు.

ఇక మిగిలిన నాలుగు, అయిదు, ఆరు స్థానాలలో వరుసగా శ్రీ యూరి వెంకటరావు రాసిన "మమతల శిఖరం", శ్రీ గోపాలుని జయరాజచంద్ర రాసిన "పీడ్కోలు", శ్రీమతి జొన్నలగడ్డ రామలక్ష్మి రచన 'కుండిలో పూల మొక్క' కథలు వచ్చాయి.

**ఈ ఆరుగురు కథా రచయిత (త్రు)లకి మా ప్రత్యేక అభినందనలు.**

పాఠకుల బాలట్‌లో మొదటిదిగా ఎన్నికైన మరో రు. 750/- లు అదనపు బహుమతిగా అందుకున్న "జాతస్య హి ధ్రువో మృత్యు..." కథా రచయిత్రి శ్రీమతి అవధానుల విజయలక్ష్మి తాము పుట్టింది, పెరిగింది చదువుకున్నదీ ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలలో అయినా ప్రస్తుతం ఉంటున్నది నాగపూర్‌లో అనీ, అక్కడి వెస్టన్ కోల్ ఫీల్డ్స్‌లో ఎకౌంటెంట్‌గా పనిచేస్తున్నామని తెలియచేసారు. పదిహేను సంవత్సరాల క్రితం సాహితీ రంగంలో ప్రవేశించిన వీరు ఇప్పటి వరకూ దాదాపు అరవై కథలు రాసారు. ఆంధ్రసచిత్ర వారపత్రిక 1984లో నిర్వహించిన దీపావళి కథల పోటీలో వీరికి మొదటి బహుమతి లభించింది. 1986లో ఆంధ్రజ్యోతి దీపావళి కథల పోటీలో ఉత్తమ కథగా తమ కథ ఎన్నికై బహుమతి పొందిందని, 1987 ఆంధ్రజ్యోతి న్యూఇయర్స్ కథల పోటీలో బహుమతి లభించిందని, 1987 స్వాతి సపరివారపత్రిక నవరస కథల పోటీలో బహుమతి వచ్చిందని, ఇప్పుడు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అందుకున్న ఈ బహుమతితో కలిపి మొత్తం అయిదూ తమ సాహితీ జీవితంలో వెలుగు దివ్వెలని తెలియచేసారు. ఎన్ని బహుమతులు అందుకున్నా ఆంధ్ర సచిత్ర వారపత్రిక వంటి ఉత్తమ సాహితీ విలువలు కలిగిన పత్రిక అందించిన స్ఫూర్తి వేరని ఆమె పేర్కొన్నారు.

'కథ' అన్నది చూసిన ఓ సంఘటనకో, విన్న ఏ విషయానికో పరిమితమై పోకుండా ఆ సంఘటన, ఆ విషయం నుంచి మానవతా విలువలని వెలికి తీసేదిగా ఉండాలన్నది వీరి అభిప్రాయం. తమ అభిమాన రచయిత (త్రు)లు శ్రీయుతులు కొడవటిగంటి కుటుంబరావు, రావికొండ విశ్వనాథశాస్త్రి, చలం, బుచ్చిబాబు, రంగనాయకమ్మ, వీనాదేవి, వాసిరెడ్డి సీతాదేవి గారల రచనలు ఇచ్చిన స్ఫూర్తితో తాము కలం పట్టామని అందుకు తమ తండ్రిగారు శ్రీ సామవేదుల సీతారామశాస్త్రి, తల్లిగారు శ్రీమతి వెంకటరత్నం, శ్రీవారు జగన్నాథరావు, సాహితీ మిత్రులు చిరంజీవులు చైతన్య, శరత్, మూర్తి ఇచ్చిన ప్రోత్సాహం ఆ కలానికి బలాన్నిచ్చిందని తెలియచేశారు.

బాలట్‌లో రెండవదిగా ఎన్నికై మరో రు. 650/- లు అదనపు బహుమతిగా అందుకున్న 'ఆయమ్మ' కథా రచయిత్రి శ్రీమతి పేరేపు లక్ష్మి తమ స్వస్థలం విశాఖపట్నం అయినా శ్రీవారి ఉద్యోగరీత్యా ప్రస్తుతం కాకినాడలో ఉంటున్నామని తెలిపారు. వివిధ వార పత్రికలలో రెండు బహుమతి పొందిన కథలతో సహా మొత్తం డజనుకు పైగా కథలు ప్రచురింపబడ్డాయని తెలియచేస్తూ పరిమితమయిన తమ రచనా జీవితంలో అంతకన్నా చెప్పుకోదగిన విశేషాలు ఏమీ లేవని రాసారు.

బాలట్‌లో మూడవ స్థానంలో పాఠకులు ఎన్నుకున్న 'క్షీరధార' కథా రచయిత్రి శ్రీమతి కె. వీణా రెడ్డి తాము చదివిన చదువుతో (పాలిటెక్నిక్) సంబంధంలేని సాహిత్యాభిమానంతో సాగించిన రచనా వ్యాసంగంలో సాధించిన కథా విజయాలు ముప్ఫయి అయిదు అయితే, ఈ కథ తొమ్మిదో బహుమతి కథగా నవ పథానికి నాంది పలికిందని అంటున్నారు. "చిత్తశుద్ధి కల్గి చేసిన రచనలు కొంచెమైన నవి కొదువ కావు" అని తాము నమ్ముతున్నామని తెలిపారు. ప్రస్తుతం భాగ్యనగరంలో ఉంటున్న వీరు తమ బరువు బాధ్యతల గృహిణీత్వంలోని తీరిక వేళలని మాత్రమే సాహిత్య రంగానికి రంగరిస్తూ, నిష్పాక్షిక పత్రికల, పాఠకుల ఆదరాభిమానాలతో ముందుకు సాగాలని తాము ఆకాంక్షిస్తున్నట్లు తెలియచేశారు.

ఇక ప్రత్యేక బహుమతులుగా ఒక్కొక్కటీ రు. 350/– చొప్పున అదనంగా పొందిన మూడు కథలలో 'మమతల శిఖరం' పాఠకుల బాలట్‌లో నాలుగవ స్థానంలో వచ్చింది. ఈ కథా రచయిత శ్రీ మూరి వెంకటరావు పుట్టి పెరిగింది విజయనగరంలో

ప్రస్తుతం వీరు విశాఖజిల్లా భీమిలి తాలూకాలోని రెడ్డిపల్లి అగ్రహారంలో జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో సైన్సు అసిస్టెంట్‌గా పనిచేస్తున్నారు. ఎం. ఎ, బి. ఎస్. సి, బి. ఎడ్. చదివిన, 38 సంవత్సరాల వయసు గల వీరికి భార్య, ఇద్దరు కుమారులు. ఇంతవరకూ 50 కథలు, వ్యాసాలూ వివిధ వార మాస పత్రికలలో పడ్డాయి. త్రివేణీ సంగమం, కాల్ గర్ల్ నవలలు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్స్‌గా వచ్చాయి. అపశ్రుతులు, థైలెక్కు నవల, "అరుణజ్యోతి, శుభోదయం" మొదలగు నాటకాలు ప్రచురణకర్తలు పుస్తకాలుగా ప్రచురించారని వీరు తెలియచేశారు. ఆంధ్ర పత్రిక ప్రచురణ బాలరంజనిలో 'మూడు వింతలు' అనే జానపద నవల సీరియల్‌గా ప్రచురింపబడింది. "గండం గడిచింది, నిజాయితీ విలువ, ఎవరిది లోపం" నాటికలు రేడియోలో ప్రసారమయినాయి. తమ హాబీలు సినిమాలు చూడటం, రచనలు చేయడం. ఉదాత్తమైన రచనలు చేసి, పాఠకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోవాలన్న తపన ఉన్నదని వీరు తెలియచేశారు.

బాలట్‌లో అయిదవ స్థానాన్ని అందుకుని ప్రత్యేక బహుమతిగా మరో రు. 350/–లు అదనంగా అందుకున్న 'వీడ్కోలు' కథా రచయిత శ్రీ గోపాలుని జయరాజచంద్ర ప్రస్తుతం విజయవాడలో రైల్వేలో పనిచేస్తున్నారు. ఇప్పటి వరకూ తాము 32 గ్రీష్మాలని చూసామని, "ఇట్ ఈజ్ ఎ డిఫికల్ట్ టాస్క్ టు డిఫైన్ ఎ మ్యాన్. హి యాక్ట్స్, రియాక్ట్స్, కౌంటరాక్ట్స్, ఇంటరాక్ట్స్" అన్న ఈ రెండు వాక్యాలను తాము తరుచుగా వల్లె వేసుకుంటూ ఏ వ్యక్తినైనా అదే కోణంలో నుంచి చూడటానికి ప్రయత్నిస్తామని అంటున్నారు. తాము ఆంధ్ర సచిత్ర వారపత్రికకి పంపిన మొదటి కథకే బహుమతి లభించటం తమకెంతో ఆనందాన్ని కలిగించిందని తెలియచేసారు.

పాఠకుల బాలట్‌లో చివరి కథగా ఎన్నికై ప్రత్యేక బహుమతిగా మరో రు. 350/–లు పొందిన "కుండీలో పూల మొక్క" కథా రచయిత్రి శ్రీమతి జొన్నలగడ్డ రామలక్ష్మి తాము పుట్టిందీ, పెరిగిందీ కాకినాడలో అయినా శ్రీవారి ఉద్యోగరీత్యా ప్రస్తుతం ఉంటున్నది భువనేశ్వర్‌లో అని పేర్కొన్నారు. ఇంచుమించు దేశం అంతా పర్యటించామని, ఒక సంవత్సరంపాటు పశ్చిమ జర్మనీలో కూడ ఉన్నట్లు తెలిపారు. వివిధ సంప్రదాయాలకు, మతాలకూ, దేశాలకూ చెందిన మహిళల వ్యక్తిత్వాలతో దగ్గర పరిచయం మానసిక సంఘర్షణకి కారణం కాగా ఆత్మ విశ్వాసంతో కూడిన సమాజ విశ్లేషణ తమ రచనలకి మూలాధారం అన్నారు. సాహిత్యానికీ రచయితలకూ ప్రస్తుతం లభిస్తున్న అనూహ్యమైన ఆదరణ అభిలషణీయమే అయినప్పటికీ ప్రచురణ సంస్థలు కథా సంపుటాలని వెలువరించడానికి ఎగబడే వరకూ పాఠకుల అభిరుచి అభినందనీయం కాదని వీరు అంటున్నారు. పోటీ కథల ప్రచురణ ద్వారా రచయిత (త్రు) ల ప్రత్యేకతను ప్రోత్సహిస్తూ ప్రత్యేక కథా సంపుటాలు లేని లోటును కొంత వరకూ తీరుస్తున్న పత్రికల కృషి అభినందనీయమని అన్నారు. ఆంధ్ర సచిత్ర వార పత్రిక నిర్వహించిన కథల పోటీలో బహుమతి లభించటం తమ కలానికి జరిగిన సన్మానంగా భావిస్తున్నామని, ఈ ప్రోత్సాహపు విలువ మున్ముందు తమ రచనలలో ప్రతిఫలించగలదని పేర్కొన్నారు.

దీపావళి కథలపై మేము నిర్వహించిన వ్యాస రచన పోటీలో మొదటి బహుమతి రు. 250/– లు వక్కలంక రామారావు కలం పేరుతో రాస్తున్న శ్రీ వక్కలంక విజయభాస్కర రామారావు (అనపర్తి). రెండవ బహుమతి రు.150/–లు శ్రీమతి వింజమూరి సుబ్బలక్ష్మి (వరంగల్). మూడవ బహుమతి రు. 100/–లు కడప జిల్లాలోని రేణూతల గ్రామానికి చెందిన శ్రీమతి ఆర్. స్వర్ణలత రాసిన వ్యాసాలకి లభించాయి. ఈ ముగ్గురు వ్యాస రచయిత (త్రు)లకి మా అభినందనలు తెలియచేస్తున్నాము. బహుమతి పొందిన వ్యాసాలని ఈ సంచికలోనే వేసాము.

ఎప్పటివలె ఈ ఏడాది కూడా సినిమా బాలట్ నిర్వహిస్తున్నాము. పాఠకులు ఈ సంచికలో ప్రచురించిన బాలట్ పత్రాన్ని పూర్తిచేసి 1988 ఫిబ్రవరి 15వ తేదీనగానీ అంతకు ముందు కానీ, మా కార్యాలయానికి అందేలా సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధినగరం, విజయవాడ-520003 అనే చిరునామాకి పంపాలి. కవరు పై భాగంలో "సినిమా బాలట్ 1987" అని స్పష్టంగా రాయాలి. పాఠకుల సౌకర్యం కోసం 1987లో విడుదలైన తెలుగు చిత్రాలు, వాటి దర్శకులు, సంగీత దర్శకుల జాబితాని ఈ సంచికలోనే వేసాము. పాఠకులందరూ ఉత్సాహంగా సినిమా బాలట్‌లో పాల్గొని దానిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము. □


మూరి వెంకటరావు


గోపాలుని జయరాజచంద్ర


శ్రీమతి జొన్నలగడ్డ రామలక్ష్మి

## ఉత్తరాలు

### సీరియల్స్

11-17 డిసెంబర్ 87 పూనమ్‌ఢిల్లాన్ ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన పత్రిక ఎంతో రమ్యంగావుంది ఈతరం యువతి, రేపటి మహిళ సీరియల్స్ ఎంతో రసవత్తరంగా వున్నాయి అంతేకాక ఈ రెండు సీరియల్స్‌లో హీరోయిన్స్ పేరు మృదుల కావడంతో సీరియల్స్ మృదు మదురంగా వున్నాయి అని మేమనటంలో అతిశయోక్తి లేదు కదా!

కుమారి పెయ్యేటి చాముండేశ్వరి, శ్రీమతి పెయ్యేటి కనకదుర్గ, శ్రీకాకుళం

★ ★ ★

సినీనటి పూనమ్‌దిల్లాన్ ముఖచిత్రంగల 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో రేపటి మహిళ ముగింపు బావుంది రచయిత్రి స ఆనందరామంగార్కి అభినందనలు ఆడవారు పురుషులకంటే అబలలు అంటూ పాత ఆచారాలు, మూఢ నమ్మకాలతో వంటింటి కుందేలు అనో, పిల్లల్ని కనే యంత్రాలు అనో బావించి 'నిన్న'లో గల బాగవతార్ లాంటి (పాత) వారు అర్ధంచేసుకుని, రేపటిలోకి మారడం వెరైటీగా, అలాంటి నమ్మకాలు గలవారికిదో గుణపాఠంగావుందనడంలో ఆశ్చర్యం ఏమిలేదు

కీర్తి కిష్టయ్య, రామవరం

★ ★ ★

'ఈతరం యువతి', 'రేపటి మహిళ' సీరియల్స్ బాగున్నాయి

సాగిరాజు రాజ్యలక్ష్మి, బోధన్

★ ★ ★

మంజీరనాదం సీరియల్ నన్ను ఎంతో ఆకట్టుకొన్నది ఇంకా ఈతరం యువతి సీరియల్ ఎంతో బాగున్నది ఈ రోజుల్లో ఆడవాళ్ళు తెలివితక్కువగా వుండకూడదన్న, మగవాళ్ళతో సాటిగా వుండాలన్న ఈ సీరియల్‌లో మృదుల పాత్ర నాకెంతో నచ్చింది

సమయమంతుల జగ్గారావు రాజమండ్రి

★ ★ ★

మంజీరనాదం సీరియల్ నాకు బాగా నచ్చింది సీరియల్ చదువుతున్నపుడు రసన్, చందన ప్రేమగాధ నా కళ్ళముందు సినిమాలాగా భ్రాంతికలిగింది పత్రిక ఎప్పుడు వెలువడుతుందా, ఎప్పుడు సీరియల్ చదువుదామా అని ఎదురు చూస్తుంటాను

దొడ్డపునేని ప్రసాద్, నందిగామ

★ ★ ★

ధారావాహికంగా వెలువడుతున్న "వెయిపడగలు" సీరియల్ వాస్తవానికి దగ్గరగాను, మళ్ళీమళ్ళీ చదివింపచేసేలావుంది పత్రికలోని అన్ని సీరియల్స్ ఆసక్తికరంగాను, కొత్తపంధాలో నడుస్తున్నాయి

రెడ్డిమళ్ళ ఉమ, శ్రీదరవేలేరు (ఖమ్మం)

★ ★ ★

'ఈతరం యువతి సీరియల్ నన్ను బాగా ఆకట్టుకొంటున్నది డి ఎస్ పి విజయ్ కూడా చాలా బాగుంది

ఎన్ వరలక్ష్మి, హిందూపురం

### కథలు

పి కుసుమారెడ్డిగారి కద పిచ్చుక గూళ్ళు వాస్తవానికి దగ్గరగావుంది 'ఆకాశదీపం' కద బాగుంది

మంతెన విజయలక్ష్మి, విజయవాడ

★ ★ ★

ఆకాశదీపం" కద పేరుకు తగినట్లుగా వున్నతంగా వుంది నీలకంఠంగారి ఔదార్యం, ముందుచూపు తలచుకుంటే గ్రామప్రజల కళ్ళేకాదు, పాఠకుల నయనాలు కూడా చెమ్మగిల్లుతాయనటంలో సందేహంలేదు తన గ్రామ ప్రజలనే తన నిజమైన సంతానంగా తలచి, తన ఆస్తినంతా తమ గ్రామ సౌభాగ్యానికై ధారాదత్తం చేసిన నీలకంఠంగారి దొడ్డమనసు నిజంగా కొనియాడతగినది

వక్కలంక రామారావు, అనపర్తి

### శీర్షికలు

11-17 డిసెంబరు '87 ఆంధ్రసచిత్రవారపత్రిక నటి పూనమ్‌ఢిల్లాన్ ముఖ చిత్రంతో చాలా ఆకర్షణీయంగావుంది ఎన్ రామ్‌జీగారి కొత్త శీర్షిక షేర్ మార్కెట్లో పెట్టుబడులు – వద్దంటే డబ్బుకి సోపానాలు చాలా బాగుంది విజ్ఞానం – వినోదం" శీర్షిక చాలా విజ్ఞానదాయకంగావుంది 'ఈకాలం పెళ్ళిళ్ళు' శీర్షిక చాలా బాగుంది బి బి రావుగారి "న్యాయపీఠం" సూపర్బ్

ఎస్. మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ □




## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

8-14, జనవరి, '1988

శ్రీ ప్రభవ నామ సం పుష్య బ చవితి

సంపుటము 80 : సంచిక 20

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (వర్కింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 3 00 |
| పోస్టులో 6నెలల చందా | రు 87 10 |
| పోస్టులో 12నెలల చందా | రు 174 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


### విషయానుక్రమణిక

ముఖచిత్రం :

'సంసారం'లో జయప్రద

# సంక్రాంతి పండుగ వైశిష్ట్యం

మనం ప్రతి యేటా ఎంతో ఉత్సాహంగా జరుపుకొనే అనేక పండుగల్లో సంక్రాంతి పండుగ ఒకటి హిందువుల పండగలన్నింటిలోకి అటు సాంస్కృతీపరంగానూ, ఇటు ఉత్సాహపరంగానూ జరుపుకొనే పండుగ ఈ సంక్రాంతి ఒకటేనంటే అతిశయోక్తి కాదేమో! సంక్రాంతి అనే పదానికి అర్థం ఈవిదంగా చెప్పబడింది సంక్రాంతి పండుగకు ఆ పేరెందుకు వచ్చిందో కూడా ఈ క్రింది శ్లోకంలో తెలియచేయబడింది

"తత్ర మేషాదిషు ద్వాదశరాశిషు
క్రమేణ సంచరితః
సూర్యపూర్వస్మాద్రాశౌరుత్తరరాశౌ
సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః"



అంటే మొత్తం పన్నెండు రాశులలోని ఒక రాశి నుండి మరో రాశికి సూర్యభగవానుడు ప్రవేశించుటయే సంక్రాంతి అని పై శ్లోకానికి అర్థం చెప్పబడింది అందుకే సంక్రాంతికి దైవంగా సూర్యభగవానుని పూజిస్తారు మకర సంక్రాంతిని మొత్తం మూడు రోజులు జరుపుకొంటారు మొదటి రోజు భోగి రెండవరోజు సంక్రాంతి (మకర సంక్రాంతి) మూడవరోజు కనుమ అయితే ఈ మూడు రోజులకూ వివిధ గాధలు అన్వయించబడ్డాయి

భోగి పండుగగురించిన కధ అత్యంతాసక్తిగా వుంటుంది పూర్వం విష్ణుచిత్తుడనే భక్తునికి ఒకచోట గోదాదేవి అనే స్త్రీ దొరికింది ఈ గోదాదేవి భూదేవి అంశ అని పురాణ ప్రతీతి ఈ గోదాదేవి రంగనాదుని ప్రేమిస్తుంది తనను వివాహమాడవలసిందిగా గోదాదేవి రంగనాదుని కోరగా, రంగనాదు డామె కోరికను మన్నించి ఆమెను వివాహమాడి భోగభాగ్యాలతో ముంచెత్తుతాడు వీరిద్దరి వివాహానికి చిహ్నంగా భోగి పండుగ నుజరుపుకుంటారని ప్రతీతి

ఇంక రెండవ రోజు సంక్రాంతి దీనినే "పెద్దపండుగ" అని కూడా అంటారు దీనికి కూడా ఒక గాధ అన్వయించబడింది పూర్వం శ్రీ కృష్ణుడు తన భక్తులైన యాదవులతో గోపూజను మించిన పూజ లేదనీ కాబట్టి మీ రందరూ ఈ రోజు నుంచీ మీరు గోవులనే పూజించమని చెబుతాడు ఆ రోజు నుంచీ యాదవు లందరూ కేవలం గోవులనే దైవాలుగా తలచి వాటినే భక్తిగా పూజిస్తుంటారు తక్కిన దేవతల్నెవర్నీ పూజించరు దీని కాగ్రహించిన ఇంద్రుడు ఆవులు మేపుకొంటున్న యాదవులపై విపరీతమైన భయంకరమైన రాళ్ళవర్షం కురిపించ సాగాడు అప్పుడు యాదవులందరూ శ్రీ కృష్ణుని ప్రార్థించగా కృష్ణుడు అక్కడేవున్న గోవర్ధన పర్వతాన్ని చిటికెనవేలుతో పైకి ఎత్తుతాడు

అప్పుడు యాదవులందరూ ఆ పర్వతం క్రిందకి వచ్చి ఇంద్రుడి రాళ్ళ వర్షంబారి నుండి రక్షణ పొందుతారు దాంతో ఇంద్రుడికి గర్వమణుగుతుంది శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతాన్ని ఎత్తిన రోజుగా సంక్రాంతి జరుపుకుంటారు ఈ రోజున నువ్వులు దానం చేయడం నువ్వులతో పితృదేవతలకు తర్పణ వదలడం చేస్తుంటారు అలాచేస్తే తమ పితృదేవతలు స్వర్గప్రాప్తి నొందుతారని ప్రతీతి ఈ రోజున సూర్యభగవానుని ఎంతో భక్తితో పూజించడం ఆచారంగా వస్తోంది అంతేకాకుండా ప్రాతఃకాలముననే 'సూర్య నమస్కారములు' చేస్తారు. ఇలా చేస్తే ఆరోగ్యం సిద్ధిస్తుందని నమ్మకం.

ఇంక మూడవ రోజు "కనుమ పండుగ"ను జరుపుకుంటారు. దీనినే "పశువుల పండుగ" అని పిలుస్తారు. ఈ రోజున ప్రజలు చాలామంది ప్రాతఃకాలముననే స్నానంచేసి. తమ పశువులను శుభ్రంగా కడిగి. బొట్లుపెట్టి పూజిస్తారు.

ఇంక 'సంక్రాంతి' వచ్చిందంటే స్త్రీలకు ఎక్కడా ఖాళీవుండదు. తెల్లవారుఝాముననే లేచి తమ ఇళ్ళ వాకిళ్ళలో కళ్ళాపుజల్లి అందమైన రకరకాల ముగ్గులుపెట్టి, అందులో 'గొబ్బెమ్మ'ల నుంచుతారు. గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాల్లోని స్త్రీలైతే "బొమ్మలకొలువు"లు పెట్టి, ఆఖరిరోజున పేరంటాలను పిలుస్తారు. అలాగే "భోగిమంటలు" వేయడంకోసం యువకులంతా కలప సిద్ధంచేసే హడావుడిలో తలమునకలై వుంటారు డూడూ బసవన్నా అంటూ గంగిరెద్దుల నాడించేవాళ్ళు హరిలో రంగహరి అంటూ హరిదాసులు పాడే పాటలతోనూ ఈ పండుగ ఎంతో హడావుడిగా వుంటుంది

ఈవిదంగా అందానికి, ఆనందానికి హేతువై చిన్నా – పెద్దా భేదంలేకుండా అందరినీ సమానంగా అలరించే సంక్రాంతి పండుగ అంటే ఎవరికి మాత్రం సరదావుండదూ!

వ్యాసం – ఫోటో

మోడేకుర్తి సత్యనారాయణ



# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి

# మన దౌత్యవేత్తలు చేస్తున్నదేమిటి?

రాజీవ్ గాంధీ వాషింగ్టన్‌కు వెళ్ళిన ప్రతిసారీ మోసానికి గురవుతుంటారు. ఆయన ఇదివరకు అక్కడికి రెండు సంవత్సరాల క్రితం వెళ్ళారు. అక్కడ విందులూ విలాసాలూ పూర్తయి ఇంటికితిరిగొచ్చేసరికి తనను వాళ్ళు ఆటబొమ్మలాగ వాడుకున్నారని అర్ధమైంది. ఈ సంవత్సరం ఆయన మళ్ళీ వెళ్ళారు. ఈ సారి ఒంటరిగా కాదు, డజన్లకొద్దీ ఆశ్రితుల్ని కొందరు పాత్రికేయులని కూడా తీసుకెళ్ళారు. ఆయన యాత్రవల్ల ఈ క్షామపీడిత భారతదేశపు నిరుపేద పన్నుచెల్లింపుదారుకు కేవలం పదికోట్ల రూపాయలు మాత్రమే ఖర్చయింది. కాని ఆయన అలా వెనుదిరిగారో లేదో సెనేట్ తాను చూపించిన చోట సంతకం చెయ్యమని, లేదా పరిణామం ఎదుర్కొమ్మని ఆయనను బెదిరించింది. ఆయనను వెన్నంటి ఉండే నట్వర్ సింగ్‌కు, పార్లమెంటులో అటల్‌బిహారీ వాజ్‌పాయి చెప్పినట్టు, విదేశీ వ్యవహారాల నిపుణుడని పేరు. ఆ నట్వర్‌సింగ్ ఈ యాత్రను ఘన విజయంగా అభివర్ణించారు. చెంపదెబ్బతినడం కన్నా ఘనమైనదేమీ ఉండదుకదా. ఇప్పుడు భారత దేశం పొందినదదే. ఎందుకంటే, ఆయుధాల పెంపుదల నిరోధం ఒప్పందం మీద సంతకం చేయకపోతే మనకు వాళ్ళనుంచి ఒక్కడాలర్ కూడా రాదని వాళ్ళు చెప్పారు.

ఇదంతా కూడా ప్రధానమంత్రి యాత్రకు నెలరోజుల లోపే జరిగిపోయింది. ఖచ్చితంగా ఏదైనా బిల్ తయారు చేయడానికి దాన్ని కాంగ్రెస్‌కు సమర్పించడానికి నెల రోజుల కంటే ఎక్కువే పడుతుంది. అంటే మన ప్రతినిధివర్గం అమెరికాలో ఉన్నపటికీ ఆ బిల్ తయారయి ఉన్నదన్న మాట.. మన రాయబార కార్యాలయం ఏం చేస్తున్నది? ఏమి జరుగుతున్నదో పి. కె. కౌల్‌కు ఎవరూ చెప్పలేదా? సందర్భ వశాత్తూ పి. కె. కౌల్‌కు దౌత్య వ్యవహారాలలో అనుభవమేమీ లేదు. మంత్రివర్గ కార్యదర్శిగా కూడా ఆయన అంత ప్రముఖుడుగా గుర్తింపు కొచ్చిన వ్యక్తి కాదు. మనకు వాషింగ్టన్‌లోను విశాలమైన రాయబార కార్యాలయమున్నది. దాని మీద మనం బహుశా సంవత్సరానికి యాభై కోట్ల రూపాయలకంటే ఎక్కువ. అంటే వారానికి ఒక కోటి రూపాయలు కర్చు పెడుతున్నాం. దీనికి తోడుగాప్రపంచ బ్యాంకులోను, ఇతర సంస్థలలోను చాలా మంది భారతీయులు పని చేస్తున్నారు. వీరిలో చాలా మందికి ప్రభుత్వంలో ఏమి జరుగుతున్నదో కచ్చితంగా తెలిసే ఉంటోంది. ఐనా ఈ బిల్ గురించి రాయబార కార్యాలయం పత్రికల ద్వారా మాత్రమే తెలుసుకుంది. అప్పటికే పుణ్యకాలం కాస్తా గడిచి పోయింది. కౌల్ గందరగోళ పడి రీగన్‌తో సమావేశం కోసం ప్రయత్నించారు. కాని ఆయన సరైన చోట్ల ప్రయత్నించినట్లు లేదు కనుక అధ్యక్షుణ్ని కలుసుకోలేక పోయారు.

మన రాయబారులు ఏయే దేశాలకు పంపబడ్డారో ఆయా దేశాల అధిపతులను ఎంత తరచుగా కలుసుకుంటూంటారో తెలుసుకోవడం మంచిదే. ఉదాహరణకు పి. సి. అలెగ్జాండర్ మార్గరెట్ థాచర్‌ను ఎంత తరచుగా కలుస్తుంటారు? లేదా కలిసే అవకాశం వస్తూంటుంది. భారత దేశంలోని అమెరికన్ రాయబారి మన ప్రధాన మంత్రిని ఆయన తలచుకున్నప్పుడల్లా కలవ వచ్చు. ఆయన మొన్ననే రేస్‌కోర్సు రోడ్డుకు వెళ్ళి, ఈ బిల్‌కు పాలకుల ఆమోదం లేదని చెప్పాడు. ఇది నిజమేనా అనేదినాకు అనుమానమే. ఎందుకంటే ఇటువంటి బిల్ వైట్‌హౌస్ సహకారం లేకుండా వెలుగు చూడగలిగి ఉండేదే కాదు. రాజీవ్ గాంధీ తన వాషింగ్టన్ యాత్ర సందర్భంగా కలిసిన అధికారులలో కొందరికైనా ఈ రానున్న బిల్ గురించి తెలుసునని, కాని ఏవో స్పష్టమైన కారణాల వల్ల వాళ్ళు మౌనం వహించారనీ నా అనుమానం. ఒకవేళ వాళ్ళకు తెలుసునంటే భారతదేశంలోని అమెరికా రాయబారి కూడా అందులో భాగస్వామి ఉవుతారు. దాన్ని గురించి చిట్టచివరికి వినే వాళ్ళం మనమే అయ్యాం. అది కూడా సూటిగా కాదు, పత్రికల ద్వారా మన పత్రికల ద్వారాకాదు. వాళ్ళ పత్రికల ద్వారా.

చేసిన పని గురించి వాషింగ్టన్‌ను నిందించగల సమయం మించిపోయింది. ఎందుకంటే వాళ్ళు ఎప్పుడూ చేస్తున్నపనినే ఇప్పుడూ చేశారు. మనకు ఇష్టమున్నా లేకపోయినా, ఈ ప్రాంతంలో పాకిస్తానే అమెరికాకు మిత్రదేశం. చాలామంది అమెరికన్లు మనను సోవియెట్‌కు మిత్రులంగా చూస్తున్నారు. ఆటమ్‌బాంబు తయారు చేయడంలో పాకిస్తాన్ కనుక విజయం సాధిస్తే అది అమెరికన్ల కోరిక పైననే జరుగుతుంది. అణు సాంకేతిక విధాన్ని దొంగిలించడం గురించిన ప్రచారమంతా దండగమారి వ్యవహారం. ఎందుకంటే సాంకేతిక విధానం ఎవరో ఒక లోహ శాస్త్రజ్ఞుడు (అణు భౌతిక శాస్త్రజ్ఞుడు కూడా కాదు.) క్షణంలో దొంగిలించడానికి అలీబాబా మాంత్రిక విద్య ఏమీ కాదు. బాంబు తయారు చేయడానికి అవసరమైన దానిలో చాలా భాగం అమెరికా నుంచి కొనడమో, దొంగిలించడమో జరిగింది. దేశం నుంచి బైటికి వెళ్ళే, లోపలికి వచ్చే ప్రతి సమాచారమూ సి. ఐ. ఎ. కంప్యూటర్ల మీద నమోదయ్యే చోట ఇది చాలా అసాధారణమైన సంగతే ఇప్పుడిక పనులన్నీ జరిగి,



బాంబు పరీక్షకు సిద్ధంగా ఉండగా, మనం వాళ్ళు చెప్పిన చోట సంతకం చేయాలి వాషింగ్‌టన్ అంటున్నది. కొన్ని వారాల క్రితం మనకు గంభీరంగా వాగ్దానం చేసిన కంప్యూటర్లు, హైటెక్ రక్షణ పరికరాలు పొందాలంటే ఈ సంతకం తప్పదంటున్నది.

అమెరికా సహాయమూ, అమెరికన్ కంప్యూటర్లూ అంత తీవ్రంగా అవసరమయ్యే స్థితిలోనే మనం నిజంగా ఉన్నామా? వాళ్ళిచ్చిన సహాయంలో చాలా భాగం మనం వాడుకోకుండా వాషింగ్టన్‌లో పడి ఉన్నట్టున్నది. దాదాపు ఎనిమిది బిలియన్ డాలర్ల (పదివేల కోట్ల రూపాయల) సహాయం మన ప్రభుత్వం తీసుకోకుండా ఉన్నదని, దానిమీద 0.75 శాతం మనం స్వీకార పన్నును చెల్లిస్తున్నామని గత సంవత్సరం ప్రపంచ బ్యాంకు ఉపాధ్యక్షుడు డేవిడ్ హాపర్ చెప్పారు ఇలా మార్గమధ్యంలో ఉన్న నిధి అప్పటినుంచి ఇంకాపెరిగిందని, ప్రస్తుతం అది 12 బిలియన్ డాలర్లకు, అంటే 16 వేల కోట్ల రూపాయలకు చేరిందని మరొక ప్రపంచ బ్యాంకు అధికారి చెప్పారు. ఇది కేవలం ప్రపంచ బ్యాంకు సహాయం మాత్రమే. దీనికి మనం ఇతర దేశాల నుంచి పొందనున్న నిధులను కూడా కలిపితే ఈ అంకె 25 వేల కోట్ల రూపాయలకు చేరుతుంది. ఇతోధిక సహాయం అనుమతించనని అమెరికా నిరాకరిస్తూ ఆంక్షలు విధిస్తే, భారీ కంప్యూటర్లను,




ఇతర పరికరాలను పంపించడానికి నిరాకరిస్తే మనకు నిజంగానే నష్టమా?

ఏదేమైనా, నన్ను మళ్ళీ మన రాయబార కార్యాయాలకు, అవి పని చేసే సోమరి పద్ధతికీ వెళ్ళనివ్వండి. మన దౌత్యవేత్తలు ఖచ్చితంగా ఏం చేస్తుంటారు? నేను కొన్ని సంవత్సరాల క్రితం జపాన్ వెళ్ళాను. అప్పుడక్కడ ప్రభుత్వాధికారులు నన్ను కొన్ని పరిశ్రమలకు తీసుకెళ్ళి తమ ఆర్థిక, తదితర విధానాలను వివరించారు. జపాన్ అప్పటికి, అది ఇప్పుడున్న స్థాయికి చేరుకోలేదు కాని, ఆ దేశం ప్రస్తుత స్థితికి చేరుకోవడానికి ఎంత త్వరితగతిన పురోగమిస్తున్నదో నేను గమనించగలిగాను. అక్కడ నేనున్న రోజులలోనే, యాదృచ్ఛికంగా అక్కడి మన దౌత్య కార్యాలయంలోని సీనియర్ దౌత్యవేత్త నొకరిని కలిశాను మేం కలిసి వున్న రెండు గంటలలోనూ ఆయన నాతో మాట్లాడినది జపాన్‌తో ఆర్థిక, పారిశ్రామిక వ్యూహం గురించి కాదు. కాని అత్యాధునిక ఎలక్ట్రానిక్ పరికరాలు కొనుక్కోవడానికి తగిన మంచి డిపార్ట్‌మెంట్ స్టోర్స్‌ల గురించి మాట్లాడాడు. కానీ నాకు ఆ పరికరాల మీద మోజు లేదు గనుక నాకు ఆ సమాచారమంతా నిరుపయోకరమైనదే. ఐనా సరే, అక్కడ ఎన్ని విభిన్నమైన పరికరాలు అందుబాటులో ఉన్నాయో చూడడానికైనా ఆ దుకాణాలకు వెళ్ళమని ఆయన నాకు నచ్చ చెప్పాడు. వేరే దేశాల్లో కూడా నా అనుభవం ఇదే. భారత దౌత్యవేత్తలు తమను, ఇతరులను కూడా విందులూ, విలాసాలలో ముంచి తేల్చుకుంటుంటారు. వాళ్ళ శ్రద్ధకు పాత్రమైన విషయాలను పట్టించుకోవడానికి బహుశా వారికి చాలా తక్కువ సమయం ఉండి ఉంటుంది. ఆయా దేశాలలో తిరుగుబాట్ల గురించి చిట్టచివరికి తెలుసుకునే వ్యక్తులు మన రాయబారులే. ఇది గతంలో చాలాసార్లు జరిగింది. ఇప్పుడు మళ్ళీ మరోసారి జరిగింది ☐

సీరియల్

# ఆడపిల్లలు - అనుభవాలు

హరికిషన్

(గతసంచిక తరువాయి)

## ప్రేమకు నిర్వచనం :-

జగదీష్ సిటీ బస్ దిగి యూనివర్శిటీ కాంపస్‌లోకి వెళుతున్నాడు తలవంచుకునే పక్కనుంచే దూసుకుపోయాడు స్కూటర్‌మీద అభిలాష్. పలకరించలేదు. క్లాస్ రూమ్‌లోనూ, కారిడార్‌లోనూ ఎదురుపడినా స్నేహంగా, దర్జాగా, గర్విష్ఠిగా వెళ్ళేవాడు అభిలాష్ పక్కకు తొలిగి నమ్రతగా నడిచివెళ్ళేవాడు జగదీష్. అభిలాష్‌తో తనే మాట్లాడాలని అనుకున్నా అతను ఆ అవకాశాన్ని ఇవ్వడంలేదు

ఈవిధంగా వారం గడిచింది. ఒక ఆదివారం రోజున ఉండబట్టలేక జగదీష్ చెల్లెలు శ్రీవిద్య అభిలాష్ ఇంటికి వెళ్ళింది, ఇద్దరికీ ఇంత బద్ధవైరం ఎందుకో తెల్సుకుందామని

గేటు తీసుకుని వెళ్ళింది. లాన్‌లో కూర్చుని ఉత్తరం రాసుకుంటున్నాడు అభిలాష్. తలెత్తి చూశాడు, తలవంచుకుని నిల్చున్నది శ్రీవిద్య

"నమస్కారం అభిలాష్ అన్నయ్యా" అన్నది.

"రాయబారం వచ్చావా రాక్షసీ" అన్నాడు పుస్తకం మూసేసి.

పెదవి కొరుక్కుంటూ చూసింది.

"అన్నయ్యా అని ఓ తురుపుముక్క విసిరేశావ్, నేను నిన్ను రేప్ చేస్తానని భయపడ్డావా" వెటకారంగా అన్నాడు.

పళ్ళు కొరుక్కుని చూసింది

"పరాయివాడు ఆడపిల్లని బలవంతంగా అనుభవించటమే రేప్ కాదు అభిలాష్‌గారూ, అహంభావంతో ఆడపిల్లల్ని బర్తడే అని పిల్చి అవమానపర్చడం, రేప్‌కి మించిన దారుణమైన ఘాతుకం" అన్నది. అక్కడే నిల్చుని. పక్కన కుర్చీ ఉన్నా కూర్చోమని కూడా అనలేదు అభిలాష్.

"వెరిగుడ్, ఎందుకొచ్చావో సూటిగా చెప్పు "

"చెప్తాను మా జగదీష్ అన్నయ్యతో విరోధభావం పెంచుకోవటానికి కారణం"

"వాడికి ఉన్న పొగరు, నాతోనే నన్ను గురించి నీచంగా మాట్లాడడం" కసిగా చూస్తూ అన్నాడు.

"అభిలాష్‌గారూ! ఆవేశపడకండి. నేరం స్వభావాన్ని బట్టి హితవు కూడా నిష్కర్షగా చెప్పాలి, ఆ నేరం ఏమిటి? అని మీరే ప్రశ్నిస్తారు మభ్యపెట్టి ఆడపిల్లల్ని ఇంటికి పిల్చి, పెళ్ళి చేసుకుంటాను అని చెప్పడం సభ్యత అంటారా, మిమ్మల్ని కంట్రోల్ చెయ్యటానికే అన్నయ్య అట్లా అన్నాడు. మీ పరువు దిగజారిపోతే వాడికిమాత్రం నామోషీకాదూ, అక్కడికీ అన్నయ్య రాయబారానికి వెళ్ళొచ్చాడు' అన్నది అతని ముఖ కవళికల్ని చూస్తూ

"మీ అన్నయ్య రాయబారం వెళ్ళిన సంగతి నాకు తెలుసు వారిద్దరూ నన్ను అవమానకరంగా మాట్లాడుతుంటే విని ఆనందించాడనీ నాకు తెలుసు అసలు వాడు ఏ ఉద్దేశ్యంతో వెళ్ళాడో గ్రహించావా" ఆక్రోశంతో అన్నాడు

"లేదు'

"సిస్టరాఫ్‌దట్ ఇడియట్, అతను తన కాబోయే భార్యను సెలక్ట్ చేసుకోటానికి డబ్బు దేవుడిని కూడా కొనగలదు, వీడొక లెక్కా"

"అన్నయ్యకు అట్లాంటి ఉద్దేశ్యం లేదు, నా పెళ్ళి కొందే అన్నయ్య పెళ్ళి చేసుకోడు."

పకపక నవ్వేడు. పగలబడి నవ్వేడు వికృతంగా నవ్వేడు.

"నిన్నూ, నీ యౌవ్వనాన్నీ నా గుప్పిట్లోకి తీసుకుని నలిపి పారేస్తాను. ఆ దౌర్భాగ్యుడు నీకు పెళ్ళి కూడా చేస్తాడూ, డర్టీ క్రేచర్"

దగ్గరకు వచ్చి చెయ్యి పుచ్చుకున్నాడు, అరిచి పెనుగులాడింది శ్రీవిద్య. ఇదంతా అభిలాష్ తల్లి శాంతాదేవి మేడమీదినుంచీ చూస్తున్నది "అభిలాష్" ఒక్కసారి గట్టిగా కేకపెట్టింది.

మేడ దిగి వచ్చింది. మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

"శ్రీవిద్యా, పౌరుషం స్వాతిశయం, అభిమానం అందరికీ ఉంటయ్యి. ఆడపిల్లకు ఇంగితజ్ఞానమే పెద్ద ఆస్తి. మగవాడిని ఎన్నడూ రెట్టించకు. ఆడది రెట్టిస్తే మగవాడు పశువౌతాడు, బి కేర్‌ఫుల్ ఇక వెళ్ళు, ఎన్నడూ ఇక్కడికి రాకు" అన్నదావిడ.

మాట్లాడకుండా వెళ్ళింది శ్రీవిద్య. పక్కన కుర్చీలో కూర్చున్న దావిడ

"అభిలాష్, కూర్చో" కుర్చీలో కూర్చున్నాడు

"ప్రేమను గురించి నీ అభిప్రాయం"

"ఏం లేదు. ఇష్టపడటం"

"అంటే కోరిక అనేగా నువ్వనేది"

'అవును, ఆ ఇద్దర్లో ఎవరు ఇష్టపడ్డా నేను ప్రేమిస్తాను"

ఆవిడ కళ్ళు చెమ్మగిల్లాయి.

"గుండె లోతుల్లో నుంచీ, అభిమానం, ఆపేక్ష, గౌరవం, అణువణువూ ఆశించి స్పందించి స్పందింపచేసేదే ప్రేమ కాని, నోటితో ఉచ్చరించే రెండక్షరాలే ప్రేమ కాదురా. ప్రేమిస్తున్నానని చెపుతూ, వాళ్ళమీద నువ్వు పగతో ఉన్నావే కాని, ఆత్మీయతతో ప్రేమించటం లేదురా, నేను నమ్మను" అన్నదావిడ.

"నన్ను నువ్వూ అనుమానిస్తున్నావా, అమ్మా"

"కొడుకు ఉన్మత్తుడయినప్పుడు, అనుమానించవలసింది తల్లిదండ్రులేరా అభిలాష్. ఆ ఇద్దరమ్మాయిల్లో ఎవరూ నిన్ను ప్రేమించలేదు, పెళ్ళి చేసుకోటానికి ఇష్టపడలేదు, నీ చర్యవల్ల మన అంతస్తు దెబ్బ తింటుందేకాని ప్రయోజనం లేదురా. కర్మ కాకపోతే కసిరి కొట్టే వాళ్ళ వెంటపడటం చిన్నతనం కదురా, అభిలాష్ నా మాట విను ఈ పట్టుదలవల్ల అల్లరి పడేది నువ్వేరా" అనునయంగా అన్న దావిడ.

"అమ్మా, నాకు చదువున్నది, ఆస్తీ, స్టేటస్ ఉన్నాయి, కోరుకుంటే కోటిమంది కన్యాదాతలు నాకు తమ పిల్లల్ని ఇచ్చి పెళ్ళి చెయ్యటానికి సిద్ధపడతారు. కాని నేను భార్యగా పొందాలనుకున్నది ఆ ఇద్దర్లో ఒకర్ని. అసలీ

జరిగిన కథ- 3: అభిలాష్ తమలో ఎవరినో ఒకరిని చేసుకుంటానని అవమానించాడని సత్యభామ, సావిత్రి కోపం తెచ్చుకుంటారు. అభిలాష్‌కు, జగదీష్‌కు మధ్య మనస్పర్ధ ఏర్పడుతుంది. జగదీష్ సత్యభామ, సావిత్రిల దగ్గరికి రాయబారం వెళతాడు సత్యభామ జగదీష్‌అంటే ఇష్టం కలిగిందని చెపుతుంది. సావిత్రి అభిలాష్‌ను నిరాకరిస్తుంది.

నాటకం ఆడిస్తున్నది ఆ జగదీష్. నాది పట్టుదల కాదమ్మా, ఇష్టత, కోరిక, తపన ఏనాటికయినా నేను పెళ్ళి చేసుకుంటే ఆ సత్యభామనుకాని, సావిత్రినికాని చేసుకుంటాను. లేదా, కొడుకు పగ ఎటువంటిదో తల్లి చూస్తుంది" అన్నాడు అభిలాష్. ఆవిడ మాట్లాడకుండా మేడమీదికి వెళ్ళింది.

అభిలాష్ ఎక్కడికో బయల్దేరాడు తల్లి మేడమీదినుంచీ చూస్తూనే ఉన్నది. ఆవిడ మనస్సులో భయం ఒక అరను ఏర్పర్చుకున్నది. ఆఫీసరూంలో కూర్చుని రాసుకుంటున్న భర్తతో అన్నది.

"అభిలాష్ సంగతి చూస్తున్నారుగా"

"చూశాను, వాడికి తెలివి తేటలున్నయ్యి. విచక్షణాజ్ఞానం తెలుసు. కాని మూర్ఖత్వం పూర్తిగా వాడిని ఆవేసించింది. చెప్పే వయస్సూ, భయపెట్టే వయస్సూ కాదు. మన పూర్వజన్మ కర్మఫలం అభిలాష్" అన్నాడాయన నిర్లిప్తతగా.

"మీరు చెప్పిచూడాలి"

"నా పుట్టిన రోజని ఆనాడు సర్వ అబద్ధాలూ చెప్పినవాడు నా మాట వాడు వినడు. శాంతా, నీవల్ల వాడిని కనటం చేతయిందికాని, వాడు గౌరవప్రదంగా జీవించేటట్లు చూడడం నావల్ల కాదు. బంగారంమీద ఒటికుండను బోర్లించి తిరుగుతున్నాడు వాడు. అరెస్ట్ అయితే జామీను ఉండగలను. అంతకన్న నేనేమీ చెయ్యలేను శాంతా" అన్నాడు అవ్యక్త వ్యథను వ్యక్తం చేస్తూ.

మాట్లాడకుండా వెళ్ళిందావిడ.

అభిలాష్ తన స్నేహితుడు వాసు ఇంటికి వెళ్ళేడు. వాసు ఇంటర్‌తో చదువు ఆపేశాడు. చిత్తు కాగితాల ఎక్స్‌పోర్ట్ వ్యాపారం, బాగానే సాగుతున్నది అతని వ్యాపారం.

భార్య రుక్మిణి. ఒక పసివాడు రెండేళ్ళవాడు. వాసు భావ కవిత్వం చెపుతాడు. కొన్ని గేయాలూ పుస్తక రూపంలో వచ్చాయి అభిలాష్‌ని చూడగానే సాదరంగా ఆహ్వానించాడు వాసు. ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు. వాసుకి కాస్త క్రికెట్ పిచ్చి ఉన్నది భార్య రుక్మిణికి చేతులో నవల ఉంటే కాఫీ తాగటం కూడా మానేస్తుంది. చూడ ముచ్చటగా, అనురాగ ఆప్యాయతలతో కాపురం చేస్తున్నారా దంపతులు. అభిలాష్‌కన్న ఏడాది పెద్ద వాసు.

"ఊరకరారు స్నేహితులు, కొందరు గాథలు చెప్పటానికి వస్తారు, కొందరు బాధలు దాచుకుని వస్తారు, ఏదీ ఓ కమ్మని కబురు చెప్పవోయ్ అభిలాష్" అన్నాడు వాసు.

"గాథలో నే బాధలూ ఉన్నయ్యి. చూడూ నా పాతికోఏట ఓ పెద్ద సమస్య వచ్చి పడ్డది. ప్రేమించి పెళ్ళి చేసుకోవాలా, పెళ్ళి చేసుకుని ప్రేమించాలా" అన్నాడు అభిలాష్.

విరగబడి నవ్వేడు వాసు. ఈ మాటలు విన్న రుక్మిణి నవలల బీరువాలో ఓ నవల తీసి, ఒకపేరా తీసి, పేజీ గుర్తుపెట్టింది.

"నీ ప్రశ్న సరి పాత అన్సరబుల్ క్వశ్చన్. ప్రేమించి పెళ్ళి చేసుకోవటం అంటే పోస్ట్‌మార్టం కేసు లాంటిది. పెళ్ళయాక ప్రేమించటం అంటే యాక్సిడెంట్ కాకుండా తప్పుకోటంలాంటిది" అన్నాడు వాసు.

అర్థంకాక చూశాడు అభిలాష్. తనని పిలిస్తే నవలలో ఆ పేరాని చదివి వినిపిద్దామనుకున్నది రుక్మిణి రెండు సార్లు చదివి బట్టీ పట్టింది.

"అర్థం కాలేదోయ్, వేస్ట్ పేపర్ వ్యాపారీ" అన్నాడు అభిలాష్ నవ్వుతూ.

'చూడూ, అసలు ప్రేమ అనేది ఓ షాక్ లాంటిది ఒక వ్యక్తిలో పర్సెంటేజ్ ఆఫ్ ఇష్టత ఎక్కువై రక్తంలో ఆ ఇష్టతా పురాణులు బాగా ఎక్కువై తొలుస్తుంటే కలిగే ఆ ఫీలింగ్‌నే ప్రేమ అన్నారు. చదువులో అప్షనల్ సబ్జక్టు, పోస్ట్ గ్రాడ్యుఏషన్‌లో మెయిన్ ఉన్నట్టే, అనుభూతి, అనే డిగ్రీకి ప్రేమ మెయిన్ సబ్జక్టు. ఇంకా చెప్పాలంటే వర్కింగ్ షీట్ లేకుండానే లెక్కకు ఆన్సర్ వెయ్యటం లాంటిది ప్రేమ. ఇక పెళ్ళాన్ని ప్రేమించటం సాంప్రదాయ లక్షణమే కాక ఆరోగ్యప్రదం కూడా. ఇకనన్నడిగితే ప్రేమ అనేది ఓ రకమైన ఫ్లూ జ్వరం లాంటిది. ఆ జ్వరం ఇద్దరికీవస్తే చాలా మంచిది. ఒకరికి వచ్చి రెండో వారికి ఆ జ్వరం రాలేదనుకో, ఇక అతనికి మిగిలేది సంధి ప్రేలాపన. ఇంతకీ నీది ఏ కోవకు చెందింది బ్రదర్" అన్నాడు వాసు భుజంమీద చెయ్యి వేసి

"నువ్వొట్టి థీరిటికల్ ఇడియట్‌లా ఉన్నావురా, ప్రాక్టికల్ ప్లెజర్ నీకు తెలీదు. నువ్వూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నట్టు ఆనాడు చెప్పినట్టు గుర్తు. అందేత ఓ సలహా పారేస్తావేమోనని వచ్చా" అన్నాడు అభిలాష్

"రుక్మిణీ" అన్నాడు వాసు ఈ పిలుపు కోసమే ఎదురు చూస్తున్నది రుక్మిణి. వయస్సు ఇరవై రెండు స్లీవ్‌లెస్ జాకెట్ వేసుకుని, పమిట నిండుగా కప్పుకుని హుందాతనం ఉట్టిపడుతూ ఉంటుంది.

రుక్మిణీ విన్నావుగా? నీ అభిప్రాయం చాలా విలువైనదని చెప్పేను" అన్నాడు వాసు. రుక్మిణి పుస్తకం మూసేసింది. క్షణంసేపు అభిలాష్ వైపు చూసింది. వంటింట్లోకి వెళ్ళి బ్లాక్ టీ తయారు చేసి ఇద్దరికీ తెచ్చి ఇచ్చింది తనూ తీసుకున్నది. ముగ్గురూ బ్లాక్‌టీ తాగేరు

"ఫెంటాస్టిక్. నల్ల టీ చాలా బావున్నది" అన్నాడు అభిలాష్.

"చిక్కని టీ డికాషన్, తేనె, నిమ్మరసం. పంచదార, నీటి మేలి కలయిక, ఆ బ్లాక్ టీ. ప్రేమ ముందా, పెళ్ళి ముందా అనేది ఫండమెంటల్ పాయింట్. ఏది ముందయినా కావలసింది పదునైన ఆలోచన పరువైన బుద్ధి, ఈ రెండూ ఉంటే ఆ కాపురం ఆయుర్దాయం తీరేంతవరకూ వర్ధిల్లుతుంది" అన్నది రుక్మిణి

"మీదీ ప్రేమ వివాహంరా వాసూ" అభిలాష్ ప్రశ్న.

నవ్వేడు వాసు



"అసలు ప్రేమ అంటే నాకు తేమ అనిపిస్తుంది. కావలసింది చక్కని మనస్సు, సరైన అవగాహన. సంస్కార భావాలతో నిండిన హృదయం, ఓ చిన్న ఉదాహరణ నేను స్లీవ్‌లెస్ జాకెట్ వేసుకున్నాను, నా ఇష్టం నాది, వారు కష్టం పెట్టుకుంటే? ఇద్దరిమధ్య మానసిక వ్యధ పోటీకి నామినేషన్ వేస్తుంది. వారు సహృదయంతో సరేనన్నారు, దట్సాల్. ఆ విషయం కూడా ప్రేమ అనే మా భావం. అంటే ప్రేమకు ఎప్పుడూ కామ భావన మోతాదు ఎక్కువగా ఉండకూడదు గౌరవభావనే ఎక్కువగా ఉండాలి. సో దటీజ్ లవ్" అన్నది రుక్మిణి.

విని విస్తుపోయాడు. నవ్వుతూ చూసేడు వాసు, ఆ భార్యా భర్తల వైపు చూస్తూ కూర్చున్నాడు అభిలాష్. చేతులు కట్టుకుని నిల్చున్నది రుక్మిణి

"కూర్చోండి" అన్నాడు అభిలాష్

"ఫరవాలేదు. నాకు రెండు వేల రూపాయలు పెట్టి ఓ మాంఛి కంచి పట్టుచీరె కొనాలని ఉన్నది అదే స్త్రీ సహజమైన కోరిక. వారితో చెప్తాను, సరేనంటే సంతోషపడటం, వద్దంటే మూతి ముడుచుకోవటం. అది సరైన లక్షణం కాదు. అసలు అంతటి స్తోమత ఉన్నదా అని నేను ఆలోచించి, నా భర్త ఆర్థికపు పరిస్థితిని అర్థం చేసుకోటమే ప్రేమ, దటీజ్ లవ్" అన్నది రుక్మిణి.

పెదవులు కొరుక్కుంటూ కూర్చున్నాడు అభిలాష్.

"అభిలాష్‌గారూ, మా పెళ్ళిలో మిమ్మల్ని మావారు పరిచయం చేశారు ఆ తరవాత రెండు మూడు సార్లు మా ఇంటికి వచ్చారు మీ మనస్తత్వం కాస్త అర్థమైంది ఆడపిల్ల పేర ఓ అయిదెకరాలు రాసి ప్రేమను కొనలేరు వయస్సును వర్ధించే ప్రేమను ఆకట్టుకోలేరు ప్రేమ ఓ బ్యాంక్ పాస్‌బుక్ లాంటిది, టైంటేబుల్ లాంటిది, గ్రీన్‌కార్డ్ లాంటిదేకాదు, ఫలాని అమ్మాయిని ప్రేమించాను, ఫలాని అబ్బాయిని ప్రేమించాను అని చెప్పటం ఫ్లాష్‌బ్యాక్ కోరిక ఆ కోరికకు ఆధారం శారీరక అలజడి, ఈ రెంటినీ కవరప్ చేసుకోటానికే స్టైలిష్‌గా ప్రేమించాను. అని డిక్లేర్ చేస్తారు. ఓ చిన్న ఉదాహరణ. భార్యను అమితంగా ప్రేమించే జనం ఆ భార్య "కేర్‌ఫ్రీ" రోజుల్లో విసుక్కుంటారు". అన్నది రుక్మిణి

అభిలాష్ కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి. చలించిపోయాడు. అతని కళ్ళు తుడిచాడు వాసు.

"రుక్మిణిగారూ, చాలా సంతోషం, మార్వెలెస్‌గా మాట్లాడుతున్నారు, ఒరేయ్ వాసూ, ఇటువంటి వ్యాఖ్యాతను పెళ్ళాడిన నువ్వు సూపర్ డీలక్స్ అదృష్టవంతుడివిరా, మీకు నా అభినందనలు" అని నమస్కరించి వెళ్ళేడు అభిలాష్.

"రుక్మిణీ, తన ఆస్తి చూసి అందరూ ప్రేమించేస్తారు అనే ధీమాతో వాడు పెరుగుతున్నాడు. పూర్‌ఫెలో" అన్నాడు వాసు.

నవ్వుతూ నిర్లిప్తతగా చూసింది రుక్మిణి.

అభిలాష్ ఇంటికి వెళ్ళేడు అతనికి ఏం తోచటం లేదు, మనస్సంతా వెలితిగా ఉన్నది. అనాడు ఆ రీతిగా మాట్లాడి జగదీష్‌కు దూరమయినాడు. తను ప్రేమించానని చెప్పిన ఇద్దర్లో ఎవ్వరూ తనను పెళ్ళి చేసుకోటానికి పూనుకోవటం లేదు మెల్లిగా తల్లి గదిలోకి వెళ్ళేడు. అతని కళ్ళు చెమర్చాయి

"అమ్మా, నేను ఎమ్. కాం. డిస్‌కంటిన్యూ చేద్దామనుకుంటున్నాను. నా మనస్సు బావుండటంలేదు. ఏదో చెప్పలేని వెలితి, ఏదో పోగొట్టుకున్న బాధ. రేపట్నుంచీ యూనివర్శిటీకి వెళ్ళను" అన్నాడు

"బావుందిరా, చదువు అక్కర్లేదు, పెళ్ళి చెయ్యమంటావా, అంత తొందరపడుతున్నావురా" కోపంగా అన్నదావిడ

"అమ్మా, ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనే కోరిక నాకు లేదు. కాని ఆ ఇద్దర్నీ చూశాక, ఎవరయినా ఒకరు నా భార్య అయితే బావుండుననే కోరిక నాలో కలిగింది. కాని నేనేదో స్త్రీని అగౌరవంగా చూసేవాడిననీ, అనుభవించి నలిపిపారేసే వాడిననీ, ప్రేమానురాగాలు నాలో మృగ్యమనీ, చాలా త్వరగా ఇటీవల నాకు ముద్ర పడింది. ఏ ఆడపిల్లనీ అంత చులకనగా నేను చూడనేలేదు కాని ఈ అభాండం నామీద వచ్చి పడింది. అమ్మా! ఇంతకన్న నేనేమీ చెప్పలేను జగదీష్ కూడా నాకు దూరమయినాడు" అన్నాడు

ఆవిడ మనస్సు తల్లడిల్లింది

"అభిలాష్! ప్రేమ అనే దానికి సరయిన నిర్వచనం లేదురా, కాని ఇష్టపడి మనస్సుల్ని అర్థం చేసుకుని, హృదయ స్పందనతో పరస్పరం గౌరవంగా ఇష్టపడటమే ప్రేమకు మూలం అటువంటి అర్థం చేసుకోలేని, ఇష్టపడని అమ్మాయిని చూసి, నేను ప్రేమించాను అంటే సరిపోదురా పరస్పరం ఇష్టపడాలి, అంగీకారం ఉండాలి అంతేగాని ఫలాని అమ్మాయిని ప్రేమించాను, ఎందుకు పెళ్ళి చేసుకోదో చూస్తాను అని నీ అంతట నువ్వు అనుకోటం ప్రేమ కాదు మూర్ఖత్వం, తెలివి తక్కువతనం, ఇంకా ఆలోచిస్తే రౌడీతనం, ఈ పిచ్చితనం మానుకో నిన్ను ప్రేమించే అమ్మాయిని చూడు, అంతేకాని నీ వాదనకు బలం లేదురా" అన్నదావిడ

నిర్లిప్తతగా నవ్వేడు.

"అమ్మా, నేను స్త్రీ లోలుడినీ, వ్యసనపరుణ్ణీ కాదు, కాని నాకు శాడిస్ట్ అనే బిరుదు కూడా వచ్చింది. వచ్చిన పేరురానే వచ్చింది ఆ పేరు నిలబెట్టుకుంటాను" అన్నాడు పిడికిలి బిగిస్తూ అభిలాష్. ఆవిడ కొడుకు పరిస్థితి చూసి ఇంకా భయపడ్డది.

"అభిలాష్, ఏ అఘాయిత్యం చెయ్యనని నాకు మాట ఇవ్వరా, పట్టుదలకు పోయి పరువు పోగొట్టుకోవద్దు" అని కళ్ళు తుడ్చుకున్నదావిడ

"అమ్మా! నేనెప్పుడూ ఓడిపోను, ఓడిపోతే ఆ తప్పు నాదికాదు నీది. నీకు కోడలు వచ్చే గీత లేదనే అనుకుంటాను" అన్నాడు అభిలాష్.

(ఇంకా ఉంది)



# కోహినూర్

సుతిమెత్తని నీ చిరునవ్వుల వెల్గులు
సుగమం చేస్తాయి నా భవితవ్యాన్ని
జీవిత సోపానాల అధిరోహణలో
నేను ఒంటరిగాదు జంటగా నీ బాహుబంధం
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదాయకమైన లూబ్రికేటెడ్
కండోమ్ ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది




ttk తయారీ

MAA (S) LRC 4 A TEL 86

# అభిష్యోకం. కొటమంటి కొపతీరాళ్ళు



గుండెలోంచి ఆయాసం తన్నుకొచ్చేస్తున్నా పరుగాపలేదు, వేగం తగ్గించలేదు. ఎదురుగా ఓ పెద్ద మనిషి రావడం గమనించింది మంగి. అవును, అతని చేతికి వాచీకూడా వుంది. దగ్గిరసా వచ్చేసేడు.

"ఏండీ..... టైమెంతయ్యిందండీ" ఆగి అడిగింది.

"పది."

తృప్తిపడలేదు. అందుకని అతని వెనకపడి పరిగెత్తి... "సరింగా ఎంతయ్యిందండీ...." అని మళ్ళీ అడిగింది.

"సరిగ్గా పదీ పది.... సరా" అంటూ అతను నడకవేగం పెంచేసరికి తిరిగి బడివైపు పరుగందు కుంది మంగి.

సాలిపేట నుండి కంటోన్మెంటు మున్సిపల్ హైస్కూలుకు వెళ్ళాలంటే ఎలాలేదన్నా పావుగంటకి తక్కువవ్వదు. మరాలెక్కని పదిన్నరకిగాని చేరుకోలేదు. మంగి గుండె బేజారైపోయింది.

పరిగెడుతూ పరిగెడుతూంటే ఆలోచనలు గొలుసులు గొలుసులుగా మంగిని చుట్టేస్తున్నాయి.

'ఇయాళ నాకుంది పెళ్ళి. ఫస్టుపీరీడు సోసలు మేస్టు. దుమ్ముదుళ్ళగొట్టేస్తారు. పదిగంటల్కి బడైతే పదిన్నరకంటే రాడం..... తియ్యంటూ గుంజిళ్ళయినా తియ్యించేస్తారు..... పటమని సెయ్యైనా పట్టమంటారు.....

'నిన్నటికి నిన్నా ఆకరి పీరీడు సెప్పకుండొచ్చేసేను. అదీ' సోసలు పీరీడే. నలుగ్గంటలకి మూడో పీరీడయ్యిందని గంట కొడ్తారు. ఆకరి పీరీ డప్పుడు మొదలు. సరింగప్పుడే సాలిపేటకీ కంట్రమెంటుకీ మజ్జినున్న కొళా యొగ్గుతారు. మంచీళ్ళు పట్టేడూటీ అప్పది. కాని నిన్న మూడో పీరీడప్పుడు క్రాఫ్టు పీరీడు. సత్తెవప్పొచ్చింది.... ఒలి మంగి అమ్మకి బాగో నేదు.... మల్లీ తిరగబెట్టింది..... కనకం పిన్నీ, నానూ అస్పత్రికెల్తన్నం..... ఇగో తాళం. మేష్టారినడి గింటికెల్లే..... నా నట్నించొచ్చే సరికే యేలవుద్దో, ఆ సేత్తో అలాగే నాలుగు బిందిలు మోసీయెతల్తీ్లీ అని సెప్పింది. మేష్టారి నడి గెల్లమంది. సోసలు మేస్టు ఒగ్గరు. మరంచేత సెప్పకుండా సెయ్యకుండా పారొచ్చేసింది......

'అవునమ్మో..... ఇప్పుడు గేపకవొచ్చింది. మూడు ప్రెశ్న లప్పజెప్పుకుంటానన్నారు సోసలు మేస్టు.... ప్రెశ్నలంటే ప్రెశ్నలుకావు. ఆటికి జవాబులు. నిన్ననే అప్పజెప్పుకుంటానన్నారు. ఇయేళతప్పదు. నా ఒళ్ళు నాదికాదు.'

గుండెలు భయంతో దడదడమనగానే ఆలోచన గొలుసులు తెగిపోయేయి.

'ఆ అయ్యన్నపేట గుంటనేదా...... లష్మి. దాన్నుండే ఆలీసెం. నా నొచ్చేదాకుండే ఏస్తైన్ను నోట్సు రాస్కోవాల అన్నాదా...... బేగి రావొద్దూ' అని బయటికేగొణుక్కుంది మంగి.

"అమ్మొకర్తి..... పోనీ అదొచ్చేవరకు సోసలు సదువుదారని కూసుంటే, ఒలి నీ సదువు సంతకుదోలా.... సూరంతా పొగ నిండిపోతందే ఎగదొయ్యే..... అంటూ ఖంగు ఖంగుమని మంచంలో నుంచే దగ్గులూ..... కేకలూ..... మరింకేటి సదివేది' పైకే విసుగ్గా అనుకుంది.

"ఒలి మంగీ..." వెనకనుండి కేక.

పరుగాపింది. అందాకా తీసిన పరుగు ముందుకు తోసేస్తున్నాది. గొంతు తడారిపోయింది. ఝూపోస్తూ వెనక్కి చూసింది మంగి.

'అదే. లష్మి. ఉండే అంటూ చెయ్యూపుతున్నాది.... రా..... నీపని చెపుతాను' అనుకుంది.

కుడిచేతిలో దొంతెడు పుస్తకాలు. ఎడంచేతిలో సిల్వరు కేరేజి. దానికితోడు లంగా బొందూడిపోతోంది. మోచేత్తో అదుముకుంటూ పరిగెత్తుకు వచ్చింది. కసిక్కిన నవ్వింది మంగి. ఆయాసంతోనూ, మేస్టారి భయంతోనూ వచ్చిన ఆ నవ్వు నవ్వులా లేదు. గంట కిందటినవమనాన్ని నోట్లో వుంచుకుని వుంచుకుని ఒక్కసారిగా కక్కినట్టుంది.

"ఏంటో లెమంగీ.. అంత గీరవాణం.. ఇంటి కాడుండే ఒచ్చేస్తానంటే ఏంటమ్మా పారొచ్చేస్తున్నావు... అంతా కులికి డ్రం బుద్దేనే.." అంది లక్ష్మి కేరేజీ, పుస్తకాలూ కిందన పెట్టి లంగా బొందు ముడేసుకుంటూ.

"నీకెన్ని సుట్లు సెప్పేను. మంగి అనొద్దని. మంగవేణీ అని పిల్లేవేటి?" అంది కోపంగా మంగి. మెల్లగా నడక మొదలెట్టేరిద్దరూ. అయినాలస్యం ఎలాగూ అయింది.

"నువ్వు మట్టుకు లష్మిఅని పిల్చంనేదా... వొర్లష్మీ అని పిల్చేవా?"

"తొమ్మిది గంటల్కొస్తానన్న దానివి పదయినా పత్తాలేక పోతేటి సేసేది.." అంది ఇందాకటి మాటకి జవాబుగా.

మరికిక్కురు మన్లేదు లక్ష్మి. కాసేపుండి మాట మార్చింది.

"అవునొతె.. సోసలు ప్రెశ్నలొచ్చేసునే? మేస్టు తంతారు గావాల"

"నేదు... ముద్దెట్టుగుంటారు. రొండు సుట్లు. ఆలీసెం అయినందుకూ, అప్పజెప్పనందుకూను... పదపద... బేగినడు." అంది విసుగ్గా మంగి.

ఎదురుగా బడి.

బడి గేటు పులినోరులా ఆవలించుకునుంది.

గ్రౌండంతా నిశ్శబ్దంగా వుంది.

తొమ్మిదో క్లాసు ఏ సెక్షను కంటోన్మెంటు కబేళాలా వుంది. సగం మంది బెంచీల మీద నిలబడి చూరుకు వేళ్ళాడేసిన కోసేసిన గొర్రెల్లా వున్నారు. గోక పేట గొర్రెలోళ్ళ పిల్లైతే గోడ కుర్చీ వేసి కొయ్యడానికి కూర్చోపెట్టిన మేకలా వుంది. మేస్టారి ముఖం రాక్షసుడు నవ్వితే ఎలాగుంటాడో అలా గుంది.

"ఎన్ని గంటలకే బడి.." అని గర్జించేరు సోషలు మేష్టారు.

"అవునే మంగవేణీ... ఇలారా.. నిన్న నాఖరి పిరియడు ఎక్కడికి పోయేవు? పైగా ఇప్పుడాలస్యం. అప్పజెప్పుకుంటా నన్నెప్పి దొంగ వేషాలు వేస్తావూ... నువ్వు వేషాలేస్తే నేనొదిలేస్తానూ..." అంటూ మంగి చెవి దొరకపుచ్చుకున్నారు.

పైప్రాణాలు పైనే పోయేయి మంగికి.

"చెప్పు...పోనీ ఆలస్యంగా వస్తే వచ్చేవు. నిన్న నెగ్గొడితే ఎగ్గొట్టేవు. జవాబు లొచ్చునా..."

ఒస్తున్న దుఃఖాన్ని కలుగుతున్న భయాన్ని అదుపులో పెట్టుకోబోవడంలో ముఖం వికారంగా తయారైంది ఆ ముఖం చూడగానే బోధ పడింది మేష్టారికి.

"మిమ్మల్నిలా కాదే.." అంటూ చెవి మెలి పెట్టి. " రేపొచ్చేటపుడు మీ అయ్యని తీసుకురా.."

అయ్య మాటెత్తే సరికి మంచంలో జబ్బుతో పడున్న అమ్మ కళ్ళ ముందు కదిలింది

"బెల్లం కొట్టిన రాయిలా నోరు మెదపవేం? చెప్పు మీ అయ్యింట్లో వున్నాడా?" చెవి పట్టుకు ఊపుతూ అడిగేరు మేస్టారు

"నేడండి .. సచ్చిపోయేడు "

గతుక్కుమన్నారు గబుక్కున చెవి వదిలేసేరు వెంటనే సర్దుకుని, గంభీరంగా "అయితే మీ అమ్మని తీసుకురా. " అన్చెప్పి జవాబు కోసం చూడకుండా లక్ష్మి పని పట్టించేరు అదయ్యేక అక్కడ నిలబడి చదమన్నారు

కళ్ళముందు పుస్తకంవున్నా అక్షరాలవెంట పరుగులు తియ్యడంలేదు మంగి కళ్ళు

అల్లక్కడ ఆరో క్లాసులో పొట్టేలు వెనక గొర్రెల మంద కుమ్మకు వెళ్తున్నట్టు, లీడరేదో గట్టిగా అరుస్తూంటే వంతపాడుతున్నారు ఇంకా పదకొండు గంటలయినా కాలేదు గాని పదో క్లాసు కుర్రాళ్ళు పదిమంది గ్రౌండులో చేరిపోయి సాయంకాలం ఆడాల్సిన కబాడీకి రంగం సిద్ధం చేసుకుంటున్నారు పన్లేపని ఒకళ్ళమీ దొకళ్ళు ఇసకని జల్లుకుంటున్నారు తొమ్మిదీ బీ నుండి తుంటరిపిల్ల ఒకర్తె మంగినిచూస్తూ.. "అయిందా పెళ్ళి. అచ్చికచ్చా" అన్నట్టుగా చూపుడువేలు ఝాడిస్తోంది ఏదో క్లాసులోనో మరెక్కడో ఓ పెద్ద కుక్క గయ్యిమంటే, చిన్నకుక్క కుయ్యికుయ్యిమన్నట్టు మేస్టారి కేకా, ఆ వెనక ఓ పిల్ల ఏడుపూ వినిపిస్తున్నాయి

గంట కొట్టేరు

'ఏ రోజు చెప్పిం దారోజే పరగడుపు మిమ్మల్ని, ఈ స్కూలునీ బాగుచెయ్యడం బ్రహ్మతరంకాదు ఊఁ లోపలికి తగలడండి " అంటూ మరోసారి అక్షింతలువేసి బయటికి నడిచేరు సోషలు మేస్టారు.

సర్రునఆయన వెనకపరిగెత్తింది లావణ్య

ఎర్రర్రగా, నీలం నీలంగా వున్న అంతంత పువ్వులతో తెల్లటి పట్టుకుచ్చులాంటి లంగాకున్న కుచ్చెళ్ళన్నీ సముద్ర తరంగాల్లా ఉరికురికి పడుతున్నట్టుం దా పిల్ల పరిగెడ్తూంటే ఆ అమ్మాయివంకే సంభ్రమంగా యింతింత కళ్ళు చేసుకు చూస్తూంది మంగి

"మాస్టారూ" అంది స్పష్టంగా, ముద్దుగా లావణ్య.

మేషారూ, మేష్టారూ, మేస్టరుగారండీ, మేస్టిగారూ అన్న రకరకాల పిలుపులకి అలవాటుపడిన ఆయనకి లావణ్యచేత అలా స్పష్టంగా, చక్కగా పిలిపించుకోవడం ఎంతో ఇష్టం

"ఏమిటమ్మా లావణ్యా" అనడిగే రాగిపోయి

"మాస్టారూ.. . మధ్యాహ్నం రెండో పిరియడు సోషల్స్టడీసు వుందికదా. మూడు ప్రశ్నలకి జవాబులూ అప్పుడు అప్పజెప్పకుంటారా రేపు అప్పజెప్పుకుంటారా?"

మంగికీ నచ్చిం దీ ప్రశ్న చెవులు పెద్దవిచేసుకు వింటూంది.

"మధ్యాహ్నం గుర్తు చెయ్యమ్మా .. అన్నట్టు నీకు వచ్చునుకదూ? నీకు రాకపోతే ఎవరికి వస్తాయితే" అంటూ బుగ్గను పుణికి స్టాఫ్ రూమువైపు కదిలేరు మేస్టారు

"ఇంతదాక బతికేసేవనుకున్నానే' అంది లక్ష్మి

"లావణ్య బాగా సదూతాది .. ఒప్పజెప్పుకుంటా నన్చెప్పి, ఒప్పజెప్పుకోపోతే అడగదేటి ఆ పిల్ల నెందుకనుకోవాల" అంది మంగి పెద్దమనసుతో. ఆ పెద్దమనసులో ఆ పిల్ల కట్టుకున్న పెద్ద పువ్వులున్న పట్టు లంగా రెపరెప లాడుతోంది

"ఆ పిల్ల నెవరన్నారే. అయితే నీగ్గానీ ఒచ్చేసునేటి' ఆ పిల్ల నెనకేసుకొస్తున్నావు?"

నాకూ రావు" నెమ్మదిగా అంది మంగి

'మరేఁవీ?

'ఇప్పుడు రొండో పిరీడు డ్రాయింగుందికదా సదివిద్దారోలే అంటూ పుస్తకం తీసింది మంగి

"అంతసులువు గొస్తదీ మనకి అంది మళ్ళీ నిరుత్సాహంగా

'సదివి తెందుకు రాదు? పుస్తకంలో ముఖం దూరుస్తూ అంది లక్ష్మి

"అదెలాగ్గ సదవడం మా యమ్మకి బాగోనేదు నిన్న మజ్జేనం మాయప్ప ఆస్పట్లకి తీసికెల్లిందా నాబంనేదని డాట్టరు సెప్పేసినాడంట అని కొంతసేపు గొంతుపూడుకుపోయి ఆగింది మళ్ళీ కళ్ళలో రెపరెపలు శబ్దం చేసేయి

'కిందటి పండక్కి మాయమ్మ పన్జేస్తున్న ఇంటోళ్ళు లంగా జాకెట్టిచ్చేరు ఇదుగిదే అరగదీ సరగదీసి సిరుగట్టిపోయింది ఈ ఏడాది కూడా యిస్తారేవో నని ఆసెట్టుకున్నాను మా యమ్మ పన్లోకే ఎళ్ళడం నేదు మా యప్పకి పెళ్ళి కుదిరిపోయింది మరి మాయమ్మసూస్తె యిలాగి

"ఓ తేటి సోది?" అని విసుక్కుంది లక్ష్మి

మాటాడకుండా మళ్ళీ పుస్తకంలో తలదూర్చింది మంగి కాని ఆ పుస్తకం నిండా ఎర్రెర్రటి పువ్వులూ నీలం నీలం పువ్వులూ తెల్లటి పట్టుకుచ్చులాంటి లంగా కనిపిస్తోంది దీక్షగా చూస్తున్నకొద్దీ ఖంగు ఖంగుమన్న అమ్మ దగ్గులోంచిపడే ఎర్రటి రక్తం బిళ్ళలూ నీలం



నీలంగా మారిపోతున్న అమ్మ శరీరం అక్షరాలు కనిపించని తెల్లని కాగితాలు మాత్రమే మంగి కళ్ళముందు కదులుతున్నాయి

"ఒలినెగే. డ్రాయింగు మేస్టారొచ్చేరు అని మోచేత్తో పొడిచింది లక్ష్మి

ఆయనేదో వర్కు అప్పగించేరు

అంతే మధ్యాహ్నం రెండో పిరియడు వరకు చదవడానికి సమయమూ చిక్కలేదు, ఆలోచించడానికి సందూ దొరకలేదు

మధ్యాహ్నం రెండో పిరియడు

భగ భగ ఎండ మండించేస్తోంది మొదటి బెంచీలో మొదటగా కూర్చున్న లావణ్యమీద కిటికీ లోంచి సగం వరకే పడిన ఎండ పక్షపాతం చూపిస్తూ వెలుతుర్ని పువ్వుల్లా ఆ పిల్ల మీద జల్లుతోంది రెండో బెంచీ చివరలో కూర్చున్న మంగిమీద మరిగించిన ఎండా, కరిగించిన వేడీ కలిపి జల్లులా కొట్టేస్తోంది

సోషలు మేస్టారు పాఠం మొదలెట్టబోతున్నారు

మాస్టారూ ప్రశ్నలడుగుతానన్నారూ గుర్తు చెయ్యమన్నారు కూడాను" అంది లావణ్య లేచి నిలబడి వినయంగా

"అవును కదూ వెరీ గుడ్ ఏదీ నువ్వే ముందు అప్పజెప్పు అంటూ లావణ్యకేసి తిరిగేరు

విజ్ఞానాన్ని నింపుకున్న పెద్ద పెద్ద కళ్ళు, కష్టాల ఎండ కన్నెరగని చిదిమితే పాలుగారే బుగ్గలూ, అప్పజెప్పే పెదాలు కదిపే తీరులో అమాయకత్వమూ, బిగువుగా చేతులు కట్టుకోవడంలో వినయమూ

సోషలు మేస్టారు లావణ్యకేసి ఆప్యాయంగా చూస్తూ ఆసక్తిగా వింటున్నారు

సోషలు మేస్టారి కళ్ళ ముందు మొన్నటి డియ్యీవో విజిటు

మ్యునిసిపల్ టీచర్లకూ, రెసిడెన్షియల్ టీచర్లకూ నక్కకీ నాకలోకానికీ మధ్య వున్నంత తేడా వుందంటారు పదవ తరగతి పరీక్షల్లో వాళ్ళకొచ్చిన పర్సెంటేజిని గొప్పగా ఉటంకించేరు డియ్యీవో

ఎందుకుండదూ? మంచి మెరిటు వుంటేనే గాని సీటు దొరకదక్కడ మరి మ్యునిసిపల్ స్కూలో పుష్పక విమానం

తన క్లాసుకొచ్చి డియ్యీవో గారు

'ప్రస్తుతం సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎవరు? అని అడిగేరు తొమ్మిదో తరగతి సిలబసు లోనే లేదా విషయం అయితే జనరల్ నాలెడ్జి అంశంగా చెప్పొచ్చును కదా అని తన మీదనే విరుచుకుపడతారు

కాని జనాభా లెక్కలూ, పశువుల గణాంక సేకరణా, ట్రాపిక్ గణాంక సేకరణా, వెనుకబడినవారి గణాంక సేకరణా, ఇళ్ళ నెంబర్లు వెయ్యడం, రేషను కార్డుల తయారీ పంపిణీ, మ్యునిసిపల్ ఓటర్లకు ఫోటో ఐడెంటిటీ కార్డుల తయారీ . పంపిణీ, అన్ని రకాల ఎన్నికలూ వీటితో సంవత్సరంలో సగభాగం పోతుంది పాఠాలు చెప్పడానికీ లేదు లోకజ్ఞానం బోధించడానికెక్కడ?

లావణ్య లేచి నిలబడింది

"శ్రీ ఆరెస్ పాథక్ ' అంది స్పష్టంగా

సరి అయిన జవాబుకోసారి "గుడ్" అంటూను, చెప్పే తీరుకు మరోసారి "గుడ్ గుడ్" అంటూను మెచ్చుకున్నారా అమ్మాయిని

'అయినా మీలాంటి అనుభవజ్ఞుల క్లాసులో నేను ప్రశ్నలు వెయ్యడమేమిటి?" అంటూ ఓ ప్రశ్ననే పూలహారంగా మేస్టారి మెడలో వేసేరు డియ్యీవో గారు

అడిగిన ప్రశ్నకు జవాబిస్తే మేస్టారు పాఠాలు చెప్పినట్టు, రాకపోతే మేస్టారు కాళ్ళు చాపుకుని విధులను నిర్లక్ష్యం చేస్తున్నట్టు నవ్వుకున్నారు సోషలు మేస్టారు

లావణ్యకేసి మరోసారి ఆప్యాయంగా చూసేరు

అప్పజెప్పేసేను మాస్టారూ ' అంది

వరసగా ఆ బెంచీలో ని వాళ్ళంతా అయ్యేరు

రెండో బెంచి, గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి మంగికి

'ఊ అప్పజెప్పు " కఠినంగా అన్నారు మేస్టారు

మంగి ముంగిలా నిలబడింది

ఏం వచ్చునా రాదా?

తల అడ్డంగా వూపింది.

అసలు నిన్నను చదవమన్నాను చదివేవా లేదా?

తల అడ్డంగా వూపింది

'తాటి పట్టలా తలూపడమే గాని చెప్పింది చదవాలన్న ఇంగితం లేదు ఏవీ ఎందుకు చదవలేదూ "

"మరండీ మా అమ్మకి బాగోలేదండి '

"అయితే నువ్వు దగ్గరుంది మందిచ్చేవా '

పిల్లలంతా కిసుక్కున నవ్వేరు మరింకేం మేస్టారు పులైపోయేరు

'మా యప్ప మాయమ్మ నాస్పట్లకి తీసికెళ్ళిందండి. ఇంటికాడెవళూ లేరనీ ."

దొంగోడు రాకుండా దుడ్డు కర్రతో కాపలా కాసేవా వంటా వార్పూ చేసేసేవా చదవమంటే చాలు కథలు చెప్పేస్తావు ఎంత బుద్ధి చెప్పినా వంట బట్టించుకోరు అంతెందుకు తొమ్మిదో క్లాసుకొచ్చేవు. మాట తీరే మార్చుకోవు సదవనేదండి అనడమే గాని చదవలేదండి అని చెప్పడానికూడా

## సంక్రాంతి

మకర సంక్రమణమ్ము, మఱల వచ్చినది
మధుర సంక్రమణమ్ము, మఱల వచ్చినది
బంతియును చేమంతి వంతు పోయినవి
అందాల దీవులై అతిశయించినవి.
సింగార మొలికించె, ముంగిళ్ళ, గొబ్బి!
ఇంటింట సిరుల, తా, నెగబోసె యుబ్బి
గంగిరెద్దుల వాడు, గానమ్ము సలిపి
ప్రాత బట్టల తృప్తి పడి, పరవశించె!
కోడి కూయక ముందె, గొంతు సవరించి
హరిని కీర్తించి, దాసరి, మేలుకొలిపె,
గంటలు సవరించి, జంట జంగాలు, శం
కరు పాడి,దీవనల్ కురిపించినారు.
మకర సంక్రమణమ్ము, మఱల వచ్చినది
మధుర సంక్రమణమ్ము, మఱల వచ్చినది.

-పైడిపాటి సుబ్బరామశాస్త్రి



# కొత్తని కోరే పాఠకులకు చక్కని విందు

దీపావళి కథలపై వ్యాసరచనపోటీలో
మొదటి బహుమతి
రు. 250/-లు
పొందిన వ్యాసం

ఈ సంవత్సరం దీపావళి కథల పోటీలో ఎన్నికైన ఆరు కథలలో నూ అక్షర క్రమం ప్రకారం ముచ్చటగా మూడవ కథ అయినా నాకు నచ్చిన క్రమంలో మొదటి కథ 'కుండీలో పూల మొక్క'. కుండీలో పూల మొక్కని పరిమితి మించి ఎదగనీయడు యజమాని. అతడు ఆ మొక్క అందాలను ఆస్వాదిస్తాడే తప్ప, ఎదుగుదలను హర్షించలేడు. రాగిణి భర్త కూడా 'రాగిణి'ని కుండీలో పూల మొక్కగా మాత్రమే భావించి, సైన్సులో ఇంకా ఇంకా చదువుకుని ఏదేదో సాధించాలనే ఆమె తపనను గుర్తించలేక పోయాడు. పద్మ వేసిన పెయింటింగు నిజంగా నూటికి నూరువాళ్ళు 'రాగిణి' జీవిత దర్పణం. కొత్తని కోరే పాఠకులకు ఈ కథ ఒక చక్కని విందు.

ఇక రెండవ స్థానం 'క్షీరధార'ది."నీటిలో పడవ వుండొచ్చును. కాని పడవలో నీరుండరాదు. మనిషికి డబ్బుండొచ్చును. కాని డబ్బుకోసం మనిషుండ రాదు"- ఇదీ విలువ కట్టలేని సత్యం. ఒకప్పుడు తన క్షీర ధారతో పరాయి బిడ్డ ఆకలి తీర్చి, ప్రాణం నిలిపిన ఓ మాతృమూర్తి అనసూయ. ఆవు పేరుతో ఆమె కన్న బిడ్డను, మానవత్వం మరచి క్షీరధారకు దూరం చేయటం ఇష్టంలేక ఆవుని తీసుకోకుండానే ఆమె బాకీని చెల్లు వేసి తన కృతజ్ఞతను చాటుకున్నాడు నారాయణ. ఆద్యంతం ఆవు పాలంత తీయగానూ, గోమాతంత పవిత్రంగానూ, మాతృత్వమంత మహనీయంగానూ, కృతజ్ఞతంత కమ్మగానూ అనిపించింది ఈ కథ.

నాకు నచ్చిన మూడవ కథ 'ఆయమ్మ'. మంచి కథ సూటిగా మనసును తాకుతుంది. మనిషిలోని 'మనిషి'ని తట్టి లేపి అనుబంధాల విలువను అందంగా చెప్పగలుగుతుంది. రాజమ్మ కన్నబిడ్డలు లేకపోయినా 'రఘు' చేత అమ్మా అని పిలిపించుకుని, మాతృత్వం లోని మాధుర్యాన్ని తనివి తీరా జుర్రుకుంది. తన కోడలు 'సుజాత' లో కం చేత గొడ్రాలు అనిపించుకోకూడదనే దొడ్డ మనసుతో ఒక అనాథకు ఆమెని తల్లిని చేసి, ఆ బిడ్డకు తానే ఆయమ్మ అయిన రాజమ్మ నిజంగా ధన్యజీవి! 'నానమ్మ' కాలేకపోయిన రాజమ్మ 'ఆయమ్మ'గా పది కాలాలపాటు పాఠకుల తలంపులలో నిలిచి వుంటుందనటంలో సందేహం లేదు.

ఇక నాకు నచ్చిన నాల్గవ కథ 'మమతల శిఖరం'. కడుపున పుడితేనే బిడ్డలు లేకుంటే కారనుకోటం శుద్ధ అవివేకం. తాను కన్నబిడ్డ తనను కాదని వెళ్ళిపోయినా, తనను వృద్ధాప్యంలో కన్నవాడి కంటే మిన్నగా ఆదుకున్న వారాల అబ్బాయి 'మౌళి' కథ చెప్పి ఓ సవతి తల్లి హృదయంలో మాతృత్వాన్ని మేల్కొల్పింది వర్ధనమ్మ. వర్ధనమ్మ ఏం చెప్పదలచుకుందో ముందుగానే తెలిసిపోతుంది ఈ కథలో. అయినా పట్టు సడలకుండా కథను కమ్మగా నడిపించి 'అమ్మా' అంటే ఏమిటో కళ్ళు చెమగిల్లేలా చెప్పగలిగారు రచయిత(త్రి).

ఇక అయిదవ కథ 'జాతస్య హిధృవో మృత్యు...' చావు పుట్టుకలు రెండూ సహజమైనవే. కాని మనిషి చావంటే ఎందుకో విపరీతంగా భయపడతాడు. కాని ఎవరినైనా చావు భయం నుండి తప్పించటం కన్నా, బతుకు భయం నుండి తప్పించటం మిన్న! రాములి కొడుక్కి తన నెత్తురిచ్చి రాముల్ని బతుకు భయం నుంచి తప్పించి హాయిగా ఫీలయ్యాడు సాగరి భర్త. ఈ కథలో తాను చెప్పదలచినది సూటిగా చెప్పి, చావుబతుకుల మధ్య క్షణభంగురమై నిలిచే ఈ జీవితాన్ని తన కలంతో చక్కగా చిలకగలిగారు రచయిత.

ఇక చివరి కథ 'వీడ్కోలు'. 'మెత్తని వాళ్ళని చూస్తే మొత్త బుద్ధి' అన్న సామెత. మెత్తని మనసుగల ఓ మేస్టారు ఏ తప్పు చేసినా తన విద్యార్థులను దండించక, వారి అల్లరిని చివరి కంటా భరిస్తూ వారు తమ అల్లరిలో ఉపయోగించిన కాగితం రాకెట్, అట్టతేలు, తాడూ, బొంగరం, సిరా మరకల లాల్చీ వంటి వస్తువులను వారి తీపిగుర్తులుగా దాచుకోవటం ఈ కథలో వస్తువు. అయితే ఈ కథలో అంతగా సహజత్వం లేదు. కథ చివరంటా చదివాక విశ్వనాథం మేస్టారి పట్ల 'అయ్యో పాపం పిచ్చి పంతులు' అనే జాలి; ఆయన అసమర్థత పట్ల సానుభూతి తప్ప, రచయిత ఆశించిన ఉన్నత భావం మాత్రం కలగదు. అందుకే ఈ కథ ఈ దీపావళి ప్రమిదలలో చివరి ప్రమిదగా మాత్రమే భాసిస్తుంది!

- వక్కలంక రామారావు

---

ప్రయత్నించవేం..." అన్నారు మేస్టారు తీక్షణంగా.

"చదివేనండి... కావాలంటే లావణ్య నడగండి. క్లాసులో చదివేను... అని అంది మంగి నిజాయితీగా.

"ఏమ్మా లావణ్యా?" అనడిగేరు.

వినయంగా లేచి నిల్చుని, బుద్ధిగా చేతులు కట్టుకుని, ముద్దుగా అంది లావణ్య... "మరండి మాస్టారూ... చదివిందండీ... కాని మధ్యలో వాళ్ళమ్మ గురించీ, వేసుకున్న బట్టల గురించీ, కబుర్లు కూడా చెప్పుకున్నారండీ..."

"అంతే. కబుర్ల మీదున్న దృష్టి చదువు మీదుంటే ఎప్పుడో బాగుపడును..." అంటూ రెచ్చిపోతున్నారు సోషలు మేస్టారు.

అప్పుడొచ్చింది.

ఏవిటేవిటి... ఎవరెవరు...

అప్పు... సత్తెవప్పు...

ఎలాగెలాగొచ్చింది...

రొప్పుకుంటూ... రోజుకుంటూ...

ఎందుకెందుకు...

మంగిని తీసుకు వెళ్ళడానికి...

మేస్టారికోవని చెప్పింది...

"మేస్టారండీ... మంగి నొక సుట్టు పంపించండి..." అంటూ ఆయాసం తీర్చుకుంది. ఆ సింధట్లో మేస్టా రప్పుడే సత్తెవప్పు మీద ఎగిరిపోను.

"మా యమ్మ సచ్చిపోయిందండి..." అంది మళ్ళీ. అంతే. సత్తెవప్పకి మరి నోరూ రాలేదు. కడుపులోని శోకం ఆగనూ లేదు.

మేస్టారు గుండె చెరువై పోయింది. ఒళ్ళు నీరైపోయింది.

ఎంత తప్పు.. ఎంత పని... ఎంతెంత తిట్లు తిట్టేడు...

కసాయి కూడా బలిసిన పశువుల మీదనే కాని బక్క పశువుల మీద కత్తి ఎత్తడే...

అయ్యో... అయ్యయ్యో...

మంగికేసి ఆర్ద్రంగా చూసేరు.

"ఊ వెళ్ళు..." అన్నట్టు చూసేరు.

మంగి వెళ్తోంది. వెళ్తున్న మంగికేసి నీటి పొరలో నుండి చూసేరు మేస్టారు.

నల్లగా బక్కగా... చీకిరి జుత్తులో ... జిడ్డోడుతూ... జాకెట్టు మాసిపోయి... లంగా మాసికల్తో... తల్లి లేని నల్ల మేకపిల్లలా... అనాథగా... దారీ తెన్నూ కానరాక జాలిగా వెక్కిళ్ళు పెడుతూ...

మరి చూడలేక క్లాసులోకి చూపు మరల్చేరు మేస్టారు.

ఎదురుగా లావణ్య...

గొంతులో మేతను కుక్కుతుంటే తినలేక తింటూ చుట్టూ ఏం జరుగుతున్నా పట్టించుకోకుండా సగం మూసిన కళ్ళతో నిర్లిప్తంగా చూస్తూనే అందరినీ తన వైపు ఆకర్షించుకొనే పందెం పొట్టేలులా కన్పిస్తున్నదప్పుడు లావణ్య. ☐

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి



**కె. కె., లక్ష్మీదేవిపల్లి**

★ మగవారిని దుమ్మెత్తిపోయడం స్త్రీలను సుమర్థిస్తున్నారు కదా! మరి ఏమైనా మార్పు కనిపించిందా?

● ఎవరిలో?!

★ మగ అనే గర్వం ఫీలయ్యేవారు బాల్యంలో తల్లి, యవ్వన వృద్ధాప్యంలో స్త్రీయేగా బాసటగా నిలుస్తుందని ఆలోచిస్తే?

● అంత దూరం ఆలోచించరు మగవారు వర్తమానానికే వారిచ్చే ప్రాముఖ్యత

★ మా ప్రశ్నలకి జవాబులు హాస్యంగా కాక ఆదర్శంగా వుండాలని నా అభిప్రాయం మీరేమంటారు?

● ఎవరికి ఆదర్శంగా వుండాలని? నా జవాబులా మీకు హాస్యంగా తోస్తున్నాయి! రాను రాను! గోలు గోలున ఏడుస్తూంటే గమకం బాగుందని విన్నాట్ట మీలాంటి పెద్ద మనిషే!

★ పుట్టిన ప్రతి ప్రాణీ గిట్టక మానదు అని తెల్సి ఈ మానవుడు నేరాలు ఘోరాలు, సంపాదించాలనే ఆశ- ఎందుకంటారు?

● జనన- మరణాల మధ్య కాలం ఎలా గడపాలి మరి?

**ఆర్. ఎస్., బలిజేపల్లి**

★ నా పేరు ఈ ప్రపంచానికి, కనీసం యిండియాకైనా వినికిడి కావాలంటే నేనేం చెయ్యాలి?

● డబ్బుంటే ఓ ప్రకటన యిచ్చుకోండి

**డి. ఎన్. ఆర్., హైదరాబాద్**

★ తప్పుల పట్టీ రాసే చిత్రగుప్తుడు- చేయి పీకి వూరుకోడా ఎప్పటికేనా?

● అప్పుడు భగవంతుడే మన నుదుళ్ల మీద ఆ జాబితా రాయడం ప్రారంభిస్తే డేంజర్ కదూ? మగాళ్లంతా టోపీలు కళ్లదాకా లాక్కోవాలి! ఆడవాళ్లు ముసుగేసుకు తిరగాలి. అంచేత అతడి చేయి పీకకుండా వుండాలని కోరుకుందాం.

**టి. ఎల్., బెల్లంపల్లి.**

★ కె.రా.గారూ మేము మగవాళ్లతో సమానమనీ, మగవాళ్లు ఏమి చేస్తే మేము అదే చేస్తామనీ ఎగురుతారు ఆడవాళ్లు. మరి మగవాడు నడి బజారులో చొక్కా విప్పుకు నడుస్తాడు. మరి మీ ఆడవాళ్లు అలా నడుస్తారా?

● అలా నడిస్తే మీలాంటి వాళ్లంతా ఆ రోడ్డు దాటరు! అయినా మీకు సిగ్గు లేకపోతే మాకూ లేదనుకోడం సాహసం కదూ?!




**జి.పి., అనంతపురం.**

★ మన వ్యవస్థ మారేదెప్పుడు కుల మతాల ప్రసక్తి పోయేది ఎప్పుడు?

● వ్యవస్థ ఏమిటి- మనుష్య సమూహమే మనిషి మారనప్పుడు వ్యవస్థ మారలేదని బాధపడడంలో అర్థం లేదు ఎవరికి వారు మారితే- వ్యవస్థ అదే మారుతుంది

**వై. వి., కాశీబుగ్గ.**

★ భార్య పరాయి పురుషునితో మాట్లాడితే అనుమానపడే భర్త, ఆ భార్య ఎదురుగానే పరాయి స్త్రీతో సంబంధం పెట్టుకుంటాడే- దానికేం శిక్ష?

● మగవాడిని సమాజం నైతిక పతనం నుంచి- చూసీ చూడనట్టు వూరుకుని రక్షణ కల్పిస్తుంది ఆడదానికి రక్షణ- ప్రకృతే ప్రసాదించలేదు! ఇక స్వార్థపరుడై మగవాడెక్కడ రక్షణ యిస్తాడు? మన నిర్ణయం మనమే చేసుకోవాలి

★ పెళ్ళికి ముందు ఆదర్శవంతులం అంటూ పెళ్లి కాగానే మారిపోతారు . వీరిని మార్చడం ఎలా?

● మార్చగలం అనుకోవడం అత్యాశ. మగవాడు పెళ్ళికి ముందు- పిరికివాడు- 'ఏమో ఈ అమ్మాయి తనని చేసుకోనంటే- అని మానసికంగా భయపడి పోతూ వుంటాడు. పెళ్లి చేసుకున్నాక- ఆ ఇంకెక్కడికెడుతుంది?- చెప్పు కింద తేల్లా పడి వుంటుంది- అన్న ధైర్యం వచ్చేసి తీసి పారేయడానికి సాహసిస్తూంటాడు! అయితే- అడపా తడపా కాస్త అధైర్యం కల్గిస్తూండాలి భర్తలకి!!

**సుదర్శన్, భీమవరం**

★ రామలక్ష్మిగారూ, మీ జీవితాశయం ఏమిటి?

● ఇక మీదట ఆలోచించాలయ్యా- సుదర్శనా యిప్పటిదాకా బాధ్యతలు సవ్యంగా నిర్వహించడంతో నే గడచిపోయింది!

**జె. జె., మొగలికొత్తూరు.**

★ అక్కయ్యా అందగాడని అభిమానంగా అమ్మాయిలు పది మంది ప్రేమిస్తే వాళ్లందరినీ పెళ్లి చేసుకోవాలా? వాళ్లను భయపడి ప్రేమ చంపుకోవాలా?

● మొగలి కొత్తూరు మహా పట్నానికంతా- అందగాడివి నువ్వే కాబోలు జగన్! అంత మంది ప్రేమించేస్తూంటే ఓ కృష్ణుణ్ణనుకుని- అదో బృందావనం అనుకుని ఊహల్లో బ్రతకాలని ఆలోచిస్తే పిచ్చివాడి కింద జమ కట్టే ప్రమాదం వుంది. తెలుగు సినిమాలు చూడడం, తెలుగు సీరియల్ నవలలు చదవడం, తెలుగు చచ్చు కబుర్లాడడం తగ్గిస్తే యీ రోగం రాదు! పది మంది తిరిగి చూసేసరికి స్టడీ బుక్‌లా ప్రవర్తించాలను కోవడం చాలా అనాగరీకం.

**చైతన్య, పర్లాకిమిడి.**

★ మీరు పురుష ద్వేషులని అందరూ అంటూ వుంటారు. కాని, మీ ఆడది, ప్రేమించు ప్రేమకై చదివిన తరవాత నాకలాగ అనిపించలేదు నిజం

● నేను పురుష ద్వేషిని కాదని నన్ను ద్వేషించే వాళ్లకే ఎక్కువగా తెలుసు సోదరి, తమ తప్పు ఎత్తి చూపిస్తానని ఉడుక్కుంటారంతే- ఈ మాత్రం దానికి సాక్ష్యాధారాలు అక్కరలేదు!

**జె. ఎల్. జి., విజయవాడ.**

★ కాస్త మాలతీ చందూర్ గారిలాగా విజ్ఞాన దాయకమైన ప్రశ్నలూ సమాధానాలూ మాకు అందించలేరా?

● ఎలా గణపతీ? నేను మాలతిని కానే!! □




మంగళ వాయిద్యాలు వినబడటంతో శాస్త్రికి మెలుకువ వచ్చింది.

దుప్పటిని తల మీదకి లాక్కొని పడుకోడానికి ప్రయత్నించాడు కాని ఆ సన్నాయి, మద్దెల మోతకి ఇక నిద్రపట్టదనే నిర్ణయానికి వచ్చి లేచాడు.

ఓసారి గట్టిగా ఆవులించి తన పక్క మంచం మీద పడుకున్న రూమ్‌మేట్‌ని లేపాడు.

"రేయ్. వినాయకా. ఒరేయ్. లేవరా".

"ఏమిటి?" అడిగాడు వినాయకరావు బద్ధకంగా కళ్ళు తెరవకుండానే.

"ఏమిటి పొద్దున్నే ఈమేళం? ఆపమని చెప్పు" కోపంగా చెప్పాడు శాస్త్రి.

"నువ్వే చెప్పచ్చుగా?"

"ఇద్దరం చెడ్డవాళ్ళు మవడం దేనికి? నువ్వెలాగూ ఇంటివాళ్ల దృష్టిలో పరమ ధూర్తుడివి. లే! లేచి ఆరేడియోని కట్టేయమని చెప్పిరా".

వినాయకరావు వెంటనే లేవలేదు. శాస్త్రి వినాయకరావు పడుకున్న మంచాన్ని రెండు చేతులతో పట్టుకుని పైకి లేపాడు. దాంతో మంచం మీంచి జారి నేలమీద పడ్డాడు వినాయకరావు.

"కమాన్! యుద్ధానికి వెళ్ళు." ప్రోత్సహించాడు శాస్త్రి.

వినాయకరావు నేల మీంచి లేవలేదు. మళ్ళీ అలాగే నిద్రలోకి జారిపోయాడు. శాస్త్రికి కోపం వచ్చింది.

"తల దేనికయినా తగిలినా, ఆనినా చాలు నిద్రవచ్చేస్తుంది నీకు."

ప్లాస్టిక్ బకెట్‌లోని నీళ్లని మగ్గుతో అందుకుని వినాయకరావు ముఖం మీద రెండు దోసిళ్లతో చల్లాడు.

"ఏమిటి? వర్షమా?" కంగారుగా లేచాడు వినాయకరావు. "అవున్లే సముద్రంలో డిప్రెషన్ తుఫానులే. ఇంటాయన్ని రేడియో కట్టేయమని చెప్పు" కసిరాడు శాస్త్రి.

వినాయకరావు లేచి ఓ సారి అద్దంలో మొహం చూసుకుని, జుట్టు దువ్వుకున్నాడు.

"అక్కడ అపరరంభలు, భూలోక ఊర్వశులు లేవరూ లేరుగానీ వెళ్లిరా



నాయినా".

వినాయకరావు తన గదిలోంచి బయటికి వచ్చాడు. ఓసారి వళ్ళు విరుచుకున్నాడు.

"గుడ్‌మార్నింగ్ నాయినా" చెప్పాడు పక్క పోర్షన్‌లో అద్దెకుండే గుడి పూజారి.

"శుభోదయం" చెప్పి వినాయకరావు సరాసరి ఆనాలుగు పోర్షన్‌లని అద్దెకిచ్చిన ఇంటాయన పోర్షన్‌లోకి వెళ్లాడు.

ముందుగదిలో కరెంట్ రేడియో లోంచి వాయింపు వినబడుతోంది. ఆగదిలో ఎవరూ లేరు.

"రమణమూర్తి గారూ" కేకేసాడు.

లోపలినించి ఎలాంటి సమాధానం లేదు.

"అయ్యో! ఎవరండి ఇంట్లో" మళ్ళీ అరిచాడు.



# వినాయకరావు పెళ్ళి

ఓ పద్దెనిమిదేళ్ళమ్మాయి ముందు గదిలోకి వచ్చింది చేతిలో చీపురును బట్టి ఆమె ఇల్లు వూడుస్తూ బయటికి వచ్చిందని అర్థం చేసుకున్నాడు. వినాయకరావు మొహం చూడగానే ఆ పిల్ల మొహం మొట మొట లాడిస్తూ అడిగింది. అతనంటే ఏమాత్రం ఇష్టం లేనట్లుగా.

ఎందు కొచ్చారు?"

ఆ రేడియోని కాస్త కట్టేస్తారా?

ఏం?"

అంత గట్టిగానా? నిద్రలోంచి ఉలిక్కిపడి లేచాం"

బారెడు పొద్దెక్కేదాకా నిద్రపోతారా? మాఇంట్లో అలాపడుక్కోడానికి వీల్లేదు దరిద్రం

లోపలనించి రమణ మూర్తి బయటికి వచ్చి గట్టిగా చెప్పాడు ఆయన వయసు ఏభై అయిదు దాకా వుంటుంది. దట్టమయిన కనుబొమలు. లోతుకుపోయిన కళ్ళు, భారీశరీరంతో చూడటానికి యమదూతలా వుంటాడు.

ఎవరి రేడియో వాళ్ళు వినాలికదండి మా రేడియోలో సిలోన్ పెట్టినా వినపడటం లేదు ఈ హైద్రాబాద్ సౌండ్‌కి" చెప్పాడు వినాయకరావు

'నీవు నిద్రలేచావా లేదా చెక్ చేయడానికి ఆ సౌండ్ నేనే పెట్టాను. ఇంట్లో పొద్దున్నే మంగళవాయిద్యాలు వినపడటం శుభస్కరం, శ్రేయస్కరం" చెప్పాడు రమణమూర్తి

"ఇలానా? ఇరుగు పొరుగుకి చెవుడులేదని మీరు గ్రహించాలి."

"నా ఇష్టమయ్యా భరించలేక పోతే గదిఖాళీ చెయ్యి...."

అదే ప్రయత్నంలో వున్నాం దొరగ్గానే ఖాళీ చేసేస్తాం. ఈ సౌండులింటూ, నిద్ర చెడగొట్టుకుని పడి వుంటామా? ఈకొంపలో.

'కొంప,గింప అంటే నాక్కోపం వస్తుంది. ఇల్లు అను".

'ఇల్లా? ఇదిల్లా? పాడుకొంప

మిస్టర్ మాటలుతిన్నగా రానీ' చెప్పింది ఆ అమ్మాయి కోపంగా చేతిలోని చీపురిని జాడిస్తూ

"వినాయకం ఒరే వినాయకం" లోపలికి వచ్చాడు శాస్త్రి.

"ఏమిటి మళ్ళీ పోట్లాటకి తెల్లారిందా? పద పద నీకు ఇంటాయనతో పోట్లాడితే కాని రోజు గడవదా?

"అదికాదురా శాస్త్రి ఈయనచూడు ..

'అదంతా తర్వాత నీళ్ళు చల్లారి పోతున్నాయి బాత్‌రూంకి వెళ్ళు ముందు" నచ్చ చెప్పాడు శాస్త్రి




'అసలీయన ఏమనుకుంటున్నాడు? ఈ అమ్మాయి ఏం అనుకుంటోంది? వీళ్ళ బోడి కొంపలోని బోడి గదిలో నెలకి నాలుగొందలిచ్చి అద్దెకున్నంత మాత్రాన మన నిద్ర వీళ్ళిష్టమే? రాత్రి పదికి ఠక్కున ఫీజ్ తీసేస్తాడు. ఉదయం భగవద్గీతతో, ఇలా డప్పు మేళంతో లేపి చంపుతాడు అసలీయన కొక్కడికే వుందా కొంప? నాకు ఏభై గజాల స్థలం వుంది ఊరికి దూరం అని ఇక్కడ పడుంటున్నాను".

"ఉరేయ్ ఉరేయ్ ఉరేయ్ పెద్దాయన్రా ఎన్నిసార్లు చెప్పాను ఇంటాయనతో పోట్లాడకూడదని, ఎద్దుకు ఎదురెళ్ళ కూడదని, పిచ్చికుక్క మీద రాళ్ళేయకూడదని పద నీకు ఆఫీస్‌కి టైం అవుతోంది సారీ ఆదిలక్ష్మిగారు మీరూ ఏం అనుకోకండి రమణమూర్తిగారు "

ఆ అమ్మాయి చేతిలోని చీపుర్ని నేల కేసి కొట్టి లోపలికి వెళ్ళిపోయింది వినాయకరావు, శాస్త్రి తమ పోర్షన్ లోకి వెళ్ళారు

"ఈ కాంపౌండ్‌లో దమ్మున్న వాళ్లం మనమేన్రా ప్రతీ వెధవా ఆయనకి భయపడటమే". ఫ్రెండ్ భుజం తట్టాడు శాస్త్రి

చేతిగడియారం వంక చూసుకుని చెప్పాడు వినాయకరావు

"లలిత సంగీతం"

హడావిడిగా ట్రాన్సిస్టర్ ఆన్ చేసాడు హైద్రాబాద్ ఏ స్టేషన్‌లో మంగళ వాయిద్యాలు ఆగిపోయాయి. లలిత సంగీతం మొదలయింది

మొదట 'రావోయి బంగారి మామా' పాటని ఘంటసాల పాడాక వినపడింది అనౌన్సర్ కంఠం.

"తర్వాత కుమారి శృతి పాడిన 'చిటారి కొమ్మన వంటరి కోయిల' వింటారు"

"శృతి! మాట్లాడకు' చెప్పాడు వినాయకరావు ఆనందంగా

గడ్డం గీసుకోవడం ఆపి ట్రాన్సిస్టర్‌ని ఆప్యాయంగా చేతిలోకి తీసుకున్నాడు కొద్ది క్షణాల్లో ఓ ఆడపిల్ల కంఠం వినపడసాగింది ఆ టూ–ఇన్–వన్‌లో ఆపాటని సిద్ధంగా వున్న కేసెట్‌లో రికార్డ్ చేయసాగాడు వినాయకరావు

'చిటారి కొమ్మన వంటరి కోయిల '

నిండుపున్నమి నాటి తుఫాను రేయిలా'

ఆ పాటని ఎంతో తాదాత్మ్యంగా విన్నాడు వినాయకరావు పాట పూర్తయాక చెప్పాడు శాస్త్రితో

"ఆహా శృతి గొంతుక ఎన్ని వందల సార్లు, ఈ పాటని ఎన్నివేల సార్లు విన్నా తనివితీరదురా'

"ఏనాడు రేడియోలో శృతి పాట విన్నావో ఆనాటి నించి నీకీ పిచ్చి పట్టింది ఎవరయినా ఓ అమ్మాయినిచూసి ప్రేమిస్తారు లేదా ఫోటోచూసి ప్రేమిస్తారు కాని ఇలా రేడియోలో గొంతు విని ప్రేమిస్తారా? తీరా ఆ అమ్మాయి అనాకారి అయితే చాలామంది కంఠం బావున్న వాళ్ళు అనాకారులుగా వుంటారు ఉదాహరణకి మన ఆఫీస్ టెలీఫోన్ ఆపరేటర్

"నా ప్రేమకి రూపం ప్రధానం కాదురా ఆ అమ్మాయి మొహం మీద స్ఫోటకం మచ్చలున్నా, శరీరం అస్థిపంజరంలా వున్నా, జుట్టు బాగా తెల్లబడినా సరే ఆఫీసునించి అలసి పోయి ఇంటికి వచ్చాక ఒక్కసారి ఆమె కంఠం వింటేచాలు వెయ్యేనుగుల బలం వస్తుంది నా ప్రేమ మానసికం"

"పాటకే వేపకాయంత వెర్రి పుట్టింది. ఇంక ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే నిన్నా భగవంతుడు కూడా రక్షించలేడు నీవు నా మాట విని నీ మానసిక ప్రేమకి మాసికం పెట్టేయ్

"కేరాఫ్ రేడియో స్టేషన్‌కి ఆ అమ్మాయికి వుత్తరం రాసి రెండు వారాలయింది ఇంతదాకా సమాధానం రాలేదు చెప్పాడు వినాయకరావు బాధగా

"గడ్డం గీసుకో వస్తుందిలే"

"చదివి చింపి పారేసి వుంటుందంటావా?

అసలా అమ్మాయి చేతికి నీవుత్తరం చేరి వుండదంటాను ఎప్పుడో ప్రోగ్రాం

# ఆమెకి కూడా సంరక్షణ కావాలి!

ఉదయం టిఫిన్ చేయడం, పిల్లలను బడికి పంపడానికి తయారు చేయడం, మధ్యాహ్నం వంట, బజారుకు వెళ్ళి సరుకులు తేవడం, యిల్లు సర్దుకోవడం, కుటుంబంవారి మంచి చెడూ చూసుకోవడం.... ఇలా నాకు లేచింది మొదలు పడుకునేవరకు పనే.

హార్లిక్స్‌కి పోషణ శక్తి ఉండటంవల్ల మా డాక్టరు దీనిని సిఫార్సు చేశారు. హార్లిక్స్ రోజంతా నాకు కావలసిన శక్తి సత్తువ యిస్తుంది. అందుకే సాయంకాలాలు కూడా నా కుటుంబ సభ్యులతో ఆ విలువైన సమయాలు ఆనందంగా గడపడానికి తగిన ఉత్సాహంతో ఉండగలుగుతున్నాను.

హార్లిక్స్‌లో కీలకమైన సహజపోషకాలు. మాంసకృత్తులు, విటమినులు, ఖనిజాలు, పిండిపదార్థాలు, సమృద్ధంగా ఉన్నాయి. అవి రోజంతా బలం, జీవశక్తి సమకూరుస్తాయి.

కుటుంబానికంతటికీ పోషక శక్తి సమకూర్చేదిగా రుజువుకావడంవల్ల ప్రపంచమంతటా డాక్టర్లు హార్లిక్స్‌ని సిఫార్సు చేయడంలో ఏమాత్రం ఆశ్చర్యం లేదు.



గృహిణికి శక్తినిచ్చే పానీయం




మంచి పుష్టికరమైనది

HTA 5817 TEL

వున్నప్పుడు వచ్చి వెళ్తుంటుంది బహుశా".

"ఇంకోటి రాయనా ఎందుకయినా మంచిది?" అడిగాడు వినాయకరావు.

"రాయి".

"అవును... ఆఫీసుకి వెళ్ళగానే నేను మొదట చేసేపని అదే. ఈసారి మన ఫ్యాన్‌కివ్వకుండా నేనే స్వయంగా పోస్ట్ చేస్తాను. ఆమె నించి సమాధానం వచ్చే దాకా వుత్తరాలు రాస్తూనే వుంటాను".

"గుడ్‌లక్. ఆ రోజు నాకో బాటిల్ బీర్ కొట్టించాలి మరి" చెప్పాడు శాస్త్రి నవ్వుతూ.

మరో పావుగంటలో ఇద్దరూ సైకిళ్ళ మీద ఆఫీసుకి బయలు దేరారు. ఆ ఇంట్లో ఆ శృతిపాటని అంత ఆసక్తిగా విన్నది ఒక్క వినాయకరావేకాదు ఆదిలక్ష్మి కూడా.

* * * * * * * * * * *

ఆ తర్వాత ఓ రోజు వుదయం పాట రికార్డింగ్ కోసం ఆలిండియా రేడియో స్టేషన్‌కి వచ్చిన ఆదిలక్ష్మికి ఆ సెక్షన్ హెడ్ ఓ వుత్తరం ఇచ్చి చెప్పారు.

"మీ పేరున స్టేషన్‌కి వచ్చింది"

ఆమె ఆ నీలిరంగు కవరు చింపి అందులోంచి ఆదేరంగు కాగితాన్ని తీసి మడతలు విప్పి చదివింది.

హైదరాబాద్,
అక్టోబర్, 1987.

కుమారి శృతిగారికి,

మీ పాటంటే నాకిష్టం. మీ కంఠమంటే ఇంకా ఎంతో ఇష్టం. ఇందాక రేడియోలో (సాయంత్రం ఆరున్నరకి) మీరు పాడిన లలిత గీతం 'సందియవేళ అందెల రవళి' విన్నాను. దాదాపు రెండు నెలలుగా మీ పాటలన్నీ శ్రద్ధగా వింటూ రికార్డ్ చేసుకుంటున్నాను. తీరికవేళల్లో వాటిని మళ్ళీ మళ్ళీ వింటున్నాను. వింటున్నకొద్దీ నేను మీ అభిమానినయ్యాను. మీరు రేడియోలో పాడిన పాటల్ల జాబితా జత చేస్తున్నాను. మొత్తం పద్నాలుగు. ఇవన్నీ నా దగ్గర వున్నాయి. ఇవికాక ఇంకేమయినా పాడారా? దయచేసి తెలియ చేయగలరు.

మీకు ఇంతటి చక్కటి కంఠం, స్వరం ఇచ్చిన ఆదేవుడికి, మీ గళానికి తగ్గ పేరు పెట్టిన మీ తల్లిదండ్రులకి నా కృతజ్ఞతలు.

భవదీయుడు
వై. వి. రావ్.

నాచిరునామా:
కేరాఫ్ పోస్ట్ బాక్స్ నంబర్ 9909
హైదరాబాద్ –500001



వీలుంటే మీరు సమాధానం రాస్తే ధన్యుణ్ని.

వై. వి. రావ్.

ఆ వుత్తరాన్ని ఒకటికి నాలుగు సార్లు చదువుకుంది ఆదిలక్ష్మి. ఆమెకి అభిమానిగా వచ్చిన మొదటి వుత్తరం అది. అందుకే ఆమె హృదయం ఎంతో పరవశించింది. ఎంతో థ్రిల్లింగ్ ఫీలయింది. దానికి సామాధానం రాయాలని వుంది. ఆ కవరుని తనతో తెచ్చుకున్న పాటల పుస్తకంలో వుంచుకుంది.

స్టుడియోలో కొత్త పాట రికార్డ్ చేస్తుండగా ఎంతో వుత్సాహంగా, హుషారుగా పాడింది. పాట పూర్తయ్యాక రెవెన్యూ స్టాంప్ మీద సంతకం చేసి చెక్‌ని తీసుకుని బయటికి వచ్చింది. బావుందని ఒకరిద్దరు కొత్తవాళ్ళు అభినందించారు కూడా.

బస్‌స్టాప్‌లో నిల్చుని ఆ అభిమాని గురించి ఆలోచించ సాగింది. రచయితలకి, సినిమా నటీనటులకి, క్రీడాకారులకి, ఇంకా పి. సుశీల, జానకి, ఎస్. పి. బాలసుబ్రమణ్యం లాంటి గాయకులకి అభిమానులుంటారు. రేడియోలో పాటలు పాడే తనలాంటి వాళ్ళకి కూడా వుంటారనుకోలేదు. తను పాడిన పద్నాలుగు పాటలు రికార్డ్ చేసుకున్నాడట.

ఆలోచనలలో వున్న ఆదిలక్ష్మి బస్‌స్టాప్‌లో వచ్చి ఆగిన బస్ నంబర్ని చూసింది అది ఆమె ఎక్కాల్సిన బస్సే. గబగబ బస్ ఎక్కింది. మరోసారి ఆ ఉత్తరం చదవాలని పించింది. కానీ సీట్ దొరక్క నిలబడటంతో కుదరలేదు. కండక్టర్ దగ్గరికి రాగానే టిక్కెట్ తీసుకుంది.

నాలుగైదు స్టాపుల తర్వాత ఓ సీట్ దొరికింది ఆదిలక్ష్మికి. అందులో కూర్చుని తన పాటల పుస్తకాన్ని తెరిచింది ఆ ఉత్తరం కోసం.

కనబడలేదు. పేజీలన్నీ తిప్పిచూసింది. తర్వాత ఒక పేజీ తెప్పి చూసింది. ఆ కవరు కనపడలేదు. బస్‌లో ఇందాక నిలబడ్డ చోట చూసింది. అక్కడా లేదు.

బస్‌స్టాప్ లోనో, రేడియో స్టేషన్‌లోంచి బయటకు వస్తుండగానో పడిపోయి వుండచ్చునుకుంది.

'అరెరె' అనుకుంది ఆదిలక్ష్మి తనకి వచ్చిన మొదటి అభిమాని వుత్తరం జారి పోవడంతో.

బస్ తను దిగాల్సిన స్టాప్‌లో ఆగగానే దిగి ఇంటికి నడిచింది. ఇంటి కాంపౌండ్‌లోకి అడుగు పెట్టకుండానే తన తండ్రి అరుపులని విన్నది గబగబ లోపలికి నడిచింది.

తన తండ్రితో వినాయకరావు పోట్లాడుతున్నాడు.

"మేం డిపార్ట్‌మెంటల్ పరీక్షలకి చదువుతున్నామండి. రాత్రి పదింటికి ఫ్యూజ్ తీసేస్తే ఎలా? ఒక్క పదిహేను రోజులే అన్నాను".

"మీరిచ్చే అద్దెకి సరిపడా ఎలక్ట్రిసిటీ రాత్రి పది దాకానే. రోజంతా బల్బ్ వేసుకోవాలనుకుంటే నెలకి మరో పాతిక ఎక్కువ ఇవ్వండి".

"రాత్రి ఒకగంట ఎక్కువ కరెంట్ వాడుకున్నందుకు పాతికా? ఇదేం న్యాయం మాస్టారు"

"నేనేం స్కూలు పెట్టలేదు. అని ఎన్నో సార్లు చెప్పాను. ఓ అయిదు వందలు ఇస్తే మీ పోర్షన్‌కి సెపరేట్ మీటర్ పెట్టిస్తాను. మీ ఎలక్ట్రిసిటీ బిల్లు మీరే కట్టుకోండి."

"మా దగ్గర అయిదు వందలు లేవు".

"అన్నిటికి అన్నీ చెప్తే ఎలా? కొవ్వొత్తులు కొనుక్కొచ్చుకుని చదువు కోండి".

"ఇలా చేస్తే మీ ఇంటిగురించి, మీరు వసూలు చేసే అద్దెగురించి మునిసి పాలిటీ వాళ్ళకి పిటిషన్ పెట్టి పన్నులు పెరిగేలా చేస్తాను జాగ్రత్త" హెచ్చరించాడు వినాయకరావు. ఆ మాటలకి రమణమూర్తికి కోపం పెరిగింది.

"ఏమిటోయ్ ఇందాకట్నించి చూస్తున్నాను నీ వాగుడు–పిచ్చి పన్లు చేసావంటే నీళ్ళకుండ, కిరసనాయిలుస్టవ్, కాఫీపొడి సీసాలతో సహా నీగదిలోని సామానంతా వీధిలోకి గిరాటేస్తాను జాగ్రత్త".




"మీరే జాగ్రత్త. ఈ రాత్రి కరెంట్ తీసేసారంటే".

"అసలు మీరు నాఇల్లు ఖాళీ చేసేయండి" అరిచాడు రమణమూర్తి –కోపంగా.

వినాయకరావు ఏదో అనబోతుండగా ఆదిలక్ష్మి చెప్పింది అతనితో

"చూడండి మానాన్న గారికి కోపం వస్తే బి. పి పెరిగి ఆరోగ్యం పాడవుతుంది అనవసరంగా గొడవ చేయకండి."

"ఎలాగండి మరి. మేం డిపార్ట్ మెంటల్ పరీక్షలు పేసవ్వాలా వద్దా? మాకు జీతాలు పెరగాలా వద్దా? మీరయినా చెప్పండి మీనాన్న గారికి"

"నేను పదితర్వాత కరెంట్ వదలను" మొండిగా చెప్పాడు రమణమూర్తి.

"అయితే నేను మునిసిపాలిటీ వాళ్ళకి పిటిషన్ పెట్టి తీరతాను" చెప్పాడు వినాయకరావు ఇంకా మొండిగా.

"మిస్టర్. మీరిలా బ్లాక్ మెయిల్ చేయడం, ముందుమానండి ఏమిటి మీ బెదిరింపు?" అడిగింది ఆదిలక్ష్మి కోపంగా

"బెదిరింపు అనండి ఏమయినా అనండి ఇంట్లో రాత్రిళ్ళు చీకట్లో పడుకోడానికా మీకు అద్దె ఇచ్చేది?"

"ఒరేయ్. ఒరేయ్. రేయ్ వినాయకం ఏమిట్రా నీ అఘాయిత్యం. పెద్దాయన్ని పట్టుకుని ఏమిటా మాటలు. మంచిగా, మర్యాదగా,బ్రతిమాలుతూ అడుగుతే ఆయనమాత్రం కాదంటారా?

సారీ రమణమూర్తిగారు. మావాడికి దూకుడు అధికం. సారీ అండి ఆదిలక్ష్మిగారు". చెప్పాడు శాస్త్రి గదిలోంచి బయటికి వచ్చి

"దూకుడే కాదు. వాగుడు కూడా" అరిచాడు రమణమూర్తి క్రోధంగా.

"మా నాన్న గారికి కోపం తగ్గాక తర్వాత ఈ విషయం మాట్లాడండి. ఇప్పుడు కాదు" చెప్పింది ఆదిలక్ష్మి శాస్త్రితో.

"పదరా... ఇంట్లోకి పద" చెప్పాడు శాస్త్రి వినాయకరావు చేతిని పట్టుకుని.

"ఉ హు ఇదేదో ఇప్పుడే తేలాలి" శాస్త్రి చేతిని విదిలించి కొట్టాడు వినాయకరావు.

"మిస్టర్. ఎక్కువ గోల చేశావంటే పోలీసులకి రిపోర్టివ్వాల్సి వుంటుంది. ఏమిటీ న్యూసెన్స్? కావాలంటే మానాన్నగారు చెప్పినట్టు వుండండి. లేదా ఇల్లు ఖాళీ చేయండి." అరిచింది ఆదిలక్ష్మి కోపంగా.

"అసలు మీరు......"

"షటప్. ఇంకో మాట మాట్లాడారంటే వూరుకోను వెళ్ళండి" అసహనంగా చెప్పింది ఆదిలక్ష్మి.

వినాయకరావుని లోపలకి తీసుకెళ్ళి పోయాడు శాస్త్రి.

"ఏమ్మా? ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావ్?" ఇంట్లోకి వస్తున్న ఆదిలక్ష్మిని చూస్తూ కోపంగా అరిచాడా యన.

'ఫ్రండింటి కెళ్ళొస్తున్నాను నాన్నగారు" చెప్పింది ఆదిలక్ష్మి

"ఏ ఫ్రండ్? ఆ మేరీ ఇంటికేనా?

"కాదండి సీతామహాలక్ష్మి దగ్గరకెళ్ళొస్తున్నాను' అబద్ధం ఆడింది ఆదిలక్ష్మి

సరే అయితే పాటలు పద్యాలు అంటూ రేడియో స్టేషన్ల చుట్టూ తిరగకు. మనది నిప్పులు కడిగే వంశం అని గుర్తుంచుకో'

"మీరు కోప్పడ్డాక మళ్ళీ రేడియో స్టేషన్ వైపే వెళ్ళలేదండీ"

"అలాబుద్ధిగా వుండు బాగుపడతావ్ ఈ వినాయకుడితో చచ్చే చావొచ్చింది" విసుక్కుంటూ బయటకి వెళ్ళిపోయాడు రమణమూర్తి

"అచ్చం నే చెప్పిన మాటలే చెప్పావు గురూ ముసలాయన్ని అదరగొట్టేసావనుకో" శాస్త్రి వినాయకరావుని అభినందించాడు

"ఈ రాత్రికి కరెంట్ వదులుతారంటావా?" అడిగాడు వినాయకరావు అనుమానంగా

"తప్పకుండా మునిసి పాలిటీకి పిటీషన్ పెడితే తాట తెగుతుంది' చెప్పాడు శాస్త్రి.

"ఏమవుతుంది?' అడిగాడు వినాయకరావు

"ఏమవుతుందేమిటి? మన దగ్గర నెలకి నాలుగు వందలు అద్దె తీసుకుంటూ నూట ఏభైకే రసీదిస్తున్నాడని వాళ్ళకి తెలిస్తే ఇంటి పన్ను మూడు రెట్లు పెంచేస్తారు. మాయల మరాఠీ ప్రాణం చిలకలో వున్నట్టుగా స్వంత ఇల్లు గలవాడి ప్రాణం ఎప్పుడూ ఇంటి పన్ను వేసే మునిసిపాలిటీ వాడిచేతిలో వుంటుంది–"

"పాపం. ఆ ఆదిలక్ష్మి, ముందు అలా అరిచాను. నా గురించి ఏమనుకుంటుందో"

ఆ రాత్రి పదకొండున్నర దాకా వాళ్ళగదిలో ఎలక్ట్రిసిటీ పోలేదు లైటార్పి పడుకున్నాక చెప్పాడు శాస్త్రి.

"గొడవ ఫలించింది. ఈ నెలనించి అయిదో పదో అద్దె పెరుగుతుంది ఆ టేప్ నాకు వినపడిందా దొక్క చించేస్తా – గుడ్ నైట్."

"గుడ్‌నైట్" చెప్పాడు వినాయకరావు.

టేప్ రికార్డర్‌ని ఆన్ చేసి, తనకి మాత్రమే వినపడేలా శృతి కేసెట్‌ని పెట్టుకుని దాన్ని వింటూండి పోయాడు వినాయకరావు. వింటూన్న కొద్దీ ఆ కంఠంలోంచి తేనె లొలుకుతున్న భావన కలగ సాగింది.

'శృతి ఎవరో? ఎక్కడుందో? ఎలా వుంటుందో? తన ఉత్తరం అందిందో లేదో?" అనుకున్నాడు వినాయకరావు చిన్నగా నిట్టూర్చి.

వినాయకరావు నిద్రలోకి జారి పోయిన అయిదు నిముషాలకి టేప్ పూర్తయి రికార్డర్ ఆటో మేటిక్‌గా ఆఫ్ అయింది. (ఇంకా వుంది)

# గడచిన ఏడాది

గత ఏడాది అంతా దాదాపు నిరాశాజనకంగానే గడిచి పోయిందని చెప్పవచ్చు. ఈ శతాబ్దంలో కనీ వినీ ఎరుగని కరువు కాటకాలు 1987 లోనే సంభవించాయి. కొన్ని ప్రాంతాలలో అతివృష్టి, వరదలు కారణంగా ఎంతో ఆస్తి, నష్టం, ప్రాణనష్టం సంభవించాయి. తీవ్రవాదుల దారుణా

శ్రీ ఆర్. వెంకట్రామన్

లకి ఎంతో మంది బలైపోయారు. రాజకీయరంగంలో ఎన్నో పరిణామాలు సంభవించాయి. కేరళలో కాంగ్రెసు(ఐ) అధికారం కోల్పోయింది. పశ్చిమ బెంగాల్‌లో వామపక్ష ఐక్య సంఘటన తిరిగి అధికారంలోకి వచ్చింది. హర్యానాలో కాంగ్రెసు ఓడిపోయి శ్రీ దేవీలాల్ నాయకత్వంలో గల లోక్‌దళ్ (బి) అధికారాన్ని హస్తగతం చేసుకుంది.

శ్రీ రాజీవ్‌గాంధీ

శ్రీ వి. పి. సింగ్ పార్టీ వ్యతిరేక కార్యకలాపాల కారణంగా కాంగ్రెసు (ఐ) నుంచి బర్తరఫ్

కీ. శే. చరణ్‌సింగ్

చేయబడ్డారు. అంత హడావుడి చేసిన ఆయన సాధించింది ఏమీ లేదు. ఫెయిర్‌ఫాక్స్ వ్యవహారంలో కూడ ఆయనే తప్పు చేసారని తక్కర్, నటరాజన్ కమీషన్ పేర్కొన్నది. శ్రీయుతులుఅరుణ్‌నెహ్రూ,

శ్రీ వి. పి. సింగ్

ఆరీఫ్ మహమ్మద్‌ఖాన్, వి. సి. శుక్లా, సంజయ్‌సింగ్, ముఫ్తి మహమూద్ సయీద్‌లు కాంగ్రెసు(ఐ) నుంచి

శ్రీ ఎం. జి. రామచంద్రన్

బహిష్కరింప బడ్డ వారిలో ఉన్నారు.

భారత రాష్ట్రపతిగా శ్రీ ఆర్. వెంకట్రామన్, ఉప రాష్ట్రపతిగా శ్రీ శంకర్ ధయాళ్ శర్మ ఎన్నికైనారు.

ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వంలో రెండవ స్థానంలో ఉన్న రెవెన్యూ మంత్రిగా పని చేసిన శ్రీ ఎస్. శ్రీనివాసులు రెడ్డి తెలుగుదేశం పార్టీలో ప్రజా స్వామ్యం లేదని విమర్శించారు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ఆయనని మంత్రి పదవి నుంచి తొలగించారు. తర్వాత ఆయనని తెలుగుదేశం పార్టీ నుంచి కూడా బహిష్కరించారు. అనంతరం శ్రీ శ్రీని

శ్రీ అమితాబ్‌బచ్చన్

వాసులు రెడ్డి ముఖ్యమంత్రి పైనా, తెలుగుదేశం ప్రభుత్వం మీదా ఆరోపణలనేకం చేసారు.

కాంగ్రెస్ (ఐ) నాయకుడు శ్రీ ద్రోణంరాజు సత్యనారాయణ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామా రావు, ఆయన ప్రభుత్వం పై హైకోర్టులో రిట్ పిటిషన్‌లని దాఖలు చేసారు. వాటిలో రెండింటిని

# నడచిన చరిత్ర

హైకోర్టు విచారణకి స్వీకరించింది.

తూర్పు గోదావరి జిల్లాలోని గొర్తెడు గ్రామం వద్ద ప్రభుత్వ ఉన్నతాధికారులని, తదితర


శ్రీ ఎన్. టి. రామారావు

సిబ్బందిని నక్సలైట్‌లు ఎత్తుకు పోయి జైలులో ఉన్న తమ నాయకులు 8 మందిని విడిచిపెడితేనే ప్రభుత్వ సిబ్బందిని విడుదల చేస్తామని ప్రభుత్వాన్ని హెచ్చరించారు. నక్సలైట్‌ల కోరిక మేరకు వారి నాయకులని ప్రభుత్వం వదలిపెట్టిన తర్వాత ఐ. ఏ. ఎస్. అధికారులని, తదితర సిబ్బందిని నక్సలైట్‌లు వదిలి పెట్టారు. ఈ సంఘటన జాతీయ స్థాయిలో సంచలనం కలిగించింది కానీ సుఖాంత మైంది.



అంతర్జాతీయ స్థాయిలో శ్రీలంక తమిళుల సమస్యపై ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ, శ్రీలంక అధ్యక్షుడు జయవర్ధనే శాంతి ఒప్పందంపై సంతకాలు చేసారు. శ్రీలంకలో సైనికవందనం స్వీకరిస్తున్న రాజీవ్ గాంధీపై హత్యా ప్రయత్నం


శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి

జరిగింది. అదృష్టవశాత్తు ఆయన ప్రమాదం లేకుండా తప్పించుకున్నారు. శ్రీలంకలో శాంతి స్థాపనకు భారత ప్రభుత్వం సైన్యాన్ని పంపించింది. తమిళ గెరిల్లాల దాడులలో భారత సైన్యంలో అనేక మంది ప్రాణాలు కోల్పోయారు.



అమెరికా అధ్యక్షుడు రీగన్, సోవియట్ అధినేత గోర్బచేవ్ అణ్వస్త్రాల నిరోధానికి, మధ్యరకం ఖండాంతర క్షిపణుల ఉపసంహరణ ఒప్పందం ప్రపంచ శాంతికి మార్గాన్ని సుగమం చేసింది.

ఆంధ్రప్రదేశ్ మాజీ ఆస్థాన కవి డాక్టర్ దాశరథి, విద్వాన్ విశ్వం, శ్రీ తుమ్మల వెంకటరామయ్య, శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి దివంగతులైనారు.

ప్రముఖ స్వాతంత్ర్యయోధుడు, ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి హరేకృష్ణ మెహతాబ్, ప్రముఖ హిందీ



చలన చిత్ర సంగీత దర్శకులు జయదేవ్, శంకర్, ప్రఖ్యాత హిందీ రచయిత, కవి, జ్ఞానపీఠం అవార్డు గ్రహీత వాత్స్యాయన్ అజ్ఞేయ, మాజీ ప్రధాని, లోక్‌దళ్ నాయకుడు చరణ్‌సింగ్, ప్రముఖ హిందీ చిత్ర నిర్మాత, రచయిత, పత్రికా రచయిత కె. ఏ. అబ్బాస్, ప్రఖ్యాత హిందీ రచయిత్రి మహాదేవి వర్మ, సుప్రసిద్ధ హిందీ నటుడు, గాయకుడు కిషోర్ కుమార్, ప్రఖ్యాత క్రికెట్ క్రీడాకారుడు విజయ్ మర్చంట్ మొదలగువారు 1987లో మరణించారు



వీరి మృతి ఆయా రంగాలలో తీరనిలోటు కలిగించింది.

డిసెంబరు 24న అఖిలభారత అన్నా ద్రా. ము. క. స్థాపకుడు, గత పదిసంవత్సరాలుగా తమిళనాడు ముఖ్యమంత్రిగా ప్రజల ఆదరాభిమానాలని అందుకున్న ఒకనాటి సుప్రసిద్ధ తమిళ సినీ నటుడు, పురట్చి నడిగర్, మక్కళ్ తిలకం శ్రీ ఎం. జి. రామచంద్రన్ మదరాసులోని తమ స్వగృహంలో కన్నుమూసారు. డిసెంబరు 25న ఆయన మృతదేహాన్ని ప్రభుత్వ లాంఛనాలతో ఊరేగించి మదరాసు మెరీనాబీచ్‌లో కీ. శే. అన్నాదురై సమాధి ప్రక్కనే సమాధి చేసారు. ఈ అంతిమ యాత్రలో 20



లక్షల మందికి పైగా ప్రజలు పాల్గొని కన్నీటితో ఆయనకి అంతిమ వీడ్కోలు చెప్పారు. ప్రధాన మంత్రి, రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, కేంద్ర మంత్రులు, ముఖ్యమంత్రులు, తదితర ప్రముఖులు కీ. శే. ఎం. జి. ఆర్. భౌతికకాయంపై పుష్పగుచ్ఛాలు ఉంచి శ్రద్ధాంజలి ఘటించారు. శ్రీ ఎం. జి. ఆర్. మృతితో తమిళనాడులో అధికారంలో ఉన్న అఖిల భారత అన్నా ద్రావిడ మున్నేట్ర కళగంలో శూన్యం లాంటిది ఏర్పడింది. ఆయన తర్వాత ఆ పార్టీ భవిష్యత్తు ఎలా ఉంటుందన్నది కాలమే నిర్ణయిస్తుంది. (ఒ. వి)



టక్ టక్ తలుపు చప్పుడయింది తదేక దీక్షతో చదువుతున్న అంజలి విన్పించుకోలేదు మరోసారి మరోసారి చప్పుడయినా అంజలిలో చలనం లేదు

బయట నించుని తలుపు కొడుతున్న తిలక్‌కి భయమేసింది అంజలి కేమయింది? తలుపు తీయదేం? ఈ వేళప్పుడు సామాన్యంగా పడుకోదు కూడా! ఈ సారి బిగ్గరగా "అంజలీ? అంజలీ?" అని పిలుస్తూ తలుపులు దబదబ బాదాడు అంజలి వులిక్కి పడింది మంచం మీంచి ఒక్కంగలో కిందకి వురికి పరిగెత్తుకుని వెళ్ళి తలుపు తీసింది

తిలక్‌కి రిలీఫ్! దానితో పాటే కోపం!

'అంతలా బాదుతుంటే విన్పించుకోకుండా ఏం చేస్తున్నావ్?"

బెంజమిన్ స్పాక్ వ్రాసిన "బేబీ అండ్ చైల్డ్ కేర్" పుస్తకం చూపిస్తూ గిల్టీగా అంది. 'పుస్తకంలో లీనమై పోయానండీ! చాలా ఆసక్తిగా వుంది" మంచం మీద ఇంకా ఏమేమిటో పుస్తకాలున్నాయి "గర్భిణీ స్త్రీలు తీసుకోవలసిన జాగ్రత్తలు" అమూల్ స్ప్రే వారి బేబీ బుక్ ఇలాంటివే! అవన్నీ చూసి తిలక్‌కి నవ్వొచ్చింది "ఎక్కణ్ణుంచి పోగేస్తున్నావు ఇవన్నీ? అయినా నాలుగు నెలలైనా నిండ లేదు కదా! మరీ ఇంత యావ అయితే ఎలా?"

మొట్ట మొదటి నుంచే జాగ్రత్తలు తీసుకుంటే బిడ్డ అందంగా ఆరోగ్యంగా పుడతాడు తెలుసా? మనకి పుట్టబో యేది పాప గాని బాబు గాని బంగారం పోత పోసినట్లుండాలి అందుకే ఇంత సమాచారం సేకరిస్తున్నాను. ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నాను" అంజలి గొంతులో ముఖంలో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతోంది

తిలక్‌కి అంజలి వుత్సాహం చూస్తూ, తన మనసులోని విషయం బయట పెట్టటాన్కి జంకుగా వుంది ఏ విధంగా రియాక్టవుతుందో, అతనికి అనూహ్యంగా వుంది పెళ్ళయి సంవత్సరం నిండ లేదు. అంజలి స్వభావం వ్యక్తిత్వం తనకింకా పూర్తిగా అవగాహన కాలేదు. సామాన్యంగా చాలా మైల్డ్‌గా వుంటుంది. ఒక్కోసారి మాత్రం మొండికేసేస్తుంది సరేలే తల పగలగొట్టుకోవడ మెందుకు?. టెస్ట్ చేయించి రిజల్టు తెలిసిన తరువాత అప్పటి సంగతి అప్పుడు చూసుకోవచ్చు.

తిలక్ అంజలిని చెయ్యి పట్టి మంచం మీద తన పక్కగా కూర్చోబెట్టుకున్నాడు "అంజూ ! రేపు శుక్రవారం మనం హాస్పిటల్ కెళ్ళాలి. త్వరగా తయారవు."

"ఎందుకండీ! మొన్నే కదా చెకప్ అయింది! మళ్ళీ 15 రోజుల వరకు వెళ్ళక్కర్లేదు కదా!"

'అందుక్కాదు అంజలీ! ఈ మధ్య అందరూ "అమ్నియో సెంటిసిస్" అనే టెస్ట్ చేయించు కుంటున్నారు ఈ పరీక్ష వల్ల గర్భంలో శిశువు సవ్యంగా ఏ అవకరాలు లేకుండా వున్నదీ లేనిదీ తెలుస్తుంది. కొన్ని వికృతమైన భయంకరమైన రోగాలున్నాయి వాటితో ఏదైనా వుంటే ఆ శిశువు ఎంతో కాలం బ్రతకదు చాలాసార్లు మృతశిశువులు పుడుతాయి. వాటి మూలంగా తల్లికి మానసికంగా హాని బాధ లేకుండా అబార్షన్ చేయించుకోమని డాక్టర్లు సలహా ఇస్తారన్న మాట."

అంజలి ఒళ్ళు భయంతో జలదరించింది ఆమె మనోనేత్రం ముందు రకరకాల భయంకరమైన దృశ్యాలు కదలాడ సాగాయి. ఈ మనసెందుకు ఎప్పుడూ చెడే తలుస్తుంది? ఎవరి విషయమైనా అంతే! ఒకసారి కీడెంచితే చాలు. భయంకర చిత్రాలు సృష్టించటంలో మనసుకి సాటి మరి లేదు ఈ సృజనాత్మక శక్తిని వ్యక్తం చేయగల్గడం ప్రతి పురుమనిషికి సాధ్యం కాదు. నూటి కోటికి ఒక్కరే చిత్రకారులవుతారు. ఇద్దరో ముగ్గురో రచయిత(త్రు) లవుతారు.

అంజలి ముఖంలో చీకట్లు, తిలక్ హృదయాన్ని స్పృశించగల్గితే అతను ఆటెస్టు చేయించేవాడు కాడేమో! కాని అతడొక సగటు మగవాడు. స్త్రీ సున్నిత హృదయాన్ని, మమతానురాగాల్ని, ఒక ప్రాణిని సృష్టించటంలో స్త్రీ పొందే నిస్వార్థానందాన్ని అర్థం చేసుకోలేని సాధారణ మానవుడు వివాహ బంధాన్ని, సంతాన బంధాన్ని కూడా డబ్బుతో తూచి గుణించి లాభనష్టాలు బేరీజు వేసుకునే లక్షలాది మానవాధముల్లో ఒకడు. అంజలికి అమ్నియోసెంటెసిస్ చేయించటం వెనుకనున్న అతని వుద్దేశ్యం వేరు. అంజలి అతి అపురూపంగా ఆశగా, ఆప్యాయంగా కడుపులో పెంచుకుంటున్న శిశువు ఆడో, మగో తెల్సుకోవడాన్కి. ఆడ శిశువైతే నిర్దాక్షిణ్యంగా రూపు మాపటాన్కి ఆడ పిల్లని కని ఏంబావుకోవాలి! అదే మగబిడ్డైతే స్థిరాస్థితో సమాన మేగా! స్త్రీలాల వెల రోజురోజుకి పెరుగుతున్నట్లు మగపిల్లల వెల ఆనాటి కానాటికి పెరుగుతూనే వుంటుంది

హాస్పిటల్‌కి వెళ్తూ అంజలి వెయ్యి దేవుళ్ళని ప్రార్థించింది. మధ్య మధ్యలో, జారిపోతున్న నిబ్బరాన్ని కూడ దీసుకోటాన్కి తిలక్‌ని ఏమేమిటో అడుగుతుంది. "ఏమండీ! ఈ పరీక్ష వల్ల బిడ్డ కేమి హాని కల్గదుకదా!"

ఏమండీ! బాగా నొప్పెడుతుందేమో!

ఏమండీ! ఇటు మావంశంలోనూ అటు మీ వంశంలోనూ ఎటువంటి వ్యాధులు లేవుకదా! మన బిడ్డకి మాత్రం వుంటుందంటారా?

ఇలాంటివే ప్రశ్నల పరంపరలు. తిలక్ "ఊ" "ఊహు" అంటూ సమాధానాలిస్తుంటే అంజలికి ముందు నిస్పృహ కల్గింది మరునిముషంలో "పాపం! ఆయన కూడా నాలాగే టెన్షన్ పడుతుండి వుంటారు" అనుకుని లేని వుత్సాహాన్ని ముఖాన పులుము కోవడాన్కి ప్రయత్నించింది.

తిలక్ టెన్షన్‌లో వున్న మాట నిజమే!" కాని అతని టెన్షన్ వేరు. మగబిడ్డ అయితే తనకంటె అదృష్టవంతుడుండడు. ఒకవేళ ఖర్మకాలి ఆడబిడ్డ అయితే అంజలికి తెలియకుండా ఎబార్షన్ చేయించటం ఎలా? తన వరస చూస్తుంటే అబార్షన్‌కి ఒప్పించడం అసాధ్య మన్పిస్తోంది. తనూ సమాధాన పడటానికి సిద్ధంగా లేదు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆడ పిల్ల అందులోనూ తొలుచూరు ఆదిలోనే హంసపాదులా, అవతరించటాన్కి వీల్లేదు. సైన్సు ఇంతగా వృద్ధి చెంది అమ్నియోసెంట్ సిస్ వంటి టెస్ట్‌ని సామాన్యుడిక్కూడా అందుబాటులోకి తెచ్చాక, ప్రభుత్వం అబార్షన్‌ని లీగలైజ్ చేశాక కూడా గుదిబండల్లాటి ఆడపిల్లల్ని కనటం ఎంత అవివేకం?

ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండగానే హాస్పిటల్‌కి చేరుకోవటం అంజలి నుంచి టెస్ట్ కోసం పదిహేను మిల్లీ లీటర్ల అమ్నియాటిక్ ఫ్లూయిడ్ తీసుకోవటం పూర్తయింది ఈ పరీక్ష ఏ ప్రయోజనానికి నిర్దేశింప బడిందో ఆ ప్రయోజనాలకి వుపయోగించితే నిజంగా ఒక అద్భుతమైన పరీక్ష. తల్లి కడుపులో బిడ్డని రక్షణ కవచంలా కాపాడుతూ "అమ్నియాన్" అనే రెండు పొరల సంచి వుంటుంది. ఆ రెండు పొరల మధ్య వుండే ద్రవాన్ని "అమ్నియాటిక్ ఫ్లూయిడ్ అంటారు ఇందులో శిశువు విసర్జించిన కణాలుంటాయి. ఆ కణాల క్రోమోజోముల్ని పరిశీలించటం ద్వారా అనేక విషయాలు తెలుస్తాయి.

శాస్త్రజ్ఞులు మానవ కల్యాణం కోసం కనిపెడుతున్న మహనీయ శక్తులన్నిటిని కుత్సిత మనస్కులైన మనుషులు మారణ హోమానికి సాధనాలుగా మార్చటం సాధారణ మయిపోయింది

అణుశక్తిని బాంబులు చెయ్యటాన్కి, జెనెటిక్ ఇంజనీరింగ్‌ని బయరాజికల్ వెపన్స్ తయారు చెయ్యటాన్కి ఈనాడు అమ్నియోసెంటిసిస్ స్త్రీకి భూమ్మీద స్థానం లేకుండా చెయ్యటాన్కి.

అదిరే గుండెలతో అంజలి టెస్ట్ రిజల్టు కోసం ఎదురు చూడసాగింది. ఆ రోజు... తిలక్ ముఖం చూస్తూనే అంజలికి అర్థమయిపోయింది. తను విని భరించలేని వార్త భర్త తెచ్చాడు. నెమ్మదిగా నేల మీద కూలబడింది. "చెప్పండి".

"అంజలీ! మన బిడ్డకి మెదడుకి సంబంధించిన వ్యాధి ఏదో వుందట. దాని మూలంగా ఎనిమిది తొమ్మిది నెలల్లోపునే చనిపోతుందట. అంచేత ఎంత త్వరగా అబార్షన్ చేస్తే అంత మంచిదన్నారు డాక్టరు." తిలక్ భారం దించుకుని తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు. అంజలి ముఖం మోకాళ్ళ మధ్య దాచుకుంది. భర్త ఆ టెస్ట్ మాటెత్తినప్పట్నుంచి ఆమె మనసు కీడునే శంకిస్తూ వచ్చింది. అందుకేనేమో! తనకి స్పృహతప్పటం , కన్నీరు కాల్వలు కట్టటం జరగలేదు. కాని ఏదో విరక్తి ! ఆ అబార్షన్ చేసేటప్పుడు తనకేదైనా అయిపోతే ఎంత బావుంటుంది! కాని అలా ఎందుకు జరుగుతుంది? ఇటువంటి వేదన ఎంతో పాపాత్ములకే ఇస్తాడు దేవుడు. ఆ పాప పరిహారం జరగనిదే వేదన నుంచి విముక్తి కల్గుతుందా?

తిలక్ అంజలి తల మీద చెయ్యి వేశాడు. "అంజూ మనసు గట్టి పరచుకో! నీ బాధ అర్థం చేసుకోగలను. నాకూ గుండెలు ముక్కలవుతున్నట్టుంది. కాని నేనే ధైర్యాన్ని కోల్పోతే నువ్వేమవుతావో నని మామూలుగా వుండటాన్కి ప్రయత్నిస్తున్నాను ఇంకా మనకి బోలెడు జీవితం ముందుంది. నీ ఆరోగ్యం బాగుండాలే కాని కావలసినంత మంది. పిల్లలు పుడతారు. లే! భోజనం చేద్దాం! పద".

అబార్షన్ ఒక పీడకలలా జరిగి పోయింది. అంజలిలో స్తబ్దత, నిరాసక్తత! భార్యని అలా చూసి తిలక్ గిల్టీగా ఫీలయినా అది క్షణికమే! నాలుగు రోజులు పోతే తనే సమాధాన పడుతుందిలే అని సర్ది చెప్పేసుకుని మనసులోని గిల్టీ కాన్షస్‌ని తుడిచేసుకునే వాడు.

అంజలి మాత్రం రోజు రోజుకి క్రుంగి పోసాగింది ఆమె మనసులో నిరంతరం ఒకే ఆలోచనా, భయం ఎంత తరిమి కొడదామన్నా దూరమవదు. చిన్న అనుమానంగా మొదలయి "వటుడింతై ఇంతింతై" అన్నట్టు పెరిగి పెరిగి ఆమెను వేధించ సాగింది. మరి భరించలేక ఒక నిర్ణయానికి వచ్చింది.

ఆరోజు తిలక్‌ని ఆఫీసుకెళ్ళనిచ్చి తనకి టెస్ట్ చేసి అబార్షన్ చేసిన డాక్టరు దగ్గర కెళ్ళింది.

డాక్టర్ ఆమెను గుర్తుపట్టింది "ఏమ్మా! ఇలా వచ్చావు? ఒంట్లో బాలేదా?" సాదరంగా అడిగింది.

అంజలి తల దించుకుని మెల్లని స్వరాన స్థిరంగా చెప్పింది "డాక్టర్! నాకు పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చెయ్యండి.

డాక్టర్ ఆశ్చర్య పోయింది. "సడెన్‌గా ఏమిటీ పిచ్చి?"

"సడెన్‌గా కాదు డాక్టర్! మీకు నా కేసు గుర్తుండే వుంటుంది. నాకు గర్భిణీ అని తెలిసిన క్షణం నుంచి నా బిడ్డ గురించి ఎన్నో విధాలుగా వూహించుకున్నాను. నా కడుపులో వున్నది చిన్ని నిరాకారమైన పిండంగా నాకు ఎప్పుడూ అనిపించలేదు. ఎంతో ముద్దుగా ఎన్నెన్నో రూపాలతో నా కళ్ళముందు కదలాడేది. నా వూహల్ని సత్యం చేస్తూ అదొక వ్యాధిగ్రస్తమయిన శిశువని తెలిసింది. ఆ శిశువుకి బ్రతికే అవకాశం లేదని తెలిసి కూడా అబార్షన్ చేయించుకోవటానికి నా మనసు తల్లడిల్లి పోయింది ఆ శిశువుని ఛిన్నాభిన్నం చేస్తుంటే



దానికి ఎంత నెప్పి కలిగిందో బాధతో ఏవిధంగా మెలికలు తిరిగిందో తల్చుకుంటూ క్షణక్షణం చిత్రహింస ననుభవిస్తున్నాను. నాలోనో ఆయనలోనో ఏదో లోపం వుంది అందుకే ఈ శిశువు ఇలా అయింది. మళ్ళీసారి మాత్రం సలక్షణంగా వుంటుందని నమ్మకం యేమిటి? మరోసారి మరోసారి ఈ నరకాన్ని అనుభవించ వలసి వస్తే నాకు పిచ్చెక్కి పోతుంది. దయచేసి నాకు ఆపరేషన్ చేసెయ్యండి. మీరు చెయ్యనంటే గవర్నమెంట్ హాస్పిటల్‌కి వెళ్ళి చేయించేసుకుంటాను." మితిమీరిన దుఃఖంతో అంజలి నిజంగా ఉన్మాదురాలే అయింది.

డాక్టరు మౌనంగా నిర్నిమేషంగా అంజలివంక చూడసాగింది. అంజలి హృదయంలో జరుగుతున్న సాగర మథనపు అలలు ఆమెను నిలువెల్లా తడుపుతున్నట్లనిపించింది. నిజం చెప్పెయ్యటమే మంచిదని నిర్ణయించుకుంది. "చూడమ్మా! నేను చెప్పబోయే విషయం ఆవేశం వుద్వేగం లేకుండా విను. నీ భర్త చెప్పొద్దని ప్రాధేయపడ్డాడు. కాని నీ పట్టు చూస్తుంటే చెప్పటమే మంచిదనిపిస్తుంది. నీకు అబార్షన్ చేసింది శిశువు సవ్యంగా లేక కాదు. నీ భర్తకి ఆడబిడ్డ ఇష్టం లేక. కనుక ఈ సారి పుట్టబోయే బిడ్డ సవ్యంగా వుండదేమోననే భయం పెట్టుకోకు. మనసు శాంత పరుచుకో! సంవత్సరం తిరక్కుండా నీ ఒడిలో బాబు వుంటాడు".

అంజలి మ్రాన్పడి పోయింది. ఈ భయంకర సత్యం కంటే ఇంత వరకూ నమ్ముతూ వచ్చిన అబద్ధమే బాగుందే! మనుషులు ఇంత పైశాచికంగా వుండగలరా! తన భర్త! తన ఎదుట డాక్టరు రూపంలో స్వచ్ఛ శ్వేత వస్త్రాలలో కూర్చున్న ఈ స్త్రీ! ఇంత నిర్దాక్షిణ్యమా! ఇంత రాక్షసత్వమా! ఇదేమిసాధ్యం? ఎందుకు సాధ్యం కాదా? ఆ రాక్షసి తన ఎదురుగానే వుందిగా! అంజలికి పిచ్చి కోపం వచ్చేసింది.

"డాక్టర్! ఆడజన్మ నెత్తి, ఈ విధంగా చేయటానికి మీకు ప్రాణమెలా ఒప్పింది? డాక్టర్‌కి కోపం రాలేదు. "అనేక కారణాలను అనేక మంది అబార్షన్‌లు చేయించుకుంటుంటారు. ఇది మా వృత్తిలో ఒక భాగం. ఇంకొకటి ఆలోచించు. నీ భర్తకే లేని మమకారం దయ మరొకళ్ళకెందుకుంటాయి? అక్కడకు నేను ఎన్నో విధాలుగా వివరించి చెప్పాను. నాలుగు నెలలు నిండుతున్న సమయంలో అబార్షన్ ప్రమాదమని, ఇన్ఫెక్షన్ వచ్చి దాని మూలంగా ఫెలోపియన్ ట్యూబ్యూల్స్ మూసుకు పోయి గొడ్రాలిగా మారే ప్రమాదం వుందనీ చెప్పాను. అయినా విన్లేదు నన్ను నిందించటం నీకు న్యాయంగా వుందా? నా మాట విని శాంతపడు. జరిగింది మర్చిపోవటానికి ప్రయత్నించు. ఈ సారి పండంటి బాబు పుడతాడు.

"అలా వ్రాసివ్వగలరా డాక్టర్?" డాక్టర్ తలదించుకుంది. అంజలి పిచ్చిగా నవ్వింది. "ఇదే చరిత్ర మరోసారి పునరావృతమవ్వచ్చు డాక్టరు గారూ! ఎందుకంటే నా భర్తకి హఠాత్తుగా జ్ఞానోదయమవుతుందనే నమ్మకం నాకు లేదు. అసలు మీరు చెప్పింది విన్నాక నానిర్ణయం ఇంకా బలపడింది. నాకు ట్యూబెక్టమీ చెయ్యండి.

మరునాడు ప్రొద్దున్నే వచ్చి హాస్పిటల్‌లో జాయినయింది. ఆరేషన్ అయ్యాక కాని తిలక్‌కి ఫోను చెయ్యనివ్వలేదు. తిలక్ నిప్పులు కక్కుతూ హాస్పిటల్‌కి వచ్చాడు. డాక్టరు ద్వారా జరిగిందంతా విన్నాడు. అంజలి పీక నొక్కాలనే ఆవేశాన్ని బలవంతాన అణచుకుంటూ ఇంటికి వెళ్ళి పోయాడు. మరి హాస్పిటల్‌కి రాలేదు

అంజలి డిశ్చార్జి అయింది. గుమ్మంలో అడుగు పెట్టబోతుంటే తిలక్ గర్జించాడు. "ఆగు! ఏధైర్యంతో ఈ ఇంట్లోకి రాబోతున్నావే? వచ్చిన దారినే బయటికి నడు. "గొడ్రాలికి నా ఇంట్లో చోటు లేదు." తిలక్ ఇలా అంటాడని అంజలి వూహించలేదు అయినా ఆమెకి చిత్రంగా ఏమీ అన్పించలేదు. నిర్వికారంగా అంది. "మంచిది నా చీరెలు తీస్కెళతాను". నెమ్మదిగా బట్టలు సర్దసాగింది.

కక్ష నింపుకున్న కంఠంతో అన్నాడు తిలక్

"సంసారం మంచి చెడ్డలు ఆలోచించి మగవాడు అనేక నిర్ణయాలు తీసుకోవలసి వస్తుంది. ఎంతో దూరం ఆలోచించి నీకు అబార్షన్ చేయించాను. అదేమీ గ్రహించ కుండా నన్ను సాధించటాన్కి మాతృత్వాన్ని చేతులారా తుంచుకున్న. నువు ఆడదానివా?దెయ్యానివి".

అంజలి ఒంట్లో రక్తనాళాలన్నీ బ్రద్దలయి నట్లయింది. దక్షుడి చేతిలో అవమానించబడ్డ సతిలా నిలువెల్లా దహించుకు పోతుంటే ఒళ్ళెరుగని కోపంతో శివంగిలా వురికి తిలక్ జుట్టు పట్టుకుని పీకింది.

"నువ్వు నువ్వు .. స్వంత బిడ్డని ముక్కలు ముక్కలు చేసిన హంతకుడివి నువ్వు నన్నిలా అంటావా?"

ఆశ్చర్యం నుంచి తేరుకుని తిలక్ ఆమెను ఒక్కతోపు తోశాడు. "కట్నం పేరుతో అత్త మామల చేతిలో సజీవదహనం అవటంకంటే నేను చేసింది లక్షరెట్లు మెరుగు" రొప్పుతూ అన్నాడు.

"హు! ఆడపిల్లలందర్నీ నాలాటి దద్దమ్మల్లా పెంచాల్సిన అవసరంలేదు చదువు నిచ్చి ఆత్మవిశ్వాసాన్నిచ్చి సంపూర్ణ వ్యక్తిగా తీర్చి దిద్దాలే కాని హత్య చేయకూడదు. అందరూ మీ లాగే ఆలోచించి కొడుకులే కావాలనుకుని ఆడ పిల్లల్ని పుట్టకుండానే రూపు మాపితే ఆ కొడుకుల్ని ఎవరు కొనుక్కుంటారు?

"ఖబుర్లు చెప్పటం తేలిక ఆచరించడం తప్పు" అయినా నీతో వాదన నా కనవసరం నాకళ్ళముందు నుంచి పో!"

"అవును! నీతో వాదించటం అనవసరం!" కోపమంతా జారిపోగా బట్టలు సర్దటం పూర్తి చేసి బయటకు నడిచింది. ఆమె ప్రమేయం లేకుండానే ఆమె కాళ్ళు ఆదే డాక్టర్ వద్దకి నడిచాయి.

అంజలిని చూడగానే జరిగిందేమిటో గ్రహించ గల్గింది డాక్టర్. ఆమెకు అంజలి పై అపరిమిత మైన జాలి కల్గింది. ఆడదాన్ని ఈ సమాజం పెట్టే బాధకు అంతనేది వుందా? ఆడదై పుట్టటం తప్పు. స్వంత ఇష్టా ఇష్టాలుండటం తప్పు ఆడదాని ప్రతి కదలికా తప్పే! సృష్టి ధర్మాన్ని నిర్వర్తించే యత్నంలో మరొక ఆడబిడ్డకు జన్మనివ్వటం అతి ఘోరమైన నేరమై పోయింది. మనం ఏదిశలో ప్రయాణిస్తున్నాం? ప్రతి సమస్యకు అద్భుత్రోవన పరిష్కారం వెతుక్కునే జన సమూహాన్ని పాప భారంలా మోస్తూన్న భారత మాతకి ప్రతీకలా అన్పించింది అంజలి. తన యింటికి తీస్కెళ్ళింది.

నాలుగు రోజులు పోయాక అంజలి అడిగింది. "డాక్టర్!నేను ఎవరి మీదా ఆధారపడకుండా నా కేదైనా పని చూపించ గలరా?"

"నేనూ అదే అనుకుంటున్నాను అంజలీ! నీ మనసుకి సాంత్వన దొరికేలా, నీ స్వభావానికి సరిపడేలా వుండే పని కోసం వాకబు చేస్తుంటె సరిగా అలాంటిదే దొరికింది. నేను చెప్పేది జాగ్రత్తగా విను దాదాపు అన్ని దేశాలలోనూ ఎస్ ఒ ఎస్ విలేజ్ అనే సంస్థ వుంది. ఇందులో అనాధలైన పిల్లలకు ఆశ్రయం దొరుకుతుంది. అయితే ఇది మామూలు అనాధ శరణాలయాల్లా వుండదు. ఇరవై ముప్ఫై ఇళ్ళతో ఒక గ్రామంలా వుంటుంది. ప్రతి ఇంట్లో ఎనిమిది నుంచి పన్నెండు మంది పిల్లలు, ఆ పిల్లలకు ప్రేమ పంచి ఇచ్చే "తల్లి" వుంటారు. అలా తల్లి పాత్రను నిర్వహించేటందుకు, వివాహం కాకుండా వుండి పోయిన ఆడవాళ్ళను, వితంతువులను, విడాకులు తీసుకున్న ఆడవారిని స్థూలంగా చెప్పాలంటే ఏ బాదర బందీ లేని వాళ్ళను ఎన్నుకుంటారు. ఈ విధంగా ఆ పిల్లలకు మాతృ వాత్సల్యం, కుటుంబ వాతావరణం లభ్యమయితే, ఆ స్త్రీకి బిడ్డల ప్రేమ ఆత్మీయత లభ్యమవుతాయి. ముసలి వయసులో ఈ సంస్థే ఆ స్త్రీల బాధ్యత వహిస్తుంది.

మనదేశంలో ఇటువంటి సంస్థ ఒకటి మద్రాసు దగ్గరవుంది ఇటీవలే ఆ సంస్థ నుంచి ఒక ప్రకటన వెలువడింది. "ప్రేమాభి మానాలతో అనాధలను తన స్వంతంగా, చూచుకో గల తల్లులు కావలెను" అని. నీకిష్టమైతే నిన్ను అక్కడకు తీస్కెళతాను.

శ్రద్ధగా వింటున్న అంజలి తలెత్తి డాక్టర్ వంక చూసింది. ఆమె కళ్ళలో మెరుస్తున్న ముత్యాల వెనుక నుంచి ద్యోతక మవుతోంది "ఎప్పుడు వెళదాం" అనే ప్రశ్న ■

## ఖ'వేమన'పద్యాలు




తప్పులెన్నువారు తండోప తండంబు
ఉర్విజనులకెల్ల నుండు తప్పు
తప్పులెన్నువారు తమ తప్పు లెఱుగరు
విశ్వదాభిరామ వినుర వేమ.

సీరియల్



# ఈ తరం యువతి

## వడ్లమన్నాటి కుటుంబరావు

(గత సంచిక తరువాయి)

రవికాంత్ శరీరంలో సన్నని వణుకు ప్రారంభమయింది.

తనూహించింది నిజమేనన్న మాట! మృదులతో తన ప్రేమాయణం... వాళ్ళింట్లో తెలిసిపోయింది అందుకనే రాజేంద్రని పంపించారు. ఇతను తనని చితక కొట్టటానికే మోటారు సైకిలు మీద తీసుకెడుతున్నాడు. మైగాడ్! అతనికి సడన్‌గా బుల్లెట్ మీద నుంచి దూకెయ్యాలనిపించింది. కానీ దాన్ని యమ స్పీడుగా పోనిస్తున్నాడు... రాజేంద్ర–

"ఏమిటో చెప్పకూడదా రాజేంద్రా?"

"అయితే వినండి. మీరు మా సిస్టర్ మృదుల... ఆడతనం లేని అమ్మాయి అని . వైవాహిక జీవితానికి పనికిరాని మాసకమ్మ అనీ... పాంప్లెట్సు వేయించారని మాకు తెలిసిన వాళ్ళందరికే పంపించారని మా నాన్నగారికి ఫోన్ చేశాడెవరో.... దాంతో డాడీ ఫైరయిపోయి. మీ ఎముకల్లో సున్నం లేకుండా చేసి రమ్మనమని ఓ అరడజను మంది గూండాలని పంపించాడు. ఆ విషయం తెలిసిన మా మృదుల... "అన్నయ్యా! ఆయన ధర్మరాజురా! నన్ను ప్రేమించిన పిచ్చి మారాజురా.. ఎలాగయినా ఆయన్ని కాపాడురా..." అని వాపోయింది. చెల్లెలంటే ప్రాణం... మీరంటే అభిమానం ఉన్న నేను మిమ్మల్ని కిడ్నాప్ చేసి తీసుకెడుతున్నాను. ఎందుకో తెలుసా? ఒక ఫ్రెండ్ ఇంట్లో మిమ్మల్ని దాచి మీకు రక్షణ కల్పించటానికి ఆర్ యూ హాపీ మిస్టర్ "లెక్చరర్?" అన్నాడు రాజేంద్ర.

"థాంక్యూ మిస్టర్ రాజేంద్ర! కానీ · పాంప్లెట్సు నేను వేయించటమేమిటి? నేనలాంటి పాడు పనులు ఎందుకు చేస్తాను? ముఖ్యంగా నేనభిమానించే మృదుల మీద .. ఇదివరో గిట్టని వాళ్ళు పన్నిన పన్నాగం!" సిన్సియర్‌గా... ఆవేశంగా అన్నాడు రవికాంత్.

"నాకు తెలుసు రవికాంత్‌గారూ! అందుకేగా మా డాడీకి తెలియకుండా రిస్కు చేసి మరీ మిమ్మల్ని కాపాడుతున్నాను. బీ... హాపీ!"

"థాంక్స్! థాంక్స్ ఎలాట్" అన్నాడు రవికాంత్. రాజేంద్రని...బుల్లెట్ ఆపి మరీ కౌగిలించుకోవాలనిపించిందతనికి కొన్ని క్షణాల్లో... బుల్లెట్... రింగు రోడ్డు మీద కొంచెం లోపలగా ఒక ఇంటి ఎదురుగా ఆగింది.

"ష్! ఫాలో మి" అన్నాడు రాజేంద్ర ఇంటి లోపలకు వచ్చిన "రవికాంత్‌కు గుండె ఆగిపోయినంత పనయ్యింది. సోఫాలో కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్న మధుసూదనంగారు.... సుదర్శనం... రవికాంత్‌ని చూడగానే కోపంతో బుసలు కొడుతూ లేచి నిలబడ్డారు.

అప్రయత్నంగానే వారి పిడికెళ్ళు బిగిసినయ్.

పరిస్థితి అర్థమయ్యింది రవికాంత్‌కి.

రాజేంద్ర చెప్పింది పచ్చి అబద్ధ మన్నమాట!

ఈ లోపుగా రాజేంద్ర... వాకిటి తలుపుల్ని లోపల నుంచి మూసివేసి దానికడ్డంగా నిలబడి...."కంగ్రాట్స్ మిస్టర్ రవికాంత్!" అన్నాడు కసిగా.

"యూ ఛీట్" అంటూ గట్టిగా అరిచాడు రవికాంత్. వికటంగా నవ్వుతూ అన్నాడు రాజేంద్ర.

"డాడీ! ముందే చెప్పారు? ఇది నా స్నేహితుడి ఇల్లు... వాడి పెళ్ళాం పిల్లలు పుట్టింటికి వెళ్ళారు. వాడు ఉద్యోగ రీత్యా కాంపుకి వెళ్ళాడు. కీస్ అడిగి తీసుకున్నాను. ఇక్కడికి ఎవరూ రారు... పైగా ఇల్లు కూడా మిగిలిన వాటికి దూరంగా సెక్లూడెడ్‌గా ఉంది. ఇక మీ ఇష్టం "కానివ్వండి!"

అంతే!

"యూ బ్లడీరోగ్. . బాస్టర్... యాక్సిడెంటయి చావటానికి సిద్ధంగా ఉన్న నిన్ను... నా కూతురి మాట మీద నా యింటికి తీసుకెళ్ళి... మహారాజ వైభవంగా ట్రీట్‌మెంటు జరిపించి పంపిస్తే... ఇది రా... నువ్వు నాకిచ్చే ప్రతిఫలం? నా ఊపిరిలో ఊపిరి... ప్రాణంలో ప్రాణం... అయిన నా కన్నతల్లి పెళ్ళి కాకుండా... దానికి వుమన్‌హుడ్ లేదని పాంప్లెట్సు అచ్చేయిస్తావట్రా? ఇంత చేసిన నిన్ను... ఊరికే విడిచి పెడతామనేనా నీ ఉద్దేశం?" చాచి బలంగా లెంపకాయ కొట్టారు మధుసూదనంగారు.

దిమ్మ తిరిగి పోయింది రవికాంత్‌కి. "అన్ని హంగులూ ఉండి కూడా... రౌడీగాంగుని తయారు చెయ్యని వాడీ మధుసూదనం ఒక్కడేరా..! ఎందుకో తెలుసా? నా డబ్బు బలం చూసి... నా మంచితనం చూసి... నా ప్రత్యర్థులు నాకు ఎదురు రావటం మానేశారురా! అలాంటి నన్ను ఈ రోజున... క్రూరాతి క్రూరుణ్ని చేశావురా బాస్టర్! నా ఆస్థి – అంతస్థు – మీద కన్నేసి.. నా బంగారు బేబీని లోబరుచుకోవటానికి... ఇంత నీచాతినీచమైన పద్ధతి అవలంభిస్తావట్రా స్కౌండ్రల్?... నా కూతురు మాసకమ్మటరా?"

రవికాంత్ పొట్టలో బలంగా గుద్దారు మధుసూదనంగారు.

పెద్దలు కనిపించారు రవికాంత్‌కి.

"నా కూతురికి ఆడతనం లేదని చాటింపు వేస్తావట్రా?"

కాలెత్తి వెనకనుంచి ఒక్క తన్ను తన్నారు బలంగా.

"అబ్బా!" అని మూలిగాడు రవికాంత్ ఆ బాధకు తాళలేక

"ఏరా లెక్చరరూ! నీ స్వార్థం కోసం.

నా చెల్లెలి నిండు జీవితాన్ని బలి చేస్తావట్రా...?

బ్లడీ ఫెలో! నీ చెత్త రాత పుణ్యమా అని ఒక్క పెళ్ళి సంబంధం కూడా రావటం లేదురా దానికి? నీ కాళ్ళు కడిగి ... ఆ నీళ్ళు నెత్తిన జల్లుకుని... నా

జరిగిన కథ- 12: రవికాంత్ చెల్లెళ్ళిద్దరి పెళ్ళిళ్ళు కుదురుతాయి. మృదుల, రవికాంత్‌లు తమ ప్రేమను వెల్లడించుకుంటారు మృదులకు వచ్చిన సంబంధాలన్నీ దుష్ప్రచారం వల్ల చెడిపోతుంటాయి. ఆ దుష్ప్రచారం చేసేది రవికాంతేనని ఎవరో మధుసూదనంగారికి ఫోన్లో చెబుతారు. రాజేంద్ర రవికాంత్‌ను తీసుకు వెళ్తాడు

చెల్లెలు నిచ్చి పెళ్ళి చేస్తాను స్వీకరించరా' చేతులు జోడిస్తున్నట్టుగా పెట్టి రవికాంత్ మేడ మీద ఫట్‌మని కొట్టాడు రాజేంద్ర. అతనికి సడన్‌గా తన మిత్ర బృందంలోని వాళ్ళు చెప్పే సాహస కృత్యాలు గుర్తొచ్చాయి. నెత్తి మీద వీపు మీద . చేతుల మీద కాళ్ళ మీద ఇష్టమొచ్చినట్టు కొట్టాడు చేతులతో కసి తీరా తన్నాడు కాళ్ళతో!

"ఆడపిల్లల జీవితాలతో చెలగాటా లాడితే.. అది అంత తేలికగా పోతుందనుకున్నావ్రా?" అంటూ మూతి మీద పిడికిలితో 'ఢఢ్' మంటూ గుద్దాడు సుదర్శనం రవికాంత్ జుట్టు పట్టుకుని గోడ కేసి కొట్టారు మధుసూదనంగారు 'యూ బాస్టర్డ్!' అంటూ

నక్షత్రాలు కనుపిస్తున్నాయి రవికాంత్‌కి – ఆ దెబ్బలకి

ఒళ్ళు పేలిపోతున్నట్టుగా ఉంది కీళ్ళు విరిగి పోతున్నట్టుగా మూతి వాచిపోయింది తల వెనకాల వేపు చొప్పి కట్టింది ఎవరో వెయ్యి సమ్మెటలు పెట్టి కొడుతున్నట్టుగా బాదగా ఉంది యాక్సిడెంటులో కూడా ఇంత బాధ తెలియలేదతనికి.

"సార్!' అన్నాడు రవికాంత్ – అవమాన భారంతో కుంగిపోతూ 'ఆ పాంప్లెట్ల గురించి నాకేమీ తెలియదు' అన్నాడు బాధతో పూడుకుపోయిన గొంతుతో

'తెలియదూ?" వేళ్ళని వెనక్కి తిప్పి మళ్ళీ చెంపలు పేల్చేశాడు మధుసూదనంగారు

'దొంగ వేషాలు మా దగ్గర కాదురా 'ఇడియట్? సుదర్శనం పిడికిలి గోడుగా బిగించి బలంగా రవికాంత్ పొత్తి కడుపులో గుద్దాడు

'అమ్మా" అంటూ విలవిలలాడిపోయాడు రవికాంత్

ఏరా . కొడకా" నాలుగు దెబ్బలకే నువ్వు ఇంత గిలగిల లాడిపోతున్నావే? నువ్వు చేసిన లుచ్చా పనికి మా చెల్లెలు పెళ్ళి కాకుండా ఏ సంబంధమూ ఎక్కి రాకుండా... అది గోలు గోలున వెక్కి వెక్కి ఏడుస్తుంటే. మేమెంత గిలగిల లాడాలిరా బాడ్కోవ్? రాజేంద్రలో ఆవేశం పెల్లుబికింది

డాడీ! ఈ బ్లడీ రోగ్ గాడివల్లే మనకీ కష్టాలు! మనకీ మెంటల్ టార్చర్! వీడిని తేలికగా వదిలి పెట్టకూడదు' అంటూ తన పాంటుకు పెట్టుకున్న అరచేతి వెడల్పు లెదర్ బెల్టు తీసి పట పట లాడించాడు రవికాంత్ శరీరం



మీద అందిన చోటల్లా

"అమ్మా! అయ్యో!" అంటున్న రవికాంత్ బాధతో కూడిన మూలుగుల నతడు లక్ష్య పెట్టలేదు

"ఎందుకు చేశావీ పని మళ్ళీ మా బేబీ జోలికి వచ్చావో...?" గర్జించాడు మధుసూదనంగారు.

"నేను చెయ్యలేదు" నీరసంగా నిస్త్రాణగా అన్నాడు.

"మేం నిన్ను ఇలా చేసినట్టు బయటికి గాని చెప్పుకున్నావో.. ఈ సారీ నీ శాల్తీ కూడా దక్కదు మా వాళ్ళకు" – మళ్ళీ నాలుగు వడ్డించాడు రాజేంద్ర.

ఇవేమీ వినిపించుకునే స్థితిలో లేదు రవికాంత్. తన శరీరంలోని ఓపికనంతా... ఎవరో పట్టి లాగేస్తున్నట్టు... తనకేదో మగత ఆవరిస్తున్నట్టు అనుభూతి చెంది. . తపేమని నేల మీద పడి పోయాడు.

"చచ్చాడేమో డాడ్?" సుదర్శనం అనుమానంగా అన్నాడు

'చావనీ! నా బేబీకి ఇంత అపకారం చేసిన వాడు బతికి ఉండటానికి వీల్లేదు' కళ్ళల్లో నిప్పులు కురిపించారు మధుసూదనం గారు. కసితీరా తన బూటు కాళ్ళతో – పడిపోయిన రవికాంత్ శరీరాన్ని తన్నుతూ అన్నారు

రాజేంద్ర కూడా రవికాంత్ శరీరాన్ని అటూ యిటూ దొర్లిస్తూ నాలుగు తాపులు తంతూ అన్నాడు–

"డాడీ! ఇక ఇక్కడ ఉంటం మనకు క్షేమం కాదనుకుంటా! పైగా... ఇది నా స్నేహితుడి ఇల్లు. ఏదన్నా జరిగితే మా వాడి మీదకు . వాడి ద్వారా నా మీదకూ వస్తుంది"

"అవును. ఇప్పుడేం చెయ్యాలి? నిజంగా చచ్చిపోలేదు కద! మృదుల పెళ్ళి సమస్యతో సతమత మవుతోంది చాలక ఇప్పుడు వీడితో కొత్త సమస్య వచ్చి పడిందే?" నెర్వస్‌గా అన్నారు మధుసూదనం గారు

సుదర్శనం... భయంగా వంగి. రవికాంత్ ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు.

'డాడీ' అరిచాడు సుదర్శనం.

"ఏం చచ్చి పోయాడా?" కంగారుగా అన్నారు మధుసూదనం గారు.

"లేదు డాడీ! శ్వాస ఆడుతోంది."

"థాంక్‌గాడ్! ఏం చేద్దాం వీడిని? చీకటి పడేంత వరకూ వెయిట్ చేసి .. ఆ తరువాత మన కార్లో తీసు కెళ్ళి, రోడ్డు పక్కన పడేసి వెళ్ళిపోతే....?" అన్నారు మధుసూదనం గారు ఆతృతగా.

"నో డాడీ! ఈ లోపుగా చుట్టు పక్కల వాళ్ళు. . దారే పోయే వాళ్ళు.. మన ఉనికిని వాచ్ చేస్తారు. ఈజీగా దొరికి పోతాం.. . దానికన్నా ఒక పని చేస్తే?" అన్నారు రాజేంద్ర.




"ఏం చేద్దా మంటావురా రాజా! త్వరగా చెప్పు.... నాకు కంగారుగా ఉంది" అన్నాడు సుదర్శనం

"ఎంత పిరికి వాడివి అన్నయ్యా? ఇలాంటప్పుడే ధైర్యం కావాలి. డాడీ ..?" అన్నాడు రాజేంద్ర.

"కమాన్.. . రాజా!"

"వీడ్ని మన కారులో వెనక సీట్లో పడుకోబెట్టి.... మనమే స్వయంగా తీసుకెళ్ళి.... వాడి తల్లి దండ్రుల కప్పగించేద్దాం. ఆ తరువాత వాళ్ళ తంటాలు వాళ్ళే పడతారు"

"డోంటబి స్టుపిడ్" కోపంగా అన్నారు మధుసూదనంగారు

"డాడీ మీరు తొందర పడు తున్నారు. నే చెప్పేది పూర్తిగా వినండి! మేం ముగ్గురం కారులో వస్తున్నాం.... బిజినెస్ పని చూసుకుని. రింగ్ రోడ్డు మీద బాంక్ కాలనీ దగ్గరకి వచ్చేసరికి ఎవరో వ్యక్తి రోడ్డుకి అడ్డంగా పడుకొని ఉన్నాడు. కారు ఆగిపోయింది మేం దిగి వచ్చి చూసేసరికి.... ఆ వ్యక్తి మీ అబ్బాయి. అదిరి పోయాం. చీమకయినా అపకారం చెయ్యని వ్యక్తి.... మీ అబ్బాయిని ... ఏ రాక్షసులు కొట్టి అలా పడవేశారో అర్థం కాలేదు. యాక్సిడెంట్ దెబ్బలు నయం చేయించి పంపింది. మీ అబ్బాయిని ఈ దెబ్బలతో చూడటానికా? అనిపించి మాకు కాళ్ళు చేతులు ఆడ లేదు. ఏం చెయ్యాలో తోచక.... మా కారులో ఎక్కించుకుని ఇలా తీసుకొచ్చేశాం అని చెపుదాం. వాళ్ళకి సానుభూతి చూపించి నట్టు ఉంటుంది. మన చేతికి ఎలాంటి బురద అంటకుండా ఉంటుంది లోగడ ట్రీట్‌మెంట్ ఇప్పించిన మనం . వాళ్ళబ్బాయిని చచ్చేట్టు కొట్టామని వాళ్ళ కనిపించదు. మనల్ని... మరోమారు దేవుళ్ళలా చూస్తారు" అన్నాడు రాజేంద్ర

"వెరీగుడ్ డాడ్! రాజా చెప్పిన ఐడియా చాలా బాగుంది" సంతోషంగా అన్నాడు సుదర్శనం

"రాజా! చదువులో నువ్వు జీరో వయినా ఈ విషయంలో హీరో వని పించు కున్నావ్.... ఓ కె ప్రొసీడ్' ప్రశంసస్తూ గ్రీన్ సిగ్నల్ ఇచ్చారు మధుసూదనంగారు.

ఈ విషయం తమకు తప్ప ఇంకెవరికీ తెలియ గూడదనే.. . డ్రైవర్ని తీసుకు రాలేదు మధుసూదనంగారు. ముగ్గురూ ఒకసారి బయలు దేర లేదన్నట్టుగా... ముందు తనూ సుదర్శనం టొయోట్టా . రాజేంద్ర బుల్లెట్ మీద బయలు దేరారు.

ఇప్పుడు మాత్రం రాజేంద్ర సూచన మేరకు.... ముగ్గురూ కారులో వెళ్ళటానికే నిశ్చయించు కున్నారు

ఇంటి వెనుకగా పెట్టిన టొయోటా కారుని . డ్రయివ్ చేసుకుంటూ ముందుకు తీసు కొచ్చారు మధుసూదనం గారు

అటూ ఇటూ తేరిపార జూసి .. జన సంచారం లేని సమయంలో ముగ్గురూ కలిసి రవికాంత్ శరీరాన్ని చటుక్కున కారు వెనక సీటులోకి జేర వేశారు.

ఇంటికీ.. బుల్లెట్‌కీ లాక్ చేశాడు రాజేంద్ర

మధుసూదనం గారు డ్రైవ్ చేస్తుండగా రాజేంద్ర. .. సుదర్శనాలు ఫ్రంట్ సీట్లో కూర్చున్నారు.

ముగ్గురి మనసుల్లోనూ ఆందోళన చెలరేగుతోంది.

ముఖం మీద చిరు చెమట పట్టేసింది.

ఉపకారం తప్ప ఎవరికీ అపకారం చెయ్యని తను.... రవికాంత్ విషయంలో ఇంత క్రూరంగా ఎలా ప్రవర్తించ గలిగాడో తలుచుకుంటే తనకే ఆశ్చర్యంగా ఉంది ... మధుసూదనం గారికి.

ఎందుకంటే .. ఇది తన గారాల కూతురు జీవిత సమస్య గనుక

"బాస్టర్డ్' ఎన్ని గుండెలు వాడికి.... తన బేబీ జీవితం బండలు చెయ్యటానికి?" కోపంగా స్టార్ట్ చేసి యాక్సిలేటర్ మీద కాలు వేశారు.

రింగ్ రోడ్డెక్కి స్పీడుగా పోతోంది టొయోటా.

ఎవరూ ఏమీ మాట్లాడు కోవటం లేదు.

కొన్ని క్షణాల తర్వాత అడిగారు మధుసూదనం గారు 'శాయిబాబా గుడి దగ్గరని తెలుసుగానీ పూర్తి అడ్రసు తెలుసా రాజూ?"

"కనుక్కుందాలే పోనీండి డాడీ" అన్నాడు రాజేంద్ర.

ఒక పది నిముషాల్లో మధుసూదనం గారి కారు రాఘవయ్య గారింటి ముందు ఆగింది

విషయం విన్న రాఘవయ్య గారి కుటుంబ సభ్యులు ఘొల్లు మన్నారు.

"ఒకరి జోలికీ శొంఠికి పోయేవాడు కాదు నా బిడ్డ. గొడ్డును బాదినట్లు బాదారు ఎవరికేం పోయే కాలం వచ్చిందో? నా రవిని అనవసరంగా కొట్టిన వాళ్ళు ఇంతకు ఇంత అనుభవించి తీరతారు" ఏడుస్తూ అంది సీతమ్మ కొడుకుని ఆ స్థితిలో చూసిన ఆమె తల్లి హృదయం ద్రవించి పోతోంది

'రాఘవయ్య గారూ! ముందు జరగాల్సింది చూడండి' అసహనంగా అన్నారు మధుసూదనం గారు.

బిక్క మొహం పెట్టారు రాఘవయ్య గారు

'రాజూ! అలా చూస్తావేం? కారులో వెళ్ళి దగ్గరలో ఉన్న ఒక డాక్టరుని పిలుచుకురా? పురమాయించారు మధుసూదనం గారు

రాఘవయ్య గారు వెడితే.. కసరి పంపించేసి ఉండేవాడా డాక్టరు!

మధుసూదనంగారి అబ్బాయని తెలియగానే... చూస్తున్న పేషెంట్లని ఆపివేసి.... ఒక మెల్ నర్సుని. .. సరంజామాని తీసుకొని వీళ్ళ కారులో వచ్చాడు డాక్టర్

మధుసూదనం గారికి విష్ చేశాడు డాక్టర్.

"డాక్టర్! దెబ్బలు తగిలిన ఈ లెక్చరర్ గారు.. వీరి కుటుంబం- మాకు చాలా కావలసిన వాళ్ళు త్వరగా నయ మయ్యేలా చూడండి ఇదుగో! మీ ఫీజు. ముందే ఇచ్చేస్తున్నా అంటూ చేతికొచ్చినన్ని వంద రూపాయల నోట్లని జేబులోంచి తీసి ఇచ్చేశారు

"థాంక్యూసార్! నో ప్రాబ్లమ్." డబ్బు జేబులో కుక్కుకున్న డాక్టర్ ముఖం వికసించింది వెంటనే తన పని కుపక్రమించాడు.

రాఘవయ్య గారి కుటుంబం ఎంతగానో కృతజ్ఞతలు తెల్పింది మధుసూదనం గారికి .. రెండో సారి కూడా యాదృచ్ఛికంగా రవికాంత్‌ని ఆదుకున్నందుకు.

దెబ్బలు నాలు గయిదు రోజుల్లో పూర్తిగా నయమయి పోతాయనీ,... వర్రీ పడాల్సిందీ ఏమీ లేదని చెప్పారు డాక్టర్.

'అలా అయితే .. ఇంకా బాగా చితక బొడిచి ఉండాల్సింది" కసిగా అనుకున్నాడు రాజేంద్ర.

మధుసూదనం గారు కూడా తన భావాల్ని కప్పి పుచ్చుకుంటూ పైకి సారీ! రాఘవయ్య గారూ! మాకూ రోజూ వచ్చి రవిని చూసి వెళ్ళాలనే ఉంది. కానీ. . బిజినెస్ పని మీద నేను బొంబాయి మా సుదర్శనం కలకత్తా.. రాజేంద్ర మద్రాసు వెళ్ళాల్సిన పని పడింది. ఇప్పటి కిప్పుడే తిరిగి వచ్చేందుకు కనీసం పది రోజు అయినా పడుతుంది అందుకని మీరేమీ అనుకోవద్దని మనవి చేస్తున్నాను వీలుంటే- మా మృదులని పంపిస్తాలెండి. బై.. ది.. బై .. బేబీని తరచూ మీ యింటికి వచ్చి.... మీ అందరి క్షేమ సమాచారాలు కనుక్కోమని చాలా సార్లు చెప్పాను. ఎక్కువగా వస్తోందా? బిడియ పడుతోందా? పిచ్చి బేబీ! దాని కసలే మొహమాటం ఎక్కువ!" అన్నారు.

రెండు రోజుల కొకసారి వస్తోందని చెప్పారు రాఘవయ్య గారి కుటుంబ సభ్యులు

తన ఆగ్రహాన్ని బలవంతంగా దిగ మింగుకుని పైకి మాత్రం మామూలుగా "రవి జాగ్రత్త! వస్తాం" 'అంటూ బయలు దేరారు డాక్టర్‌ని హాస్పిటల్ దగ్గర డ్రాప్ చేసిన టొయోటా... కొన్ని క్షణాల్లో మధుసూదనం గారి ఇంటి ముందాగింది.

# విజ్ఞానం- వినోదం

బాబ్‌బ్రౌన్

## సమస్య

కాంతి, దుమ్ము

## అవసరం

ఎండవేళ ఒక చీకటి గది

## ఇలా చేయండి

సన్నగా సూర్యరశ్మి కిరణాలు ప్రసరించేటట్లు బొమ్మలో చూపిన విధంగా ఒక చీకటి గదిలో కిటికీ రెక్కలను అమర్చాలి. (సూర్యరశ్మిని నేరుగా చూడవద్దు) సూర్య కిరణాలలో కదులుతున్న దుమ్ము కణాలు కనపడతాయి




## ఇలా ఎందుకు జరుగుతుంది?

ఇంటిని ఎంత శుభ్రంగా ఉంచినా ఎప్పుడూ కొంత దుమ్ము ఉండనే ఉంటుంది ఈ దుమ్ము కణాలు గాలిలో తేలేటంత తేలికగా ఉండి, వాటిపై బడిన కొంత కాంతిని పరావర్తనం చెందిస్తాయి కొద్దిపాటి దుమ్ము ఉండటం కాలుష్యం కాదు ఎటువంటి హాని కలుగదు వాస్తవానికి దుమ్ము కణాలు వాటిపై పడిన కాంతిని పరావర్తనం చెందిస్తాయి. కనుక మనం చీకటిలో సహితం చూడ గలుగు తున్నాము.

* * * * *

సాయంత్రం ఆరు గంట లయ్యింది

బాంకు నుంచి. .. అలా బీసెంట్ రోడ్డు కెళ్ళి ఫాన్సీ షాపులో తనకు కావలసిన వస్తువుల్ని కొనుక్కుని స్కూటరు మీద ఇంటికి తిరుగు ముఖం పట్టింది మృదుల

అనుకోకుండా నిర్మల కనిపించింది. లూనా మీద తన కెదురుగా వస్తూ..

"హాయ్ నిమ్మీ!" అంది

"హాయ్ మృదులా!" అంది నిర్మల.

"నేను నీతో మాట్లాడను" అంది మృదుల నిర్మల లూనా పక్కగా స్కూటరాపి

"అంత అపరాధం నేనేం చేశానే తల్లీ? నీకు ఉపకారం చెయ్యాలనే గదా ఉప్పుకారం వేసిన పదార్థాలు ఎక్కువగా తింటున్నాను.

అదేం ప్రయోగమే బాబూ?"

'కాస్త కోపం మరి కాస్త ధైర్యం రావటానికి . అది సరే! నాతో మాట్లాడ నంటున్నావు. పోట్లాడతావా?"

"అదీ చెయ్యను '

"మరేం చేస్తావ్?"

'నీతో టిఫెన్ చేస్తాను ఆ తరువాత కాఫీ తాగుతాను "

'ఇదా తల్లీ! నాతో మాట్లాడనంటే అర్థం? ఇంకా ఏమిటో నని బుర్ర బద్దలు కొట్టుకుని ఛస్తున్నాను.

"బుర్ర బద్దలు కొట్టుకో వద్దే- ఎర్రపిల్లా ఏడుస్తారు నీ కాబోయే

మొగుడు  మరియూ పుట్టబోయే పిల్లా జెల్లా!

ఏమిటేవ్ రోడ్డు మీద జిడ్డు కవిత్వం వస్తోంది? ఎవరన్నా దుడ్డుకర్ర తీసుకుని వెంటబడేరు  పద! ముందు హోటలుకి అంది నిర్మల నవ్వుతూ

ఇద్దరూ తమ వాహనాలను ఆ సందులో పార్క్ చేసి  తాళాలు వేసి మోడ్రన్ కేఫ్ ఎ సి హాలులోకి అడుగు పెట్టారు

'రెండు బాసంది  అంటూ ఆర్డరిచ్చింది మృదుల

ఈ విషయం తెలుసటే నీకు?'

"చెప్పందే ఎలా తెలుస్తుందే?

"మన సుశీల లేదూ?

ఉంది? ఏం జరిగింది?'

'ఎంత పని చేసిందో తెలుసా?"

'ఏం చేసిందే?

మనల్ని నిలువునా మోసం చేసిందే?

'ఏమిటే బాబూ ఆ మోసం? త్వరగా చెప్పు?

ఈ లోపుగా బేరర్ బాసంది కప్పుల్ని తెచ్చి ఇద్దరి ముందూ పెట్టాడు

ముందు ఈ బాసంది సంగతి కానీ, తరువాత చెపుతాను' అంది నిర్మల స్పూన్‌తో తీసుకుంటూ

'తింటూ చెప్పి చావవే! నాకు ఆరాటంగా ఉంది' తొందర పెట్టింది మృదుల

అమ్మో! ఆ విషయం విన్న తర్వాత నువ్వు బాసంది తింటం వదిలేశావనుకో  ఆ కప్పు కూడా తప్పకుండా నేనే తినాల్సి వస్తుంది అందుకని ముందిది లాగించు

అబ్బా! తిక్క బ్రాండువే నువ్వు' తనూ బాసందిని స్పూన్‌లో తీసుకుని సిప్ చెయ్యటం మొదలు పెట్టింది మృదుల

బాగుందే ఎంచక్కా!

'ఏమిటది?"

బాసంది

'ఒసే తిండిపోతూ  నీ సస్పెన్సు మండిపోనూ  తినటం అయిందిగా ఇప్పుడు చెప్పు

ఇప్పుడు మనం రెండు మినపట్టు ఆర్డరివ్వబోతున్నాం'

ఇస్తాంలే చెప్పు'

"ఆగవే తొందరపాటు సుందరాంగీ  అట్టు తింటుండగా  నీకా సంగతి చెప్పటం పూర్తి కాలేదనుకో  గుట్టు రట్టయి పోతుంది కనుక అది కూడా పూర్తి కానీ  చెపుతాను"

"చంపేస్తున్నావు కదే చంపాలతా" అంటూ బేరర్‌కి రెండు మినపట్టు తెమ్మని పురమాయించింది మృదుల

అట్టు తినేంత వరకూ  ఎంత పట్టు పట్టినా విషయం బయట పెట్టనే లేదు నిర్మల

ఆ తరవాత బ్రేవ్ మని త్రేన్చింది

"ఒసేవ్! అంది మృదుల

'కాఫీ కూడా కానివ్వవే ఈ ఆలస్యాన్నంతా మాఫీ చేసినట్టుగా అసలు సంగతి చెప్పేస్తాను నీ ముఖంలో సంతోషం రప్పిస్తాను నవ్వుతూ అంది నిర్మల

'ఒసేవ్ జిడ్డూ  ఈ సారి చెప్పక పోయావో తిరగేస్తాను నీ నడుం మీద తెడ్డు అంది మృదుల కాఫీకి ఆర్డరిస్తూ

దూరంగా ఉన్న ఒకళ్ళిద్దరు టేబుళ్ళ వాళ్ళు  వెళ్ళిద్దరి వేపు ఒకసారలా చూసి  మళ్ళీ తమ ప్లేట్లలో ఉన్న వాటిని తింటం మొదలు పెట్టారు

ఇద్దరూ కాఫీ తాగటం పూర్తయ్యాక అంది మృదుల అమ్మా నిమ్మ తల్లీ! ఇకనన్నా దులుపు తల్లీ నీ సస్పెన్సు దుమ్ము

దీపావళి కథలపై వ్యాస రచన పోటీలో రెండవ బహుమతి రు. 150/- లు పొందిన వ్యాసం

కథల పోటీలో ఎన్నికైన ఆరు కథలలో... నా దృష్టిలో ప్రథమ స్థానానికి అర్హమైన కథ . "అయమ్మ" ద్వితీయ .. తృతీయ స్థానాలని..." క్షీరధార", "జాతస్య హి ధృవో .. మృత్యు..." సంపాదించుకున్నాయి.

"కుండీలో పూలమొక్క ", 'మమతల శిఖరం", "వీడ్కోలు" కథలు మిగిలినవి మూడు స్థానాలని అదే వరుసలో నిలబడ్డాయి

సంపాదకుని ఎన్నికలో ఎన్నికైన . ఆరు కథలు– కృంగదీస్తుందో బాగా చెప్పారు చావు భయం నుంచి ఎవరినైనా తప్పించవచ్చు. అందులో గొప్పతనం ఉండదు బ్రతుకుభయం నుంచి తప్పించడంలోనే కనిపిస్తుంది మంచితనం.. మానవత్వం... తన వరకూ రానంత వరకూ కాలరెగరేసి కబుర్లు చెప్పేవాళ్ళే. తమకి రాగానే నీరుకారి... ఒడ్డున పడ్డ చేపపిల్లలా కొట్టుకు పోతారు. . మనుష్యుల్లో మార్పు రావడానికి కారణం పరిస్థితులే. . కోటయ్య షాడిస్ట్... అన్న...

# ఒకదానితోమరొకటిసంబంధంలేనివిభిన్నకథావస్తువులు

ఒక దానితో మరొకటి సంబంధం లేని. . విభిన్న కథా వస్తువులు కలిగిన కథ కథనం . భాష . శైలి... అన్నీ బాగున్నాయి నిత్య జీవితంలో... ప్రతి రోజు... దాదాపు ప్రతి ఒక్కరూ ఎదుర్కొనే అంశాలే

. అయితే ఈసారి ప్రత్యేకత ప్రేమకథలు చోటు చేసుకోకపోవడం... ఇదో చక్కని మార్పు. . ఇందుకు ప్రత్యేకంగా సంపాదక వర్గాన్ని. . రచయి(త్రు)తలని మనస్ఫూర్తిగా అభినందించాలి

కథల గురించి.. కథలోకి .. కదిలితే

పేగు పంచుకు పుట్టక పోయినా.. ప్రాణం పంచి పెంచిన పిల్లలు. కన్న పిల్లల కన్నా ఎక్కువే... అనీ. . కన్న ప్రేమ కన్నా పెంచిన మమకారం గొప్పదని... అమ్మ అయినా... అయమ్మ అయినా. . ఆడది అమ్మే అనీ. తనువు చాలించే వరకూ పిల్లల క్షేమం కోసం తహ తహలాడిపోతుందనీ, "అయమ్మ" కథలో చక్కగా చెప్పారు కథ చివర్లో రాజమ్మ అన్న "కన్నతల్లికి ఒక్కడే గానీ . పెంచిన తల్లికి ప్రపంచమంతా పిల్లలే" మాటలు.. అక్షర సత్యాలు .. ఆణిముత్యాలు . రాజమ్మ, రఘు.. సుజాతలాంటి వ్యక్తులు దాదాపు ప్రతి ఇంటా కనబడుతూనే ఉంటారు ఓ చక్కని కథ... 'అయమ్మ'.

మనిషికి డబ్బుండొచ్చు గాని . డబ్బు కోసం మనుషులుండ కూడదని .. డబ్బు శాశ్వతం కాదు... ఈ రోజు వుండొచ్చు.. రేపు పోవచ్చు. మనుషులు. . మమకారాలు. . మంచితనం... శాశ్వతం . ఒక్కోసారి జేబునిండా డబ్బున్నా... అది కాలే కడుపుకి పట్టెడు తిండి పెట్టలేదు. అన్న నగ్న సత్యాన్ని "క్షీరధార" కథలో బాగా చూపించారు. మాత (అమ్మ)ని గోమాత (ఆవు)ని సమానంగా చూపించడం ప్రశంసనీయం .. నారాయణ లాంటి మనుషులు కోకొల్లలు . కాని... ఎంత మందిలో వస్తుంది "మార్పు"... మానవత్వం .

భయం... చావు భయం మనిషిని ఎంతగా నేను... నా తప్పు తెలుసుకొని... సరిదిద్దుకుని మనిషి ప్రాణం నిలబెట్టడం హర్షించదగ్గ విషయం... 'జాతస్య హి ధృవో మృత్యు. ." మంచి కథ.

ఆదర్శాలను వల్లించడం కాదు అవి ఆచరించటంతో గొప్పతనముందని 'కుండీలో పూల మొక్క" కథలో ... కన్నపిల్లల కన్నా పెంచిన పిల్లలకే తల్లుల మీద మమతలు.. మమకారాలు ఉంటాయనీ... వాళ్ళే వృద్ధాప్యంలో... కొండంత అండగా నిలబడతారనీ "మమతల శిఖరం" కథలో ... పెంచిన పూలమొక్క మీద తోటమాలికి వుండే.... ప్రేమ .. వాత్సల్యంలాగే. . చక్కని బుద్ధులు... చదువు... చెప్పి ఉన్నతులుగా తీర్చిదిద్దిన... మాస్టర్లకి విద్యార్థులతో ముడిపడ్డ బంధాలు... పెనవేసుకు పోయే... మమకారాలు 'వీడ్కోలు' కథలో చాలా చక్కగా అందంగా చూపించారు

అన్నీ మంచి కథలు చదివామన్న తృప్తి... మిగిలింది. – శ్రీమతి వింజమూరి సుబ్బలక్ష్మి,

"నాన్సెన్స్" అంది నిర్మల గట్టిగా

'ష్! ఏమిటీ న్యూసెన్స్. నెమ్మదిగా చెప్పు" అంది మృదుల. బేరర్ బిల్లు తెచ్చిన ప్లేట్లో వంద రూపాయల కాగితా న్నుంచుతూ.

"మనల్ని పిలవ కుండా...."

"ఊఁ"

"మనల్ని తలవకుండా "

"ఊ . కానీ. "

"మనం పక్కన లేకుండా "

"ఆఁ"

"మనం అలంకరించ కుండా.

"అబ్బ కానీ.. ."

"తగుదునమ్మా అని– సుశీల "

"ఆఁ!"

"పెళ్ళి చూపుల్లో పాల్గొంటుందా. .?'

"నిజంగా"

"అంతే కాకుండా రాబోయే ముహూర్తాల్లో....

"ఆఁ! కానీ . త్వరగా"

"పెళ్ళి జరిగేట్టుగా ఏర్పాటు చేసుకుంటుదా?"

"హాయ్ నిజంగా! కంగ్రాట్స్ దానికి . .

దీని కింత బాధపడి పోతున్నావ్ నువ్వు దేనికి?" సంతోషంగా అంది మృదుల.

"మృదులా...." మామూలు ధోరణికి వచ్చి .. సౌమ్యంగా పిల్చింది నిర్మల.

చెప్పవే... అన్నట్టుగా చూసింది మృదుల. బేరర్ తెచ్చిన ఛేంజ్‌ని తీసుకుని... అతని టిప్‌ని ప్లేట్లో వదులుతూ.

"నీ పెళ్ళి విషయం ఇంకా తేల లేదని నువ్వు బాధ పడతావేమోనని అలా చెప్పాను తప్ప– సుశీలకి సంబంధం కుదిరిందంటే నాకు మాత్రం సంతోషం కాదుటే?" అంది నిర్మల

"నాకు పెళ్ళి సంబంధం కుదరటం..... ఓహ్!" నిర్లిప్తంగా అంది మృదుల.

"మృదులా.. ." కొంచెం గట్టిగానే అంది నిర్మల.

ఆమె కేసి ఆశ్చర్యంగా చూసింది మృదుల

"ఈ నిర్మల ... నీ నిర్మల! నీ ప్రాణ స్నేహితురాలు. ఆ విషయం గుర్తుంచుకో. .. ఇంతకన్నా నేను ఎక్కువగా చెప్ప దల్చుకో లేదు" ఆమె ముఖంలో చిలిపితనం స్థానే సీరియస్‌నెస్ చోటు చేసుకుంది

"ఏమిటే . అలా గయి పోయావు?"

"ఏం లేదులే పద అంది నిర్మల ధృడంగా.

బయటికి వచ్చిన తరవాత మృదులని ఏమిటేమిటో అడిగింది. వాటికి సమాధానాలు చెప్పింది మృదుల.

ఆ తరవాత ఇద్దరూ బై చెప్పుకుని విడిపోయారు.

(ఇంకావుంది)

# వ్యక్తిగతం

## పెద్ద అధికారి తొలగింపుకి చిన్న కారణం!!



రాజీవ్‌గాంధీ కరుణా కటాక్ష వీక్షణాలు ఎంత అనూహ్యంగా ఉంటాయో, ఆయన ఆగ్రహావేశాలు కూడా అంతే అనూహ్యంగా ఉంటాయని ఇప్పటి కెన్నోసార్లు తేలిపోయింది. ఒకప్పుడు ప్రధాని అనుచరుల లోను, ఢిల్లీ పోలీసు వ్యవస్థలోను అత్యంత ప్రముఖ స్థానం. వహించి ఇప్పుడు హఠాత్తుగా గెంటివేతకు గురైన వేద్ మార్వా ఉదంతం దాన్నే రుజువు చేస్తోంది. ఢిల్లీ నగర శాంతిభద్రతలకు పర్యవేక్షించే 37 వేల మంది పోలీసు సిబ్బందికి అధిపతి అయిన ఈ పోలీసు కమీషనర్‌ను నవంబర్ 20న సెలవుపై వెళ్ళిపొమ్మని కోరారు. బాధాకరంగా ముగిసిన ఈ అధికారి తొలగింపుకి కారణం ఆయన కారు ప్రధాని కారుకు అడ్డం రావడమేనని తెలుస్తోంది. సోవియెట్ ప్రధానికి స్వాగత సత్కార ఏర్పాట్లు తర్వాత మంత్రి నట్వర్‌సింగ్‌ను త్వరగా పార్లమెంట్ భవనానికి చేర్చేందుకు వెళుతున్న వేద్‌మార్వా కారు ప్రధాని కార్ల వరుసకు ఎదురు పడిందట. దానితో ప్రధాని, సోవియెట్ ప్రధాని పయనిస్తున్న కార్లన్నీ ఆగిపోవలసి వచ్చిందట. ఎంత పెద్ద అధికారిని తీసివేయడానికైనా చిన్న కారణం సరిపోతుందన్న మాట!

## 73 ఏళ్ళ వయసులో హిమాలయన్ రాలీ

73 సంవత్సరాల వయస్సుమళ్ళిన జె. కె. ఎస్. నికల్సన్ ఈ వయసులో ఇంకా హిమాలయన్ రాలీ కారు రేసుల్లో పాల్గొనడానికి ఉత్సాహపడుతున్నాడు. ఒక ముడి నూలు మిల్లు అధిపతి అయిన నికల్సన్ బొంబాయి నూలు వర్తకుల సంఘానికి అధ్యక్షుడు కూడా. 1967లో భార్య చనిపోయినప్పటి నుంచి కార్ల రేసుల్లో పాల్గొనని నికల్సన్ గత సంవత్సరం మారుతి జిప్సీ కారుతో మళ్ళీ పోటీలోకి దిగాడు. కాని అప్పుడు ఆయన కారు నైనిటాల్- అల్మోరాల మధ్య పడి పోయింది. ఈ సంవత్సరం మళ్ళీ మారుతి జిప్సీలోనే ఆయన 3000కిలో మీటర్ల ప్రయాణం విజయవంతంగాపూర్తి చేశారు. మిగతా



పోటీదార్లు మజిల్లో ఐదారు గంటల చొప్పున నిద్ర పోగా ఆయన మాత్రం రెండు గంటల పాటే నిద్రించాడట. అలా ఆయన ఈ సంవత్సరం పూర్తి దూరం ప్రయాణించి 35వ స్థానాన్ని సంపాదించాడు...

## పేరు కోసం ప్రాణాలతో చెలగాటం!

పేరు ప్రతిష్ఠలు పొందేందుకు ప్రమాదకర చర్యలకు పూనుకునే వాళ్ళు సర్వ సాధారణంగా తమ ప్రాణాలనే



పణంగా పెడతారు. కాని అమెరికాలో న్యూయార్క్ రాష్ట్రంలోని పశ్చిమ ఈస్లిప్ నగరంలో గుడ్ సమారిటన్ ఆస్పత్రి హృద్రోగ చికిత్సా విభాగంలో పనిచేసే రిజిస్టర్డ్ నర్స్ రిచర్డ్ ఏంజెలో మాత్రం ఇతరుల ప్రాణాలు పణంగా పెట్టి తాను మంచి వాణ్నని పేరు తెచ్చుకోదలచుకున్నాడు. వృద్ధ రోగులకు కండరాలను స్తంభింపజేసి, తద్వారా శ్వాసక్రియలో వైఫల్యం తెచ్చే మందుల్ని ఆయన మొదట ఇంజెక్ట్ చేసేవాడు. అప్పుడు ఆ రోగిని కాపాడటం కోసం ఆస్పత్రిలో తీవ్ర ప్రయత్నం జరుగుతున్నప్పుడు తానే మొట్ట మొదట వచ్చి, ఆ రోగులకు మళ్ళీ శ్వాస అందే కృషి చేసి వీరుడిగా పేరు తెచ్చుకునేవాడు. కాని ఒక 73 సంవత్సరాల రోగి మాత్రం ఈ నర్స్ ఏదో ద్రవాన్ని తన శరీరంలోకి పంపించాకనే తన శ్వాస కష్టమయిందని గుర్తించి అధికారులకు చెప్పాడు. ఈ సంవత్సరం 35 మందికి అటువంటి ఇంజెక్షన్లు ఇచ్చానని ఏంజెలో ఒప్పుకున్నాడు. గత మూడు నెలల్లో ఈ ద్రవం ఎక్కువగా ఎక్కించినందు వల్ల 10 నుంచి 20 మంది మరణించి ఉంటారని అధికారులు అనుమానిస్తున్నారు

## మనుమరాలి పెళ్ళి నాయనమ్మ అలక!

మాధవరావు సింధియా కూతురి వివాహం కూడా రాజకీయ వివాదాలల్లో పడింది. జమ్ము కాశ్మీర్ మాజీ మంత్రి డాక్టర్ కరణ్- సింగ్ కొడుకుతో తన కూతురు చిత్రాంగదకు డిసెంబర్ 11న వివాహం జరపాలని సింధియా తలపెట్టారు. కాని రాష్ట్ర భారతీయ జనతాపార్టీ సరిగ్గా ఆ రోజునుంచే ఒక ఉద్యమం మొదలు పెట్ట నున్నదని ఆయనకు తెలిసింది. ఆ ఉద్యమ క్రమంలో జైల్ భరో కార్యక్రమంలో వధువు నాయనమ్మ, రాష్ట్ర బి. జె. పి. నాయకురాలు రాజమాత విజయరాజె సింధియా కూడా అరెస్టవుతారని తెలిసింది. ఉద్యమం ప్రారంభమయ్యే తేదీ వాయిదా వేసుకొమ్మని మాధవరావు సింధియా తల్లిని అభ్యర్థించారు. ఆమె ససేమిరా వీల్లేదన్నారు. మాధవరావు సింధియా స్వయంగా బి. జె. పి. అధ్యక్షుడు ఎల్. కె. అద్వానీని కలిసి తన గోడు వినిపించుకోగా అసలు డిసెంబర్



11న ఉద్యమం ప్రారంభించడం లేదని తమ పార్టీ నిర్ణయించిందని ఆయన చెప్పారు. ఇంతకూ రాజమాత మనుమరాలి వివాహ సమయం గురించి తనతో సంప్రదించనందుకు కొడుకు మీదఅలిగి ఈ రగడ లేవదీశారట!..' □



# ఈకాలం పిల్లలు....

కె. నాగేశ్వరి

కుటుంబ జీవితంలో ఆడపిల్లలవలనగానీ, మగపిల్లల వలనకానీ సుఖం కంటే కష్టం అనుభవించేది తల్లే నంటారు. తల్లి తండ్రు లిద్దరికీ సమానమే నన్నది నిజం. పరోక్షంగా తండ్రి, ప్రత్యక్షంగా తల్లి అనుభవిస్తారు. ఈ కారణం వల్ల తల్లే ఎక్కువ పిల్లలవల్ల యాతనపడుతున్నట్లు వెల్లడవుతోంది.

అసలు పిల్లలెందుకు సమస్యలను సృష్టిస్తారు? అనే ప్రశ్నవస్తే, కేవలం కారెక్టరుకు సంబంధించి కాదు అని అర్థంచేసుకోవాలి. కొందరుంటారు. వారికి తల్లీ, తండ్రీ ఏం చాతకానివారు. అంటే వీరిని కనడం కూడా వారి చాతకానితనమే నని వీరి అభిప్రాయం.

వీరిచేతనైన తనం తల్లితండ్రుల దగ్గర ఎలా చూపుతారో ఒక్కసారిచూద్దాం. ఈకోవకి యిటీవల మగపిల్లలకంటే ఆడపిల్లలు రావడం విచారకరంగావుంది. ఒకప్పుడు ఉమ్మడి కుటుంబ వ్యవస్థలో పిల్లలవల్ల ఈ సమస్యవుండేది. అంటే నాయనమ్మ, మేనత్తలు, పినతండ్రులు, పిల్లల్ని తల్లి మందలించేప్పుడు అడ్డుపడి ఈ రకమైన విచ్చలవిడితనాన్ని అలవాటుచేసేవారు. అప్పుడు పిల్లలను అదుపులోపెట్టటం వదిలేసి, వారూవారూ పోట్లాటకు దిగేవారు. చివరికి దోషిగా పిల్లతల్లి తలొంచాల్సిన పరిస్థితి వచ్చేది.

ఇప్పుడు అంతటి సనాతనత్వం మాయమైంది. మరెందుకు పిల్లలు యిలా తల్లిపై విరుచుకు పడుతున్నారు?

ఎన్నితరాలు మారినా భారతీయ సాంప్రదాయంలో తల్లిస్థానం విలువైనది. ఎక్కడా చెడ్డతల్లి వుండదుగానీ, అతి ప్రేమ, మూర్ఖపు అభిమానం చెడే సృష్టిస్తాయి. పిల్లలు తల్లికంటే చదువుకుని తల్లిని తూలనాడితే వారు జీవితంలో ఎంత పైకివచ్చినా వ్యర్థజీవులే! ఇటీవల కొందరికి అది ఫ్యాషనైంది. తల్లి సోఫా దగ్గరకు కాఫీ, మంచం దగ్గరకు మంచినీళ్ళు అందిస్తే కులసాగా టి. వీ. చూస్తూనే, హిందీ పాటలు వింటూనే చదువుకుంటారు. వెనకటి విదేశాల్లో కుక్కపిల్లతో ఆడుకుంటూ కులాసాగా చదివే సాహిత్యం కావాలన్నట్లు, వీరికి చదువు కావాలి. సరే ఎన్నాళ్ళు తల్లి వీరినిలా పెంచుతుంది?

కుటుంబ నియంత్రణవల్ల సంతానం తక్కువ. పెద్దవారు వున్నవాళ్ళలా పెంచితే ఏం పోయింది అని వెర్రిగా భావించేవారున్నారు. వారొకటి తెలుసుకోవాలి. ఇద్దరు ఆడపిల్లలు, లేక ముగ్గురు ఆడపిల్లలు పుట్టడంచూసి చాలించుకున్నవారు యిప్పుడూ వున్నారు. అటువంటి యింట్లో పెద్దమ్మాయిని యిలా పెంచితే మిగతావారు యింకా



పెద్దలపట్ల అగౌరవం మంచిదా?

మంకుతనం పెంచుకుని పెద్దవారిని గౌరవించడం మానేస్తారు. ఒక్క ఆడపిల్ల వున్న తల్లికి మరీ వ్యధ. ఉన్న ఒక్కపిల్లకూ సంస్కారం, మంచి అలవాట్లూ, గుణం నూరిపోద్దామనే తల్లులు, తరాలుమారినా మనదేశంలో వుంటారు. మన సమాజంలో వుంటారు. ఎంత గొప్పస్థానానికి మనదేశపు స్త్రీ చేరుకున్నా, ఆడపిల్ల తల్లిగా ఆమె భవిష్యత్తుపట్ల ఆందోళన చెందడం సహజం.

ఇటీవల చాలా యిళ్ళలో పిల్లలు ఈరకంగా తయారవుతూంటే తల్లికి ఎప్పుడో ఒకప్పుడు సమస్యే తెస్తారు.

మనకంటే మన పిల్లలు సుఖపడాలంటే యిలా వదిలిపెట్టడం మంచిదికాదు. మనకు చదువుకోడానికి, బైటకి వెళ్ళడానికీ, అలంకరణకీ, ఆకారానికీ యింతటి సదుపాయాలు లేవు. వారికి ఎంతటి యిబ్బందులలోనైనా సమకూరుస్తున్నాము. మధ్యతరగతి కుటుంబాల్లోని కష్టసుఖాల పట్ల ఎస్కేపిజం వీరు అవలంబిస్తుంటే, వారికి భవిష్యత్తు ఎలావుంటుంది? ఎక్కడో ఒకచోట తప్పకుండా పప్పులో కాలేస్తారు. దీనివల్ల తల్లికి తీరని వ్యధ మిగులుతుంది. వ్యధేకాదు, యిటీవల మనోవ్యాధికి గురయి పిచ్చాసుపత్రికి పేషెంట్లు కూడా ఎక్కువయ్యారు. చివరికి ఏదీ పిల్లలు సాధించలేదని వున్న తరువాతివారిని క్రూరమైన డిసిప్లినుకు అలవాటు చేద్దామనుకునేవారూ వున్నారు. పసితనం నుండీ లేని అలవాట్లు టీనేజ్‌లో చెయ్యలేం. ఎంతో చక్కగా, ముద్దుగా, శుభ్రంగా పసితనంలో వున్న పిల్లలే ఈవయసులోని ఆకర్షణలకు గాలివాటంగా తయారవుతున్నారు.

ఇలా తల్లి తండ్రులను మాటాడితే "నోరుముయ్యి, నీ కేం తెలియదు" అన్న పిల్లలకి బాగా కీ యివ్వాలి. తల్లికి ఏం తెలియదు గనుకనే వీరి ఆటలు సాగుతున్నాయి. తల్లి తండ్రుల కబుర్లు వినడం. వారి వ్యక్తిగత జీవితంలోని ఎదురుదెబ్బలు, కలతలు, కష్టాలు పిల్లల ఎదుట వీలయినంత తక్కువగా చర్చించాలి. ఒకరిపట్ల యింకొకరికి ఉన్న నమ్మకం అవగాహన, ప్రేమాభిమానాలు వారికి చూపితే పరిస్థితి యిలా తయారవదు. ఏది ఏమైనా పిల్లలలో ఈ తత్వం కొంచెం వెర్రితలలు వేయడం శోచనీయమైన విషయమే! □



# ఆదరణ

బెలగాం భీమేశ్వరరావు

రెండ్రోజుల నుండి ముసురు' నాగావళి రెండు ఒడ్డులకు ఒరిసి ప్రవహిస్తోంది పెంటయ్యా బల్లకట్టు వెయ్యడం లేదు ఒడ్డునున్న గుడిసెలో మోకాళ్ళ మధ్య తల దూర్చి ఆలోచిస్తున్నాడు దమ్మిడి చేతిన పడలేదు

సాయంత్రం కాకుండా చీకట్లు కమ్ముకుంటున్నాయి ఈదురుగాలి చలి పెంటయ్యా ఆకాశం వంక చూస్తూ కుక్కి మంచంపై కూర్చున్నాడు కడుపు నకనకలాడుతూంది డబ్బాలో వైను వ్యాపారి తెచ్చిన కల్లు రొట్టి తీసేడు

గుమ్మం వద్ద అలికిడి అయింది ఒక చేతో మడత గొడుగూ మరో చేతో సూట్‌కేసూ పట్టుకొని ఒక మనిషి కనబడ్డాడు పెంటయ్యా ఠయిన గుమ్మం వద్దకు వెళ్ళాడు ఏంది బాబు? ఎక్కడ నుండి వొస్తున్నారు? చేతిలో ఉన్న సూట్‌కేస్ నందుకున్నాడు విశాఖపట్టణం నుండి వస్తున్నాను అన్నాడు ఆ కొత్త మనిషి ఇదింత వరకు పోవాలి బాబు? పెంటయ్యా అడిగాడు మాదలంగి' సమాదాన మిచ్చాడు కొత్త మనిషి తఁవరిప్పుడు ఎల్లినట్టే వుంది లోపలి కొచ్చి కూర్చోండి' వాతావరనం ఏం బాగాలే బయట నుంటే ఒళ్ళొంకర్లవ గలదు' హెచ్చరిక చేశాడు మారు మాటాడకుండా కొత్తమనిషి గొడుగు మూసుకొని గుడిసె లోపల కొచ్చేడు నులక మంచంపై కూర్చొని, పది సంవత్సరాల క్రిందట ఈ



ప్రాంతం వచ్చేను అప్పటికి ఇప్పటికి తేడా ఏమీలేదు గట్టు మీద ఈ పాక తప్ప' బస్ స్టాప్ నుండి సరియైన రోడ్డు ఏటి వరకు వెయ్యలేక పోయారు బూటుతో వేసిన అడుగు పడకుండా రెండు దగ్గర్ల జారి పడబోయాను పేంటుకంటుకున్న బురదను చూసుకుంటూ అన్నాడు

బాబూ' పట్నాల మీదున్న శ్రద్ధ మా పల్లెల మీద సూపించరు మా వోట్లతో గెలుస్తారు మీ ఊర్లు బాగు చేస్తారు మీ వూళ్ళలాగ మా పల్లెలిలా వుంటాయి బాబూ' అన్నాడు పెంటయ్య పొయ్యి ప్రక్క రాతి మీద కూర్చుంటూ

ఏం చదువు కున్నావ్?

ఇసుకూలు సదువు నేదు ఈ నాగావలే నాకు గురువు ఈ బల్లకట్టు పయానాలే నా పాటాలు

తెలివైన వాడివే బాగా మాట్లాడుతున్నావ్' బల్లకట్టిపుడు వెయ్యగలవా? ఇప్పుడా? బల్లకట్టా' అదేటి బాబు' ఏరు సూడండి వడి ఎక్కువుంది రెండ్రోజుల నుండి ఎయ్యడం నేదు .

కొంప మునిగేవ్ పని తొందరగా అయిపోతూందని వాళ్ళు రమ్మంటే హాస్పిటల్ వదిలేసి వచ్చేను

మీరు డాక్టరా బాబూ'

ఔను' డాక్టర్లకి పాఠాలు చెప్పే గురువును' ఆ వుద్యోగం మానేసి ప్రయివేట్‌గా ప్రాక్టీస్ పెట్టుకున్నాను'

అదేటిబాబు' వుజ్జోగం మానీసారా? వుజ్జోగం దొరకడం కట్టమని అందరూ అంటారే మరి

'నీకు తెలియదులే అదంతా ఒక్క క్షణం ఆగి– నీ పేరేమిటో నువ్వు చెప్పలేదు అన్నాడు డాక్టర్

నా పేరు పెంటయ్య'

నా పేరేమిటో అడగడం లేదు

పెద్దోలు పేరడిగితే ఏటనుకుంటారో అని

పల్లె మనుషుల్లో బెరుకుతనం పోవడం లేదు నా పేరు ప్రకాశరావ్'

మంచి పేరే పెకాసం బాబు' గొణిగాడు పెంటయ్య

చీకటి బాగా కమ్మింది గాలితో పాటు వర్షం జల్లు గుడిసెలోకి దురుసుగా వచ్చింది డాక్టర్ ఉక్కిరి బిక్కిరి అయ్యాడు

పెంటయ్య గుమ్మానికి అడ్డంగా తడక కట్టేసి పెద్ద పెద్ద బవంతుల్లో వుండే మనుసులు మీరు గుడిసెలో వుండడం గడ్డుగానే వుంటాది' నిట్టూర్పు విడిచాడు

డాక్టర్ ప్రకాశం ఇబ్బందిని బయటకు కనిపించ నివ్వలేదు

'నేనదృష్టవంతుణ్ణి' ఈ అద్వాన్నపు అడవిలో తోడైనా దొరికింది' ముఖం పై నవ్వును పులుంకొన్నాడు

పెంటయ్య రొంటి నున్న అగ్గిపెట్టి తీసి బుడ్డీ

# ఆదర్శ కుటుంబం




కుటుంబంలో ఉన్న వారందరికీ ఒకే విధమైన అభిప్రాయము ఉండుట చాలా అరుదు. గృహిణికీ, గృహ యజమానికీ ఏ చిన్న విషయంలో కూడా అభిప్రాయ భేదాలు కలుగుతూ, అవి సమసి పోతూ, తిరిగి తల ఊపుతూ ఉండడం సర్వ సాధారణం. ఆ విధంగానే తండ్రీ కొడుకులకూ, అత్తా కోడళ్లకూ చుక్క ఎదురౌతూ వుంటుంది. ఇది దేవతలలో కూడా తప్పలేదు. లక్ష్మి సరస్వతులకు పరస్పర విరోధం, కద్రువ కొడుకులనూ, గరుడుడు తల్లిని శపించడం అందరికీ తెలుసు. పరస్పరం ఆదరాభిమానాలు గల కుటుంబం చాలా అరుదుగా కానవస్తుంది.

ఒక బీద బ్రాహ్మణ కుటుంబంలో తల్లీ, తండ్రీ, కొడుకూ, కోడలూ– నలుగురు సభ్యు లున్నారు. ఉదార హృదయులు, భగవద్భక్తులూ అయినా తమ లేమికి పూర్వ జన్మ కర్మయె కారణమని వారు ఎలాగో కాలం గడుపు తున్నారు. తండ్రీ కొడుకులు యాయావరం చేసి దినం గడుపుతూ, దొరికిన దానితోనే తృప్తి పడేవారు.

ఒకనాడు వారికి ఎక్కువ బియ్యం లభించ లేదు. గృహిణి వండిన అన్నం ఒక్కరికి మాత్రమే సరిపోతుంది. తిన వలసిన వారు నలుగురు! గృహ యజమాని దానిని నాలుగు భాగాలు చేసి నలుగురూ అలా పంచుకొని తినడం మంచిదని అన్నాడు. గృహిణి ఆ విధంగానే నాలుగు వంతులు చేసింది. ఆ సమయంలో– వీరిని పరీక్షింప దలచి భగవంతుడు ఒక అతిథి రూపంలో వచ్చి యాచింపగా, బ్రాహ్మణుడు తన వంతు ఆహారాన్ని అతనికి సమర్పించాడు. అది చాల లేదని అతిథి చెప్పగా, "తన భర్తయే తన ఆహారాన్ని అతిథికిచ్చినపుడు తను మాత్రం ఎలా తిన గలనని తన వంతు ఆహారం అతిథికి పెట్టింది. అయినా అతిథి ఆకలిని వెల్లడించాడు. తలిదండ్రులు నిరాహారులై ఉన్నప్పుడు తాను భుజించడం భావ్యం కాదని, కుమారుడు తన వంతు అన్నం అతిథికి పెట్టాడు "ఇంకా ఆకలి తీరలే"దని అతిథి సూచించగా, "అత్త మామలు, భర్త తమ ఆహారాన్ని అతిథికి పెట్టినప్పుడు తానూ ఆ పద్ధతినే అనుసరించడం విధి అని హృదయపూర్వకంగా తన భాగాన్ని అతిథి కర్పించి, అతనికి సంతృప్తి కలిగించినది! ఆ ఆదర్శ కుటుంబ త్యాగానికి సంతుష్టుడైన భగవంతుడున్నపాటున అదృశ్యుడై వారందరికీ ఆశ్చర్యం కలిగించాడు తర్వాత ఆ కుటుంబం భగవ దనుగ్రహం వలన సిరి సంపదలతో తులతూగుతూ ఇనుమడించిన దైవభక్తితో సుఖంగా కాలం గడిపింది.

– బులుసు వేంకట రమణయ్య

## ఆటలు – అద్భుతాలు

### బిలియర్డ్స్

బిలియర్డ్స్ బంతుల్ని తోసే కర్రలకి చివరలో తోలు కొస తొడగడాన్ని 1807 లో ఫ్రెంచి వారు ప్రవేశపెట్టారు. పలకలు బిగించిన బల్లలు 1826 నుంచి వాడకంలోకి వచ్చాయి.




జాతీయ ఫుట్‌బాల్ బృందంతో అతి ఎక్కువ సార్లు పోటీలో పాల్గొన్న వ్యక్తి పెరూకు చెందిన హెక్టర్ చుంపిటాజ్. 1963 నుంచి 1980 వరకు ఆయన 140 పోటీల్లో పాల్గొన్నారు.

### 140 అంతర్జాతీయ పోటీలు



వెలిగించాడు. ఆ వెలుతురులో చుట్టూ చూశాడు డాక్టర్ ప్రకాశం.

నీటికడవ. దాని కప్పు మీద గాజు గ్లాసు. ఒక మూల పొయ్యి. పైన కర్ర మీద అడ్డాకుల గిదుగు. చూరున పొగాకు కట్టలు రెండు. ఆ ప్రక్కనే నాగస్వరం సొరకాయ డొక్కు వ్రేలాడుతూ.

"నువ్వొంటి గాడివా?" డాక్టర్ ప్రకాశం పెంటయ్యను ప్రశ్నించాడు.

"వొంటగాడినే. గుమడలో ఇల్లుంది. సమ్మత్సరం కిందట నా పెల్లాం పిల్లలిద్దరు నాగావలి వరదల్లో కొట్టుకు పోయారు. నా ఇల్లూ ఈ గుడిసె ఒక్కలాగే వున్నాయి. మరెందుకని ఇంటి కెల్లక ఈడే వుండి పోనాను".

"రక్షించావు. తోడైనా వున్నావు. ఈ చీకటిలో గుమడ వెళ్ళలేక మాదలంగి వెళ్ళలేక ఏటొడ్డున పడి చచ్చి వుండే వాణ్ని!"

"శివ! శివ!! పాడు మాటలాడకండి బాబూ మీ పేనానికి నా పేనమడ్డు!"

గాలి పెద్దది అయింది. గుడిసెకు వ్రేలాడకట్టిన రాళ్ళు కూడా కదులు తున్నాయి క్షణాలలో. ఎక్కడో మెరుపు మెరిసింది. పెద్ద ప్రేలుడు. దగ్గర్లో పిడుగు పడింది. భూమి ఒక్క క్షణం కంపించినట్టయింది. డాక్టర్ ప్రకాశం ఆందోళనతో చటుక్కున మంచం నుంచి లేచాడు. పెంటయ్య 'అర్జున! పల్గున! పార్థివ! కిరీటి! సాతవాహన!" అలవాటుగ అర్జునుని దశనామాలు చదువుతూ డాక్టర్‌కి ధైర్యం చెప్పేడు.

డాక్టర్ ప్రకాశం సర్దుకున్నాడు. "పెంటయ్యా దగ్గర్లో పిడుగు పడిందా?" ఆర్చుకు పోతున్న నోరు చప్పరిస్తూ అడిగాడు.

"అగ్గి పిడుగు బాబూ! అందుకే అంత లాగ శబ్దం

## ఆదరణ

యినిపించింది. గొంతు తడిసేసుకోండి!" కడవలో నీరు గ్లాసులో పొసి అందించాడు.

మారు పలకకుండా గ్లాసందుకొని డాక్టర్ గటగట చల్లని నీరు త్రాగేశాడు.

అరగంట గడిచింది. వర్షం తగ్గలేదు. దీపం గుడ్డి వెలుతురులో సూట్‌కేస్ తెరిచాడు. ఫేంటూ షర్టూ అక్కడున్న కొయ్యకు వ్రేలాడ దీసి లుంగీకట్టుకున్నాడు. పొడిగా వున్న పాలిష్టర్ షర్ట్ వేసుకున్నాడు. సూట్‌కేస్ నుండి పెన్ టార్చి సిగరెట్ టిన్ లైటర్ బయటకు తీసి పెట్టుకున్నాడు. ఆకలి వేస్తోంది.

"పెంటయ్యా! తినడానికి దగ్గర్లో ఏమైనా దొరుకుతాయా? బిస్కట్ పేకట్ మరచి పోయాను!" అన్నాడు.

"బస్సు రోడ్డు కాడ టీ కొట్టుంది. దూరం. గట్టంతా బురద. వర్షం కసింత తగ్గనివ్వండి!"

"అలాగే! వర్షం తగ్గేక వెళ్ళు!"

డాక్టర్ ప్రకాశం మరి మాటలు పెంచలేదు. కాలం గడుస్తున్న కొలది అతనిలో భయం ఎక్కువవుతూంది. ఎందుకు ప్రయాణం పెట్టుకున్నానా అని మధన పడ్డాడు. ఇబ్బందిగా మంచం పై కదులుతున్నాడు. భార్యా పిల్లలు గుర్తు కొచ్చేరు. పది లక్షలతో కట్టిన హాస్పిటల్ గుర్తుకొచ్చింది.

"డాక్టరు బాబూ! మావలంగిలో మీకు పనేటి?" పెంటయ్య ప్రశ్నతో ఈ లోకంలో పడ్డాడు డాక్టర్ ప్రకాశం.

"మాదలంగి ముందు పెద్ద తోటుంది చూడూ! అది మాదే! దాని అమ్మకానికి వచ్చేను. లక్షకు బేరం సెటిలయింది! అందుకనీ....."

"ఆఁ .... ఆ తోట మీదా? గొప్ప తోట బాబూ! రాతికట్టు పెద్ద నుయ్యి. ఎందుకమ్మేస్తున్నారు బాబు?" "నేనక్కడ! తోటిక్కడ!! పంట ఫలితం నా వరకూ రాకుండా ఉంది. మరెందుకని అమ్మేస్తున్నాను".

"నిజమే. మంచి పనే చేస్తున్నారు నిజాయితీ మనుషుల్లో తగ్గిపోనాది బాబూ!" పెంటయ్య వ్యాఖ్యానించాడు. చూరున ఉన్న పొగాకు తీసి చుట్ట తయారు చేశాడు.

వాన తగ్గిన సూచన కనిపించింది. చుట్ట ముట్టించి అద్ద పొగాకు వేసుకున్నాడు పెంటయ్య. డాక్టరిచ్చిన ఐదు నోటు పట్టుకొని తినడానికి ఏమైనా తీసుకు రాడానికి బయలు దేరేడు.

డాక్టర్‌కేమీ తోచలేదు. బయట కొచ్చేడు. గాఢాంధకారం. కీచురాళ్ళ అరుపులు! ఎక్కడో గుడ్లగూబ అరచింది. త్రుళ్ళిపడ్డాడు. ధైర్యం మెరుపులా మాయమయింది. గుడిసెలోకి వెంటనే దూరి పోయాడు.

అరగంట గడిచింది. పెంటయ్య రాలేదు. మేఘాలు విజృంభించాయి. డాక్టర్ గుండె దడదడలాడింది. గాలి ఎక్కువయింది. సూట్‌కేస్ లోని టర్కీటవల్ తీసి కప్పుకున్నాడు. గుడిసె కప్పు వూగింది. డాక్టర్‌కి భయం వేసింది. మంచానికి బల్లిలా కరుచుకు పోయాడు.

* * * * *

"యెదవ వాన! సంపి తినేసింది. టీ పాకే ఎగిరి






పోయింది. ఇంతా వర్షంలో ఎల్లానా ఏటీ దొరకనేదు!"

పెంటయ్య విసుక్కుంటూ గుడిసెలోకి ప్రవేశించాడు. డాక్టర్ నుంచి ఏ స్పందనా రాలేదు. గుడిసె మీదున్న గడ్డి కొంత ఎగిరి ఉంది. పెంటయ్య గాబరా పడ్డాడు. అగ్గిపెట్టె తీసి దీపం వెలిగించాడు. వానలో తడిసి డాక్టర్ ముద్దయ్యాడు. పెంటయ్య పిలిచినా పలుకలేదు. ఒళ్ళు తట్టి చూశాడు. చలువ కాడ లాగా చల్లగా ఉంది. ముక్కు పట్టుకు చూశాడు. కొంచెం వేడిగా ఉంది.

పెంటయ్య గుండెలో రాయి పడింది. అరిచేతులూ అరికాళ్ళూ పట్టి రుద్దేడు. ఐదు నిమిషాలు గడిచేక శరీరంలో కదలిక కనిపించింది. రెప్పలు బరువుగా కదిలాయి. "డాక్టరు బాబూ! లెగండి!" పెంటయ్య తట్టి చూశాడు.

డాక్టర్ లేచే స్థితిలో లేడు. తెరచి మూసుకున్నాయి కళ్ళు!

పెంటయ్య ఆలోచనలో పడ్డాడు. గుమడలో వైద్యం చేసే వాళ్ళెవరూ లేరు. పెంటయ్య భయంతో వణికి పోయాడు. డాక్టర్ ప్రాణం ఎలాగైనా కాపాడాలనుకున్నాడు. మంచాన్ని తన శక్తి కొలది పొడిగా వున్న వయిపు తిప్పాడు. గుడిసె మూలగా ఉన్న చితుకులు తీసి మంట రాజేసి డాక్టర్ శరీరాన్ని వెచ్చ చేశాడు. తరువాత గబగబ సారకాయ తీసి గ్లాసులో సారా కొంత పోసి డాక్టర్ నోట్లో బలవంతంగా పోశాడు.

పది నిముషాలలో డాక్టర్‌కి తెలివి వచ్చింది. పరిస్థితిని అర్థం చేసుకొని పెంటయ్య సమయస్ఫూర్తికి మెచ్చుకున్నాడు. "ఈ అడవిలో నువ్వొదుకో పోతే నేనేమై పోయే వాణ్ణి!" కళ్ళలో కృతజ్ఞత మెరిసింది.

పెంటయ్య ఆనందంతో పులకించి పోయాడు. డబ్బాలో రొట్టె తీసి తినిపించి ఆ రాత్రంతా డాక్టర్ ప్రక్కనే కూర్చుండి పోయాడు.

తెల్లవారింది. వర్షం తగ్గింది. సూర్యుడు ఆకాశంలో కనిపించాడు. ఏటి వేగం తగ్గింది. డాక్టర్ కోలుకొని లేచాడు. పెంటయ్య ఆలస్యం చేయలేదు. బల్లకట్టు ఏటిలో వేసి డాక్టర్‌ని క్షేమంగా అవతల ఒడ్డుకు తీసుకు వెళ్ళాడు. డాక్టర్ జేబు నుంచి ఇరవై రూపాయల నోటు తీసి పెంటయ్య కందించాడు. పెంటయ్య తీసుకోలేదు. "రాత్రి ఇచ్చిన ఐదు రూపాయలుంది. బాబూ! అది చాలు!" అని చేతులు కట్టుకున్నాడు.

డాక్టర్ సూట్‌కేస్ తెరచి ఒక చిన్న కార్డ్ బయటకు తీశాడు. దానిని పెంటయ్య చేతిలో పెట్టి "ఇది నా అడ్రస్ వుండే కార్డు. ఎప్పుడయినా విశాఖపట్నం వస్తే నా వద్దకు రా. నేను మళ్ళీ ఇటు రాను. కురుపాం నుంచి అలాగ విశాఖ పోతాను" అన్నాడు.

పెంటయ్య దానిని భద్రంగా పట్టుకొని డాక్టర్‌కి వీడ్కోలు చెప్పాడు.

* * * * *

కాలచక్రంలో ఆరు నెలలు గడిచాయి. పెంటయ్య ఆరోగ్యం దెబ్బతింది. వారం వారం వచ్చే డాక్టర్ చేత పరీక్ష చేయించుకున్నాడు. డాక్టర్ 'హెర్నియా' అన్నాడు. "ఇరవై నాలుగు గంటల్లోగా ఆపరేషన్ తప్పని సరి!" అన్నాడు.

తోడు మనిషిని తీసుకొని పెంటయ్య విశాఖపట్నం బయలుదేరాడు. సాయంత్రానికి విశాఖపట్నం చేరుకున్నారు. ఆటో ఎక్కి అడ్రసు ప్రకారం డాక్టర్ ప్రకాశం క్లినిక్‌కి చేరుకున్నారు.

లోపల నుండి కాంపౌండర్ బయటకు వచ్చాడు. పెంటయ్య వద్దకు వచ్చి ఎందుకొచ్చేవు అని అడిగాడు. పెంటయ్య విజిటింగ్ కార్డు ఇచ్చి తన విషయం చెప్పి డాక్టర్ గార్ని కలుసుకోవాలన్నాడు. "డాక్టర్ గారు హెర్నియా ఆపరేషన్ చేస్తున్నారు. ఇంక వచ్చేస్తారు. బెంచీ మీద పడుకో!" అన్నాడు కాంపౌండర్.

పెద్దహాలు. మధ్యలో నైలాన్ తెర. తెర వెనుక పెద్ద టేబిల్. నాలుగు కుర్చీలు. డాక్టర్ గారి తిరుగుడు కుర్చీ. తీలగా కనిపిస్తున్నాయి. ఎదురుగా గోడపై కాలగమనం తెలియ జేస్తూ పెద్ద గడియారం. బెంచీల మీద జనం వరుసగా కూర్చున్నారు. హాలంతా ఫినాయిలు వాసన.

అంతలో డాక్టర్‌గారు హుందాగా వచ్చి గబగబ తెర వెనక్కి పోయారు. పెంటయ్య కాంపౌండర్‌ని తొందర పెట్టేడు. కాంపౌండర్ లోపలకు వెళ్ళాడు. కొద్ది నిముషాలలో తిరిగి వస్తూ జవాబుగా, "పద! జనరల్ ఆసుపత్రిలో అడ్మిట్ చేయిస్తాను". అన్నాడు.

పెంటయ్య మనస్సు చివుక్కుమంది.






# సంక్రాంతి తరు సందేశం

పాపాత్ముడ! ఆగు! ఆగు!
పార నిమ్ము. నెమ్మి వాగు.
ఎత్తిన ఆ కత్తి దించు
చిత్తమ్మున ప్రేమనించు

చిరకాలం నుండి మనం కలుపుగోలు మిత్రులం
సృష్టిమాత పుత్రులం – పౌత్రులం, ప్రపౌత్రులం
వనదేవత హరిణాకృతి, గంధర్వుని కౌగిలాప,
స్వారోచిష మనువు పుట్టి, ధర్మ దీప్తి ప్రజ్వలింప.
అందుకనే మీకు మాకు ఆది నుండి ఉంది పొందు
కంద నీకు మన నేస్తం. మీ కనులకు మేము విందు

నా జాతిని నరికి నరికి పొట్ట పెట్టుకొనగ నేల?
నా వారే లేని రోజు, నష్టి కలుగు మీకు చాల!
నీ వదలిన విషపు గాలి, నేను ప్రీతి తీసికొందు
నీ కోసం ప్రాణవాయు వేను బదులు నొసగుచుందు

పరమేశ్వరు పూజ చేయ, పడతి కొప్పుకైసేయగ
ప్రసూనాల పంచుచుందు మన మైత్రీ లత పూయగ

చిగురు, ఆకు, మొగ్గ, పూవు, పిందె, కాయ, పండు, విత్తు
స్నేహభావ కారణాన సర్వస్వం నీకు నిత్తు.

రాల రువ్వి నన్నుగొట్టు రాతిగుండె రక్కసులకు
పూల నిత్తు, పండ్ల నిత్తు ఏమాత్రం కినుకలేక

నా ప్రాణం పోయినాక నా దేహం నీదే కద!
నా ఎముకలు, నేలబొగ్గు రూపమ్మున నీవే గద!
ఇంత మంచి చేయు నన్ను చంప చేయి ఎలా వచ్చె
వింత మనిషి నీ తలపున దౌష్ట్యమెలా చేరవచ్చె

మమ్ము జంప క్షామమ్ములు మానవులను చుట్టుముట్టు
మమ్ము పెంచ, క్షేమమ్ములు నరుని చేర్చు, పసిడి గట్టు

తరు వచనము ధాత్రి లోన
తలను తాల్చు గౌరవాన
కురియును గద భువిని వాన
కురియును గద పసిడి సోన

# షేర్ మార్కెట్‌లలో పెట్టుబడులు



–యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

ఈ వారం ఢిల్లీలో ఎక్కడ చూసినా ఇండియన్ ఎక్స్‌ప్రెస గొడవే గత నెల రోజులుగా సాగుతున్న రాజీవ్, గోయంకాల మధ్య యుద్ధం, హైకోర్టు తీర్పు, ఎడిటర్స్ గిల్డ్ సారధ్యంలో ఒక కొలువుకు వచ్చింది ఈ గోయంకా ఎవరో కాదండి బాబు, మనం ఈ రోజు చూస్తున్న స్టాక్ మార్కెట్‌ల పతనానికి కారణభూతుడు ఎలాగా అంటారా, బొంబాయి డైయింగ్ అధినేత నస్లీవాడియాని (ఈయన బారత దేశ విభజనకు కారకుడైన జిన్నా మనుమడు) భుజం మీద వేసుకొని, లక్షలాది ఇన్వెష్టర్‌ల అభిమాని (నాకు కూడా) శ్రీ ధీరుబాయి అంబానీ పతనాన్ని చూస్తానని సవాలు చేసిన వ్యక్తి ఈయన ఒక్క అంబానీని మాత్రమే దెబ్బ కొడుతున్నాను అనుకున్నాడు కానీ లక్షలాది ఇన్వెస్టర్‌ల విశ్వాసాన్ని చెదర గొడుతున్నాను అని కానీ తద్వారా భారత దేశ పారిశ్రామికీ కరణాన్ని కుంటు పరుస్తున్నానని కానీ అనుకో లేదు ఏమయితేనేమి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ గేట్లు తెరుచు కొన్నాయి సనకు కావలసిన ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్ కూడా రావటం ప్రారంభించింది ఈ విషయంలో ఎడిటర్స్ గిల్డ్ సారది శ్రీ రామోజీరావు ఎంతో అభినందనీయులు, రచ్చ గెల్చిన ఈయన ఇంట గెలవాలి– ఎందుకంటే తెలుగుదేశం ఆవిర్భావానికి కారకుడు ఈయన ఆ ప్రభుత్వమే పత్రికలను అణచి వేస్తున్నది దానికి నిదర్శనం ఆంధ్రపత్రిక, హైదరాబాద్ ఆఫీస్ ఉన్న బవనం లీజ్‌ను రద్దు చేయటం ఈయన ఇంట గెలిస్తే మనలాంటి పత్రిక పాఠకులకు ఎంతో ఆనంద దాయకం ఇంక మన టాపిక్ లోకి వద్దామా!

ట్రాన్స్‌ఫర్ డీడ్‌లో లెఫ్ట్ సైడ్‌న వున్న విట్‌నెస్ కాలమ్‌లో మనల్ని గురించి తెలిసిన వ్యక్తి సంతకం చేసి, దాని కింద తన పూర్తి చిరునామా రాయాలి అలాగే దాని ఎదురుగా వున్న సిగ్నేచర్ ఆప్ ట్రాన్స్‌ఫర్ అన్న చోట ట్రాన్సపర్ కోసం పంపుతున్న వ్యక్తి లేక వ్యక్తుల సంతకం మాత్రం చాలు

దాని క్రింది కాలమ్‌లో డేటిడ్ దిస్ అని వున్న చోట ఏ నెలలో కొన్నామో, డే ఆప్ అన్న ప్రదేశంలో ఏ రోజు, ఒన్ థవుజండ్ నైన్ హండ్రెడ్ అండ్ ఎయిటీ , అని వున్న ప్రదేశంలో సంవత్సరం తెలిపితే చాలు

దీని క్రింది భాగంలో ఒక చిన్న బాక్స్ కట్టి వుంటుంది ఇది ట్రాన్స్‌ఫరీ(స్) కోసం మొదట శ్రీ/శ్రీమతి లేదా కుమారి అని వున్న ప్రదేశంలో కొన్న వారు ఏ కోవలో వారో అవి వుంచి మిగతా రెండూ కొట్టి వేస్తే చాలు తరువాత ఆక్యుపేషన్ అని వున్న చోట వృత్తి వ్రాస్తే సరిపోతుంది తరువాత కాలమ్‌లో అడ్రస్ అని వున్న చోట మన ఎడ్రెస్ వ్రాసి, తండ్రి/ భర్త పేరు అని వున్న చోట మనకు వర్తించేది వ్రాస్తే సరిపోతుంది

ఇంకా దిగువకు వస్తే రెండు కాలమ్‌లు వుంటాయి ఎడమ వైపున వున్న దానితో మనకు సంబంధం లేదు కుడి వైపు స్పెసిమన్ సిగ్నేచర్(స్) ఆప్ ట్రాన్స్‌పరీ(స్) అని వున్న చోట రెండు, మూడు సంతకాలు చేస్తే మంచిది ఎందుకంటే ఈ బాగం కంపెనీ వాళ్ళ వద్ద బద్రంగా వుండి మనం ఈ షేర్ అమ్మినప్పుడు మన సంతకం అవునో కాదో నిర్ధారించేది దీని ఆదారంగానే కాబట్టి సంతకం జాగ్రత్తగా పెట్టాలి

ఇంక ఈ పేజి పూర్తి అయిపోయింది కనుక, వెనకకు త్రిప్పి చూడండి ఈ పేజీలో మనం షేర్ స్టాంప్‌లు అంటించాలి అడుగు బాగాన్న లాడ్జ్‌డ్ భై అని వున్న ప్రదేశంలో, ట్రాన్స్‌ఫర్ కోసం పంపేవారు వారి అడ్రస్ వ్రాస్తే సరిపోతుంది

ఈ విదంగా పూర్తి చేసిన ట్రాన్స్‌ఫర్ డీడ్‌ను, షేర్ సర్టిఫికెట్‌ను కలిపి ఒక గట్టి కవర్‌లో పెట్టి కంపెనీ రిజిస్టర్డ్ ఆఫీస్‌కు, దానిలో షేర్ ట్రాన్స్‌ఫర్ డిపార్ట్‌మెంట్‌కు రిజిస్టర్డ్ పోస్ట్ విత్ ఎకనాలెడ్జిమెంటు పంపితే రెండు మూడు నెలల కాలంలో మరల ఈ సర్టిఫికేట్ మీ పేరున ట్రాన్స్‌పర్ అయి మీకు చేరుతుంది ఈ ట్రాన్స్‌పర్ డీడ్‌లు చాలా కాంప్లికేటెడ్‌గా వుంటాయి వీటిలో గుడ్– బాడ్‌లు వుంటాయి వీటిని గూర్చి వచ్చే వారం తెలుసు కొందాము ఎందుకంటే మా అన్నయ్య గారి అబ్బాయి ఆకాంక్ష గట్టిగా అరుస్తున్నాడు ఎందుకనో

వీడి నోరుని చూసి ఒక రోజు నేన వ్వు కూడా నాలాగా షేర్ బ్రోకర్‌వి అవ్వుతావా" (ఎందుకంటే బ్రోకర్స్‌కి గట్టిగా అరవటం ఒక అవసరం) అని అడిగాను, వాడి గొంతును దృష్టిలో పెట్టుకొని వాడి సమాధానానికి నేను ఆశ్చర్య పోవలసి వచ్చింది ఎందుకంటే నీ దేమీ బాగా లేదు బాబాయ్ నేను ఏజెంట్‌ని అవ్వుతా అన్నాడు "ఏజంట్ ఏమిట్రా అని అడిగితే "అదే బాబాయి తుపాకులు లాంటివి కొంటే ఏజెంట్‌లకు కమీషన్ ఇస్తారుగా అటువంటిది ఒక్కసారి దొరికిందంటే చాలు హాయిగా 30 కోట్లు వస్తాయి ఇంక జీవితంలో కష్టపడే పని లేదు" అన్నాడు వీడి మాటలకు ఏడవాలో లేక ఆశ్చర్యపోవాలో అర్థం కావటం లేదు నాకు □



సీరియల్

# మంజీరనాదం

## కాశీనాథల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

ఏమాత్రం అనుమానించని సింగ్ తన ప్రత్యర్థి కావడం చూసి కొయ్యబారి పోయాడు అరవింద్

ఏవిఁటి సర్?" అతని ముఖ భావాల్ని చూసిన భట్టు కంగారుగా అడిగాడు

ష్! మాట్లాడకు" అన్నట్టు సైగ చేశాడు అరవింద్

అతను మౌనంగా వుండిపోయాడు

మళ్ళీ ఇద్దరి దృష్టీ సింగ్‌మీది కెళ్ళింది

రేపు రాత్రి పన్నెండు గంటలకి ఇదే అవరణలో మన ఇద్దరికీ పెళ్ళి అన్నాడు సింగ్

ఇప్పటికా మాట వందసార్లు చెప్పావ్!" చిరాగ్గా అంది కాంతి

అతను నవ్వాడు.

మరో వందసార్లు చెప్తాను అమాట నామీద పన్నీటి చినుకులా వుంది

కాస్సేపాగు! పన్నీరు కాదు నీ మీద కురిసేది ! బులెట్స్!" అరిచింది కాంతి

అతను మళ్ళీనవ్వాడు

వాళ్ళు గట్టిగా మాట్లాడ్డం వల్ల కావచ్చు వాళ్ళ మాటలు అరవింద్ వాళ్ళకి స్పష్టంగా వినిపిస్తున్నాయి సింగ్ ఏదేదో మాట్లాడుతూనే వున్నాడు మాట్లాడి ప్రయోజనం లేదనుకుందేమో కాంతి మౌనంగా వుండిపోయింది ఏడుస్తూ

భట్టూ! ఇలారా!" రహస్యంగా అంటూ అతని చెయ్యిపట్టి గబగబా బైటి కొచ్చేశాడు అరవింద్

ఇద్దరూ దూరంగా వున్న ఓ చెట్టు గుబుర్లో దాగి చూస్తున్నారు.

మరో అయిదు నిమిషాలకి, లోపల్నుంచి, కాంతి గదిలో వున్న స్త్రీ బైటి కొచ్చి, గుమ్మం దగ్గర నిద్రపోతున్న వాళ్ళని లేపి నాలుగు తిట్టింది

జరిగిన కథ- 23: అరవింద్, కాంతి, భట్టు అడవిలోంచి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుంటారు చివరి క్షణంలో ఏటిలో దిగిన కాంతిని మొసలి పట్టుకుంటుంది మొసలి నుంచి తప్పించిన కొండ జాతి వాళ్ళు కాంతిని ఎత్తుకుపోతారు కాంతిని నిర్బంధించిన వాళ్ళ నాయకుడు తనను పెళ్ళి చేసుకొమ్మని కోరతాడు అరవింద్, భట్టు కాంతి కోసం వెతుకుతూ నిర్బంధించిన శిబిరం దగ్గరికి చేరుతారు

మరి కాస్సేపటికి సింగ్ బైటి కొచ్చాడు బైటున్న వాళ్ళతో ఏదో చెప్పి వెళ్ళి పోయాడు

మళ్ళీ వాతావరణంలో ప్రశాంతత ఏర్పడింది ఆ స్త్రీ మళ్ళీ కాంతి గదిలో కెళ్ళి తలుపులు మూసుకుంది

ఇంత రాత్రప్పుడు ఆ సింగ్‌గాడు ఎక్కడి కెళ్ళుంటాడో! మెల్లగా అన్నాడు అరవింద్ తనలో తాను అనుకుంటున్నట్టు

'మరో ఇల్లుందేమో! అన్నాడు భట్టు

ఇప్పుడేం చేద్దాం?'

ప్రస్తుతం కాస్త అడవి కేసి వెళ్ళిపోదాం రేపు చీకటి పడ్డ తర్వాత అంతా పెళ్ళి హడావిడిలో వుంటారుగా అప్పుడు మనం వచ్చి అమ్మాయిగార్ని తీసి కెళ్ళి పోవచ్చు' అన్నాడు భట్టు, అది చాలా తేలిక విషయం అన్నట్టు

* * * * * * * * *



రాత్రి తొమ్మిది గంటలు దాటింది

కాగడాల వెలుతురు, డప్పుల సందడి

తమాషాగా వుంది వాతావరణం

కాంతిని అలంకరిస్తున్నారు కొందరు స్త్రీలు

బలి పశువులా వుండి పోయింది కాంతి ఏడ్చి ఏడ్చి కళ్ళు వాచి పోయాయి

ఆమె నలంకరించే స్త్రీలు కూడా కల్లు తాగినట్టున్నారు ఒకటే వాగుతున్నారు ప్రతి దానికీ పగలబడి నవ్వు తున్నారు వాళ్ళ మాటలనీ, వాళ్ళ నవ్వులీ, ముఖ్యంగా వాళ్ళ దగ్గర్నించి వచ్చే వాసననీ భరించలేక పోతోంది కాంతి

నీకు నెవర్లా ఆడ్డం వచ్చా? ఓ వృద్ధురాలు అడిగిం దామెని కాంతి మాట్లాడ లేదు

మళ్ళీ అడిగిందామె.

రాదు! కొట్టినట్టే అంది కాంతి

పోన్లే, మా వాళ్ళు నేరుపుతారు కిసుక్కున నవ్విందో కన్నె

ఎందుకు? కళ్ళు చిట్లించింది కాంతి

ఎందు కేటి పెళ్ళికి ముందు నువ్వు మాతో వచ్చి ఆడాల పాడాల!

తాగాలి కూడానా? కచ్చగా అంది కాంతి

అరె! నీకూ తెల్సే! అవును కూస్తి తాటికల్లు తాగాల! అందా యువతి

మరింతకంగారు పడిపోయింది కాంతి ఏదో కచ్చగా అనాలని అందిగానీ, నిజంగా తాగాలని అనుకోలేదామె

సరే మేవొత్తాం! జాగ్రత్తగా కూకో నిదరొత్తే తొంగో అని కాంతిని ఒంటరిగా వదిలేసి బైటికెళ్ళి పోయారంతా

వాళ్ళు బైటికెళ్ళడం అక్కడ ఎదురుగా వున్న చెట్టు కొమ్మల్లో దాగిన అరవింద్, భట్టులు చూశారు

వాళ్ళు వెళ్ళి పోయారనుకున్న తరవాత మెల్లిగా చెట్టు దిగారు

డప్పులు వాయించేవాళ్ళు, తాగి తందనాలాడే వాళ్ళు డాన్సులు చేసే వాళ్ళు చాలా కోలాహలంగా వుంది ప్లాన్ ప్రకారం ఓ పెద్దరాయి దూరంగా వున్న ఓ పొదలో విసిరాడు భట్టు

పెద్దగా చప్పుడయింది.

అటవికులు క్షణం డాన్స్, కేకలు ఆపి ఓసారి చుట్టూ చూసి మళ్ళీ డాన్స్ మొదలు పెట్టారు

భట్టు మరో రాయి విసిరాడు

ఎవడ్రా? అరిచాడొకతను డాన్స్ ఆపి

ఎవరూ మాట్లాడలేదు

అనుమానంగా చూశారంతా

'ఏదో జంతు వయ్యుంటదిలే!' అన్నాడొకతను

మళ్ళీ వాళ్ళు డాన్స్ మొదలు పెట్టబో తుంటే, అంతకు ముందు దాచుకున్న రాళ్ళన్నీ జాగ్రత్తగా విసిరారు అరవింద్, భట్టులు తలో మూలకి

అటవికుల్లో కోపం పెరిగి పోయింది

ఎవుడ్రా ఆడు! అన్నాడు గర్జించినట్టు

అంతా నిశ్శబ్దం

తాగుడు ఎక్కువవడం వల్లా ఎవరూ సరిగ్గా నిల్చో లేక పోతున్నారు

మరో సారి పొదలో చప్పుడవడంతో విసరుగా అటుకేసి వెళ్ళాడు 'ఎవరు" అంటూ అరిచిన వ్యక్తి

అందరూ మసగ బారిన కళ్ళతో చూస్తున్నారు అతను పొద దగ్గరికెళ్ళాడు ఏంకనిపించలేదు మరో వైపు కెళ్ళాడు

అప్పుడే అతని తలమీద బలంగా కొట్టాడు వేనకనించి పిల్లిలా వచ్చిన భట్టు

కిక్కురు మనకుండా కూలిపోయాడు అటవికుడు అతనికోసం కాసేపు చూసి, మళ్ళీ డాన్సు, కేకలు మొదలు పెట్టారు మిగతావాళ్ళు

ఇంక ఆలోచించకుండా స్పృహ కోల్పోయిన అటవికుణ్ని ఓ పక్కగా లాగి అతని దుస్తులు విప్పి తను వేసుకున్నాడు భట్టు మరుక్షణం అటవికుల్లో కలిసి



# రచయిత్రి జవాబులు



ఎస్. మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

ప్ర: అధునిక స్త్రీ అన్ని రంగాలలో పురుషుని కంటే, పురోగమిస్తోందా?

జ: పురుషుని కంటే, కాకపోయినా పురుషునితో సమంగా పురోగమిస్తోంది.

హెచ్. ఆర్ ఎ. రాజ్‌కుమార్, బళ్ళారి (కర్నాటక)

ప్ర: "సాహిత్యం విలువ తగ్గి, హీన స్థితికి చేరువవుతోంది" అని మీతో ఎవరైనా అంటే మీ రెలా ఫీలవుతారు?

జ. "నా మటుకు నేను సాహిత్యపు విలువల్ని దిగజార్చడం లేదు" అనుకుంటాను

ఎస్ పి. చంద్ర, నలగాంపల్లి

ప్ర: 1 సీత, సావిత్రి, అనసూయ లాంటి పరమ పతివ్రతా సాధ్వీమణులు ఈ కలియుగంలో వున్నారా?

2. కుల స్త్రీకి శీలమా, ధనమా, ప్రాణమా? వీటిలో ఏది ముఖ్యం?

జ: మీ వుద్దేశంలో పతివ్రతలంటే ఏమిటి? సీతలా అగ్ని ప్రవేశం చేసి బైటి కొచ్చే వాళ్ళా, సావిత్రిలా యమధర్మరాజు వెంట వెళ్ళి భర్త ప్రాణాలు తెచ్చేవాళ్ళా, అనసూయలా దేవుళ్ళని పసిపాపలుగా చేసి లాలించే వాళ్ళా అనా? అలా అయితే లేరు కానీ నా వుద్దేశంలో పతివ్రతలకి అర్థాలు వేరు

2 చంద్రా! మీరు రోజుకో తెలుగు సినిమా చూస్తారా? అయినా అడిగారు కాబట్టి చెప్తున్నాను అది వాళ్ళ వాళ్ళ వ్యక్తిత్వాన్ని బట్టి వుంటుంది

అరుణ, కృష్ణాపూర్

ప్ర సువర్ణగారూ, డబ్బులేక కూతురు పెళ్ళి ఆగిపోయి, ఆ తల్లి దండ్రులు కృంగి పోతుంటే, మరో పక్క లో కులు తలో రకంగా మాటలని మరింత కృంగ దీస్తారు ఇలా కాకుల్లా కూసే సమాజాన్నేమనాలి?

జ. మీరే అన్నారుగా కాకులని. కాకులు ఏదో కూస్తున్నాయిలే అని వదిలెయ్యడమే

డి మాధురి, రాయగడ (ఒరిస్సా)

ప్ర: సువర్ణాకన్నన్ గారూ! మంజీరనాదం' నవల చాలా [illegible]త్తంగా వుంచి రసన్ శవపేటికలో వున్న తాళపత్ర గ్రంథంలోని పాలి భాష ఏ ప్రాంతంలో వుంది?

జ మీ కాంప్లిమెంట్‌కి థాంక్స్! గౌతమ బుద్ధుడి కాలంలో వున్నట్లు చరిత్ర చెప్తోంది

ఎ నాగమణి, వునికిలి

ప్ర ఆంటీ! రసన్, చందనలను చిత్రహింసలు చేస్తూ మరణించ నీకండి వారిని తల్చుకుంటే ఏడుపొస్తోంది మీరు చూపించే ప్రేమ సన్నివేశాలు ఎంతో సున్నితంగా వుంటాయి మీరు ఒక్కరే ఇలా రాస్తున్నారు రసన్, చందనలు అడవిలో అన్ని రోజు లున్నారు కదా, వాళ్ళకి బట్టలు ఎలా?

జ సారీ నాగమణీ! రసన్, చందనలు చచ్చి పోయారు నా రచనలు మీకు నచ్చినందుకు కృతజ్ఞతలు ఆది మానవు లెలా వుండే వారో అలా వుండి వుంటారు!

చలపాక ప్రకాష్, విజయవాడ

ప్ర మన రాష్ట్రంలో స్త్రీకి వున్న గౌరవం

## మంజీరనాదం

పోయాడు తూలుకుంటూ వెళ్ళి

ఈ లోగా అరవింద్ భట్టు బట్టలు అటవికునికి వేసి భట్టు రాకకోసం ఆతృతగా చూస్తున్నాడు.

భట్టు తేలిగ్గా లో నికెళ్ళి పోయాడు

తాగిన మైకంలో వున్నందున ఎవరూ అతన్ని తమ వాడు కాదని గుర్తించలేదు

"అమ్మాయిగారూ!" మెల్లగా అన్నాడు భట్టు ఎమెదగ్గరికెళ్ళి భట్టు కంఠం




విని తక్కున లేచికూర్చుంది కాంతి ఆమె మొహం వెలిగిపోయింది

"భట్టూ! అరవింద్ 'ఏదో అనబోయింది

"ష్" అన్నట్టు సైగ చేసి ఆమె చెయ్యి పట్టుకుని అతి జాగ్రత్తగా గోడ పక్కగా నడుచుకుంటూ అరవింద్ దగ్గరి కొచ్చాడు

అరవింద్ కాంతి చెయ్యి పట్టుకుని ఏదో అనబోయాడు

ష్! త్వరగా పదండి సర్! వాళ్ళొస్తే ప్రమాదం అన్నాడు భట్టు

ముగ్గురూ అతి వేగంగా పరుగు తీశారు అయితే దెబ్బతిన్న అటవికుడికి స్పృహ వచ్చి కంగారుగా పరిగెత్తి విషయం మిగతా వాళ్ళకి చెప్పాడు అంతా కలిసి కాంతి గదిలోకి పరిగెత్తారు కానీ వదువు లేదు

అంతే! అందరిలో నూ ఆవేశం కట్టలు తెంచుకుంది

పొలో మంటూ వెంట పడ్డారు

వాళ్ళు వెంట బడతారని తెలిసిన అరవింద్ వాళ్ళు మరో వైపుగా సాగి పరుగు ప్రారంభించారు

అయినా వారి కంట పడనే పడ్డారు రన్నింగ్ రేస్‌లా పరుగుతీసి వార్ని ముప్పతిప్పలు పెట్టారు చివరికి ఓ కొండ ఎక్కేశారు

దైవికంగా అప్పుడే చిరుతల దండు అటవికుల మీద పడి చెల్లాచెదరు చేసేసింది

కొండ ఎక్కుతూ అదృశ్యాన్ని చూసి మరింత ఒణికి పోయారు అరవింద్ కాంతీ- భట్టూ కాస్తలో తప్పి పోయిన ఆపదని తల్చుకుని క్షణం కొయ్యబారిపోయారు

"ఇంక అటవికుల బాధ ప్రస్తుతానికి లేదు! తొందరగా పదండి! అరిచాడు భట్టు

పురుషుడికి లేదు కారణం ఏమిటి సువర్ణాకన్నన్ గారూ?

జ ఇదేవిఁటి కొత్తగా వింటున్నా నీ మాట! మన రాష్ట్రంలో అలాంటి తేడా వుందా?

ప్ర సువర్ణాకన్నన్‌గారూ! ఓ చోట చందన రసన్‌తో "నా ప్రాణం కావాలన్నా తీసి నీ కాళ్ళ ముందు పెడతాను" అంటుంది ప్రాణం తీసి కాళ్ళ ముందు పెట్టడం సాధ్యమేనా!

జ దర్మ సందేహమే ప్రకాష్! కాక పోతే మనం రోజూ మాట్లాడుకునే మాటల్లోని అర్థాలు వెతకండి. ఏం జవాబొస్తుందో నా ప్రాణం తీసి నీ ముంగిట కర్పూరంగా వెలిగిస్తాననిపించారో మహాకవి! పాపం ఆయన మీ అంత ఆలోచించలేదు

కె సునంద, బొంబాయి

ప్ర అక్కయ్యా! నా కథలెన్నో తిరిగొచ్చాయి రైటింగ్ బావుండక పోతే కథలు స్వీకరించరా! నేను కవితలు రాస్తుంటాను మీకు కొన్ని పంపుతున్నాను చదవండి నా ప్రశ్న దిగజారుతున్న సాహిత్యపు విలువలు పడిపోకుండా చూసే బాధ్యత పాఠకుల మీద కూడా వుంది, మీరు నాతో ఏకీభవిస్తారా?

జ మీ కవితలు చదివాను బావున్నాయి రైటింగ్ బావుండనంత మాత్రాన కథలు తిరిగిరావు మళ్ళీ మళ్ళీ ప్రయత్నించండి సాహిత్యపు విలువల గురించి మీతో పూర్తిగా ఏకీభవిస్తాను

## ఉత్తమ ప్రశ్న

నాగండ్ల వెంకటేశ్వరరావు, అమ్మాపాలెం

ప్ర. రచయిత్రిగారూ! మీ రచనల్లో సామాజిక స్పృహ కలిగించే నవలలేమైనా వున్నాయా? ఆ రచనల ద్వారా ప్రజల్లో ఏ మాత్రమైనా మార్పువచ్చిందా!

జ: కొన్ని వున్నాయనే అనుకుంటున్నాను. కానీ పెద్దలు ఎందరో సమాజానికి, సమాజ మనుగడకి అద్దం పట్టినట్టుండే రచనలు ఎన్నో చేశారు. వాళ్ళందరి మూలంగానే పెద్దగా మార్పు రాలేదీ సమాజంలో అలాంటిది, ఎడారిలో ఇసుక రేణువులాంటిదాన్ని నా రచనలవల్ల అంత తేలిగ్గా మార్పొస్తుందా! ఒప్పే ధన్యురాల్నే!

సమయవంతుల జగ్గారావు, రాజమండ్రి

ప్ర సువర్ణాకన్నన్‌గారూ! మంజీరనాదం చాలా బావుంది రసన్ చందనల్లాంటి ప్రేమికుల్ని విడదీసిన, వారి మధ్య అడ్డుగోడగా వున్న డబ్బు హోదా గొప్పదా! లేక రాజుగా, తండ్రిగా, నీతి నియమాల్ని కాపాడి, వాళ్ళ పెళ్ళి చెయ్యడం గొప్పదా?

జ అది వారి వారి మనస్తత్వాని మీద ఆధార పడుతుంటుంది ప్రేమికులకు, పెళ్ళి చెయ్యడమే గొప్పయితే, రాజా పాంధూలాంటి వాళ్ళకి వాళ్ళమధ్య వున్న అంతరాలే గొప్ప

భారతం లక్ష్మీదేవమ్మ, తాడిపత్రి

ప్ర: సువర్ణా కన్నన్‌గారూ! మీ "మంజీరనాదం" సీరియల్ చాలా బావుంది. పత్రిక ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తుంటాం మా ఇంటిల్లిపాదీ మీ అభిమానులే. అతి కొద్ది కాలంలోనే ప్రముఖ రచయిత్రి అయిపోయారు మీ సీరియల్ ఆంధ్రజ్యోతిలో ఎప్పట్నుంచి వస్తుంది?

జ. మీ అభిమానానికి నా కృతజ్ఞతలు రెండు మూడు వారాల్లో "ఆంధ్ర జ్యోతి" వీక్లీలో నా సీరియల్ మొదలవబోతోంది

సి మున్నీ, జొన్న గురకల్

ప్ర సువర్ణాకన్నన్‌గారూ! మీ "మంజీరనాదం"లోని కథలో "ప్రేమకు మరణంలేదు." అన్న కథ ఎండింగ్ చాలా బావుంది మీ అద్భుతమైన మీ మేధస్సుకి నా అభినందనలు

ఆడది పొంది సాధించలేనిది ఏది?

జ: నా మీద మీకు గల అభిప్రాయానికి కృతజ్ఞతలు. కానీ మీ ప్రశ్న నాకు అర్థం కాలేదు మున్నీ

నందూరి మారుతి, వరంగల్

ప్ర. "కలువబాల"లోని మీ "డియర్- మై డియర్" ఆదిలోనే అదరహా!

జ థాంక్యూ!

---

తమనలా ఆపదలో పడేసి తప్పుకు పోయిన వాళ్ళ మీద అంతులేని ద్వేషం కలిగింది ఆటవికులకి

ఒకతను గురిచూసి బాణం వదిలాడు అంతే! బట్టు ఆర్తనాదం చేస్తూ నేల కూలిపోయాడు

భట్టూ! కంగారుగా ఆగారు కాంతీ, అరవింద్ బట్టు అప్పటికే నీలంగా అయిపోతున్నాడు

అంటే అది విషపు బాణమన్నమాట! హటాత్తుగా పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది ఇద్దరికీ

మీరెళ్ళిపోండి సర్! ప్లీజ్! నా మాట విని పారిపోండి అంటూనే తల వాల్చేశాడతను

అరవింద్, కాంతి అలా ఏడుస్తూనే పరుగు ప్రారంభించారు గమ్యం లేని పయనం!

చిరుతల్ని తరిమేశారో ఏమో మళ్ళీ వెంట పట్టారు ఆటవికులు అంతకన్నా ఆవేశంగా వస్తున్నాడు సింగ్

అంతకంతకీ దూరం అవుతున్న వాళ్ళి చూసి పళ్ళు కొరుకుతూ అరవింద్ మీదికి చేతిలోని కత్తి విసిరాడు సింగ్

కత్తి అరవింద్ కాల్ని సగం వరకు నరికేసింది

అబ్బా!' అంటూ పడి పోయాడు అరవింద్

అరవింద్! ఎంత పనైంది అరవింద్! అంటూ అతనిమీద పడి పోయింది కాంతి

తన మీద పడ్డ కాంతిని గబాల్న తోస-

కాంతీ! వెళ్ళిపో! ప్రాణం వున్నంత వరకూ పరిగెత్తు! నామీద ఏమాత్రం ప్రేమాభిమానాలున్నా వెళ్ళిపో' ఆవేశంగా అన్నాడు అరవింద్

కాంతి పరుగు తీసింది

సింగు వెంబడించాడు.

కాంతి అలా పరిగెత్తి, పరిగెత్తి కొండ చివరికెళ్ళి పోయింది

'ఆగు!' అరిచాడు సింగ్

ఆగను! . మర్యాదగా వెళ్ళిపో! . ఒక్క అడుగు ముందు కేసావా.. నేనీ లోయలోకి దూకేస్తాను"! తనూ అరిచింది కాంతి



అతను ఆగలేదు.

అలా ముందుకొస్తూనే ఉన్నాడు కాంతికి దిక్కుతోచలేదు.

ఓ సారి... కిందకి చూసింది.

వేల అడుగుల్లో వుంది లోయ!

కింద నీళ్ళతో పాటు రాళ్ళు, చెట్లు!

"రాకు! ...." మళ్ళీ అరిచింది కాంతి అతను అతి చేరువగా వచ్చేశాడు.

"గుడ్‌బై అరవింద్" పెదవితో దుఃఖాన్ని నొక్కి పెట్టి కళ్ళు గట్టిగా మూసుకుని కొండ మీదినించి దూకేసింది కాంతి

"కాంతీ!...." దూరాన్నుంచి చూసిన అరవింద్ దిక్కులు పిక్కటిల్లేలా అరిచాడు.

ఎదురు చూడని ఈ పరిణామానికి బిత్తర పోయాడు సింగ్. బెదరించడమే గానీ. నిజంగా దూకేస్తుందని ఏమాత్రం అనుకోలేదతను పూర్తి స్పృహలో కొచ్చి, ఒక్క అంగలో కొండ చివరికెళ్ళి తొంగి చూశాడు. అంతా చీకటి.

కింద రాతికి తగిలిన కాంతి 'తల ఛిన్నాభిన్నమై పోయింది. తెరిచిన కళ్ళు అలాగే వుండి పోయాయి

ఆమె పూర్తిగా కింద పడక కొంత దూరంలో ఉన్న అంచె మీద పడినా తలకి బలమైన దెబ్బ తగలడంతో వెంటనే ప్రాణం విడిచింది

"డామిట్! . ఎంత పని చేశావ్!' అంటూ చేతులు విదిలించాడు సింగ్.

అతనికి అందినట్టే అందిన స్వర్గం క్షణాల్లో చేజారినట్టయింది అతనికి కాంతి మీద చాలా మనుసుగా ఉంది

"అసలిదంతా ఆ వెధవ మూలంగానే జరిగింది అతన్నువెళ్ళమని పోరకపోతే వెళ్ళేదేకాదు!" అనుకుంటూ ఆవేశంగా అరవింద్ దగ్గరి కొచ్చాడు.

కాలునించి స్రవించిన రక్తం మూలంగా ఆ ప్రాంతమంతా తడికాగా అలాగే నిర్జీవంగా కూలబడి పోయాడు అరవింద్

అతనికి పుట్టెడు దుఃఖం ముంచుకొస్తోంది. కానీ. ఏడవడానిక్కూడా ఓపిక లేదు

"తనేమనకుని బయల్దేరాడు? ఏం జరిగింది? తన మూలంగా కదూ అమాయకుడైన భట్టు, తన ప్రాణానికి ప్రాణమైన కాంతి చచ్చిపోయింది? . కాంతి వెళ్ళి పోదామన్నప్పుడే వెళ్తే ... ఎంత బావుండేది?.... ఏ దేవతలొచ్చి నా కాంతిని చూపిస్తారు?.. . కాంతి లేని నా జీవితం . ఓహ్! ఘోరం! .. నరకం!.. . " ఆవేశంగా నుదురు బాదుకున్నాడు

"ఏయ్! ." కాలితో తన్నుతూ అన్నాడు సింగ్ అప్పుడు చూశాడు అక్కడి కొచ్చిన సింగ్‌ని అరవింద్ వెంటనే అతని కళ్ళు అగ్ని గోళాల్లా అయిపోయాయి

"యూ బ్లడీ... రాస్కెల్!" పళ్ళు నూరుతూ పిడికిలి బిగించాడు

ఒకరి మీద ఒకరికి అంతులేని ద్వేషం!

"అసలు ఇదంతా నీ మూలంగానే జరిగింది! మొదట్నుంచీ నా ప్లాన్సన్నీ మంట గలుపుతున్నావ్! . నన్నల్లరి పెడుతున్నావ్! నా తల్లో పురుగులా చేరి తొలుస్తున్నావ్! చివరికి నేను మోజుపడ్డ పిల్లని కూడా నాక్కాకుండా చేశావ్! .. . నిన్ను బతకనియ్యకూడదు!" మరింత ఆవేశంగా అన్నాడు సింగ్.

"నేనా? అసలు నీ జోలి కొచ్చానా?.. నువ్వే నాకు ఆనాటి నుంచీ ఆటంకాలు కలిగించి నా సహనాన్ని పరీక్షించావ్! నా శ్రమనంతా ధారపోసి సంపాదించిన రసన్ శవాన్ని, అతని ప్రణయ గ్రంథాన్ని కాజేశావ్!. మాకు తిండి లేకుండా చేశావ్! చివరికి నా ప్రాణ సమానమైన.... కాంతిని, నాకు తండ్రి లాంటి భట్టుని నీ పొట్టన పెట్టుకున్నావ్! ... నిన్ను బ్రతకనివ్వ కూడదు!" హటాత్తుగా ఓ పెద్ద రాయి తీసి అతని మీద విసర బోయాడు అరవింద్ ఎక్కడ లేని ఓపికా తెచ్చుకుని.

అంతే. అతని కుడిచెయ్యి తెగి అల్లంత దూరాన పడింది బాధతో విలవిల్లాడుతూ జీవచ్ఛవంలా కూలి పోయాడు.

"హాః!. . . నా మీద చెయ్యెత్తిన వాడికి ఇదే శిక్ష!" విలన్‌లా నవ్వుతూ వెళ్ళి పోయాడు సింగ్ అరవింద్‌కి స్పృహ తప్పింది

* * * * * * * * *

మళ్ళీ అరవింద్‌కి స్పృహవచ్చే సరికి వుదయకిరణాలు పడుతున్నాయతని మీద

కాలూ, చెయ్యీ భరించ లేనంత బాధగా వున్నాయి

"ఇంకా బతికే వున్నానా?" అనుకున్నాడు

మొండిగా వున్న కాలూ చెయ్యి ఓసారి చూసుకున్నాడు రక్త స్రావం ఆగి పోయింది. కానీ చూడ్డానికి భయంకరంగా వున్నాయి

ఏ జంతువులో తననీడ్చి కెళ్ళనందుకు ఆనందించాలో, ఇలా అవిటి వాడిగా మిగిలినందుకు విచారించాలో అర్థం కాలేదతనికి

అతనికి కాంతి గుర్తొచ్చింది.

ఆమె అల్లరి, చిలిపి మాటలు గుర్తొచ్చాయి. తర్వాత భట్టు, అతని సేవలు, విశ్వాస పూరితమైన అతని మాటలూ గుర్తొచ్చాయి

## గడుసులోకం

— బాబు






దీపావళి కథలపై వ్యాస రచన పోటీలో మూడవ బహుమతి రు. 100-లు పొందిన వ్యాసం

# ఆర్యోక్తి ఆవిష్కరణకు అగ్రతాంబూలం

బుద్బుదప్రాయమైన ఈ బ్రతుకు శాశ్వతమని నమ్మి, పరుల మరణాన్ని పర్వదినంగా భావించి సంబరపడే అహంభావులకు జ్ఞానోదయం కలిగిస్తుంది 'జాతస్యహి ధృవో మృత్యు ...' అంతేకాకుండా 'తన సంతోషమె స్వర్గము తన దుఃఖమె నరకమండ్రు' అన్న ఆర్యోక్తిని అత్యంత మనోహరంగా . ఆవిష్కరించిన ఈ కథకు అగ్రతాంబూలం యివ్వడం సముచితం

ఆదర్శాల పరదాల చాటున పురుషుని వ్యక్తిత్వం ఎంత సంకుచితంగా వుంటుందో, కుండీలో పూలమొక్కతో స్త్రీని పోల్చి చెప్పడం హృద్యంగా వుంది. ఈ కథకు ద్వితీయ స్థానం వస్తుంది.

కన్నకొడుకు స్వార్థంతో తనదారి తాను చూసుకొంటే, వృద్ధాప్యంలో ఒంటరితనంతో కుమిలిపోతున్న ఆమెను, ఒకనాడు స్వార్థంతో, అసూయతో అతని భవిష్యత్తుని పాడుచేయాలని చూసినప్పటికీ అవేమీ మనసులో పెట్టుకోక, పెంపుడుకొడుకు చేరదీసి ఆదరించడం. ఆమె కలలో కూడా ఊహించని శుభపరిణామం. ఈ 'మమతల శిఖరం' కథకు మూడవస్థానం లభిస్తుంది.

ఉపాధ్యాయ వృత్తినుండి విరమిస్తున్న ఓ అధ్యాపకుని అంతరంగ మథనాన్ని అత్యంత మనోజ్ఞంగా. హృదయానికి హత్తుకునేలా చిత్రించిన 'వీడ్కోలు'కు నాలుగవస్థానం.

ఎప్పుడో అనసూయ చేసిన చిన్నసాయం, ఆపత్కాలంలో ఆమెను రక్షించి అప్పుల వలయం నుండి బయట పడెయ్యటం యాదృచ్ఛికంగా జరిగిన మేలు. చక్కని కొసమెరుపుతో ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన ఈ 'క్షీరధార'కు అయిదవస్థానం.

ఇక చివరిస్థానం 'అయమ్మ' కథకు లభిస్తుంది. గొడ్రాలిగా లోకం విసిరే ఈటెల్లాంటి సూటిపోటి మాటల్ని ఎదుర్కొన్న రాజమ్మ అటువంటి విపత్కర పరిస్థితి తన కోడలికి రాకూడదని భావించి, కోడలి బిడ్డ మరణిస్తే ఆ స్థానంలో మరో అనాథ శిశువును చేర్చి, ఆ బిడ్డమీది మమకారంతో అయాగా కూడా మారడానికి వెనుదీయని రాజమ్మ త్యాగ నిరతి మహిళాలో కానికే ఆదర్శప్రాయం

– ఆర్. స్వర్ణలత

అయినా అరవింద్‌కి ఏడుపు రావడం లేదు

కసి. కసి రగులుతోంది.

ప్రతీకార వాంఛ అతని నరనరాల్లోనూ బుసలు కొడుతోంది. కళ్ళని రక్తవర్ణంగా మార్చింది.

మెల్లగా లేవడానికి ప్రయత్నించాడు.

మొండి చెయ్యి కాలూ స్వాధీనంలో వుండనంటున్నాయి బాధతో ప్రాణం పోయేలా వుంది.

అయినా అలాగే అతి ప్రయాసగా లేచాడు.

ఓ సారి పరిసరాలు పరికించాడు. ఓ ఆధారం కోసం! అతని ఆశ ఫలించింది. దూరంగా ఓ కొమ్మ కనిపించింది. అతి ప్రయాసగా దాని దగ్గరికెళ్ళి కింద పడున్న ఎండు కొమ్మని ఓ చేతి కర్రలా తయారు చేసుకున్నాడు.

ఎదురుగా కనిపించే సూర్య భగవానుడికి, కనిపించని ఆ దైవాలకీ మొక్కుకున్నాడు.

"భగవాన్! నాకీ జీవితం మీద ఆశ లేదు! బతుకు మీద తీపి లేదు. నాకు ఒకే ఒక కోరిక వుంది! ఆ కోరిక తీరాక నాకుగా నేనే ఆత్మార్పణ చేసుకుంటాను!

నా కాంతిని పొట్టన పెట్టుకున్న దుర్మార్గుణ్ణి నా చేతులతో నేనే చంపాలి! ఆ శక్తిని నాకివ్వు!...." అని ఒంటి చేత్తోనే నమస్కరించాడు.

అలా రాత్రులు, పగలు నిశాచరుడిలా తిరిగాడు. సింగ్ జాడ కోసం అడవిలో అణువణువూ వెతక సాగాడు.

దొరికింది తిన్నాడు. దొరకన్నాడు నీళ్ళు తాగాడు ఒంటికాలితోనే చెట్టు ఎక్కడం అభ్యాసం చేసుకుని క్రూర మృగాల బారినించి తప్పించుకున్నాడు. అతని దృఢ విశ్వాసమే అతని కంత శక్తినిచ్చింది.

అయితే సింగ్ మాత్రం కనిపించ లేదు.

రానురానూ అతని లోని ఆత్మ విశ్వాసం సన్నగిల్లుతోంది అలాగే జీవచ్ఛవంలా తిరుగుతున్నాడు

ఆరోజు మధ్యాన్నం ఆకాశం నిండా నల్లని మబ్బులు ఆవరించాయి. అరణ్యమంతా ప్రశాంతంగా వుంది చిరు జంతువులు కేరింతలు కొడుతున్నాయి. నెమళ్ళు నృత్యం చేస్తున్నాయి.

ఓ చెట్టు కింద పడుకుని చెట్టు ఆకుల్లోంచి ఆకాశాన్ని చూస్తున్నాడు అరవింద్. అతనికి గతమంతా గుర్తొచ్చింది. కాంతి చిలిపి అల్లర్లు, ఆమె దారుణమైన చావు గుర్తొచ్చింది, ఇంకి పోయాయనుకున్న కన్నీళ్ళు వరదలా పొంగాయి.

భారంగా కళ్ళు మూసుకున్నాడు.

వెచ్చని కన్నీరు చెంపల మీదుగా జారి మెడని, వీపుని తడిపేస్తోంది. అతన్ని ఓదార్చే వాళ్ళెవరూ లేరు.

అలా చాలాసేపు హృదయ విదారకంగా ఏడుస్తూనే వున్నాడు. అలా కొంత సేపు ఏడ్చాక కాస్త హృదయభారం తగ్గినట్టనిపించిందతనికి.

ఆకాశం వర్షానికి సూచనగా ఓసారి గర్జించింది. ఉలిక్కిపడి ఆకాశం లోకి చూశాడు అరవింద్. నల్లని మబ్బులు ఆకాశాన్నిండా కమ్మి చీకటిగా అయిపోయింది అడవంతా.

మెల్లగా లేచి చెట్టు కానుకుని కూర్చున్నాడతను.

అతనికి ఎండా వానా అన్న భయం లేదు.

ఇంక లేచి సింగ్ వేటకి బయల్దేరాలనుకున్నాడు. అయితే ఆరోజెందుకో చెప్పలేని నీరసం ఆవరించిందతన్ని. అలాగే చెట్టుకి జారగిల బడి కళ్ళు మూసుకున్నాడు

అయిదు నిమిషాలు గడిచేసరికి అతని కనురెప్పలు అంటుకున్నాయి భారంగా.

చిత్రంగా అరగంట గాఢనిద్ర పోయాడు.

మంచి నిద్రలో వుండగా ఏదో అలికిడి అయి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

అంతే!

అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. ఆనందంతో తళుక్కు మన్నాయి. ఉత్సాహం ఉవ్వెత్తున లేచింది

కారణం తన మీదికి వంగి, తనకేసే పరిశీలనగా చూస్తున్నాడు సింగ్.

అరవింద్‌లోని ప్రతీకార వాంఛ రెక్కలు విప్పుకుంది. పగ అతనికి మించిన శక్తినిచ్చింది.

గభాల్న లేచి సింగ్ మెడని రెండు చేతులతో టే గట్టిగా పట్టుకున్నాడు. అనుకోని ఈ సంఘటనకి అవాక్కయి పోయిన సింగ్ అతన్నించి తప్పించుకోవాలని చూశాడు అయినా సాధ్యం కాలేదు. (ఇంకా ఉంది)

# విచిత్రస్థితి

పాలడుగు వెంకటేశ్వరావు

వాళ్ళు ఇద్దరూ చాలా సేపట్నుంచీ గొడవ పడు్తున్నారు గొడవ పడటమంటే మరేంకాదు, ఒకడు గొడవపెడుతున్నాడు రెండవవాడు ఆ గొడవనంతా భరిస్తున్నాడు, మూగవాడిలాగా, ఎంతో సహనంతో మొదటివాడు యువకుడు బలంగా లావుగా ఎత్తుగా వున్నాడు చింపిరి జుట్టు ఎర్రగా అగ్నిగోళాల్లాగా వున్న కన్నులు గట్టిగా అరుస్తున్నాడు ఆవేశంతో 'అర్యూ' చేస్తున్నాడు బూతులు తిట్టుతున్నాడు ఎగిరెగిరి పడు్తున్నాడు. వూర్కున్నకొద్దీ పేట్రేగి పోతూ?? రెండవ అతను ముసలివాడు వార్ధక్యం మీదికి వచ్చింది చంపలు లోతుకు పోయినయ్ కళ్ళు గుంటలు పడినయ్ కండలు కరిగిపోయి చర్మం ఎముకల మీద– జారి వ్రేలాడు్తున్నది కాయకష్టం చేసిన శరీరం గనుక ఠంకా అలా నడుస్తూ వుంది

ఎక్కడ ఏ పనిమీద వున్నా– చుట్టూ వున్న పరిసరాల్నీ, జరుగుతూవున్న సంఘటనల్నీ– అవసరం లేకపోయినా– గమనించటం నాలో మొదట్నుంచీ వున్న బలహీనత కనుకనే వాళ్ళు నా దృష్టిని ఆకర్షించారు

బెల్‌కొట్టి నరసింగరావుని పిలిచాను నర్సింగరావు మా హాస్పిటల్‌లో కాంపౌండరు

అతను రాగానే 'ఏమిటా న్యూసెన్స్?' అని అడిగాను– అంత దూరాన– హాస్పటల్ కాంపవుండులో గొడవపడు్తూవున్న ఆ ఇద్దర్నీ చూపించి. చిరాకుగా

'ఏముంది సార్' వడ్ల గింజలో బియ్యపు గింజ' అన్నాడు అతను సమాధానంగా

'అంటే'

'వాళ్ళిద్దరూ తండ్రీ కొడుకులు' గత జన్మలో ఆగర్భ శత్రువులై వుంటారు'

'అయితే– ఇక్కడికి వచ్చి గొడవ పడట మెందుకూ??'

'అదంతే వాళ్ళకి వక వేళాపాళా లేదు ఒక చోటూ పాటూ కూడా వుండదు నరసయ్య చేసుకున్న కర్మ– అనుభవిస్తున్నాడు నర్సయ్య వైద్యాన్కి వచ్చాడు '

'నరసయ్యెవరు? నీకు తెలుసా?'

'అవునండి' ఆ ముసలతని పేరు నరసయ్య అతన్ది మా వూరే' మా వూరు ఇక్కడికి నాలుగు మైళ్ళుంటుంది అందుకే మా వూరి జనాలు ఏ అవసరం వచ్చినా ఇక్కడికి వచ్చి పడతారు తెల్లవారగానే నరసయ్య మంచివాడు వకరి జోలి పట్టించుకోడు తనేమో తన పనిఏమో నరసయ్యకి చాలా కాలం పిల్లలులేరు పిల్లల కోసం భార్యని వెంటదీసుకుని ఎన్నో పుణ్యక్షేత్రాలు తిరిగాడు ఎందరో దేవుళ్ళకి భక్తితో మ్రొక్కాడు ఎన్నో పూజలూ వ్రతాలూ చేశాడు పిల్లలకోసం ఎంతో ఆరాటం తపనా పడ్డాడు చివరికి అతని కోరిక నెరవేరింది కొడుకు పుట్టాడు అతనికి చిన్న పేర్రాజని తండ్రి పేరు పెట్టుకుని అల్లారు ముద్దుగా పెంచుకున్నాడు ఆ యువకుడే ఆ పేర్రాజు'' ఈ పిదప కాలంలో తండ్రి పట్ల ఒక తనయుడు కృతఘ్నుడై ఏ రకంగా ప్రవర్తించవలసి వుంటుందో నేటి యువతరానికి ప్రాక్టికల్‌గా చేసి చూపించి వివరించటాన్కి శతవిధాలుగా ప్రయత్నిస్తున్నాడు ఆ యువ కిశోరం ఇదీ వాళ్ళ చరిత్ర అని నరసింగరావు విచారంగ తన గదిలోకి వెళ్ళి పోయాడు

అంతలో ఆ ఇద్దరి మధ్య గలాటా పెద్దదయింది పేర్రాజు గట్టిగా అరుస్తున్నాడు. సడెన్‌గా పేర్రాజు నరసయ్యని చొక్కా పట్టుకున్నాడు ఆ పట్టు మెడ చుట్టూ బిగిసి నరసయ్య గిజగిజలాడు్తున్నాడు వాళ్ళ చుట్టూ నలుగురూ గుమిగూడారు అందరూ నిలబడ్డారేగాని, వాళ్ళని విడిపించటాన్కి ఎవరూ ప్రయత్నం చేయటంలేదు 'ఏమిటిది??' అని అడిగేనాధుడే లేడు!

అందులో వకడు బలంవంతుడు

రెండవవాడు బలహీనుడు మొదటి వాడికి రెండవవాడు లోకువ ప్రతిఘటననే లేనందు వలన బలం గలవాడు తన ప్రతాపం చూపిస్తున్నాడు బలహీనుడు గిల గిలలాడూ్త వాడ్ని వదిలించు కొనటానికి ప్రయత్నిస్తున్నాడు వాళ్ళ చుట్టూ జనం మూగిన జనం వినోదం చూస్తున్నారే గాని వాళ్ళని విడిపించటానికి ఏ ప్రయత్నం చేయటంలేదు సామాజికుల 'సివిక్ సెన్స్' ఏ లెవల్లో వుందో చెప్పకనే చెప్పు్తున్నారు ఆ ప్రేక్షకులు మనకెందుకులే అన్న ధోరణి ఏ సంఘానికి సహించరాని రుగ్మత

నా గది కిటికీలోంచి– అంత దూరాన్న జరుగుతున్నదంతా నాకు కనపడుతూ వినపడూ్తనే వున్నది. చూస్తూ చూస్తూ వూరికే వుండలేక పోయాను నా రూంలో నుండి బయటకు వచ్చి, వాళ్ళని విడదీసి, పేర్రాజుని హాస్పిటల్ కాంపవుండులో నుండి బయటకు పంపించాలని– నిర్ణయించుకున్నాను కుర్చీలోంచి లేచి కదలబోయాను

అంతలో అటుగా వక పోలీసు కాన్‌స్టేబుల్ వచ్చాడు లాఠీ వూపుకుంటూ

అతన్ని చూసి పేర్రాజు తగ్గాడు నరసయ్యని వదిలిపెట్టి హాస్పిటల్ ఏరియా నుండి బయటికి వెళ్ళిపోయాడు మూగిన జనం చెదిరిపోయి ఎవరీ గొడవల్లో వాళ్ళు పడ్డారు నేనూ నా కర్తవ్య నిర్వహణలో నిమగ్నుడయ్యాను పది రోజుల తర్వాత వక రోజు– బజార్లో వస్తున్నాను స్కూటరు మీద నరసింగరావు ఎదురయి విష్ చేసి ఆపి ఏదో చెప్పు్తున్నాడు స్ట్రీట్ లయిట్లు డిమ్‌గా వున్నాయి రాత్రి ఎదయింది వున్నట్టుండి నా వెనకాల నుండి అరుపులు వినపడ్డాయి ఏదో కలకలం

'దొంగ దొంగ' పట్టుకోండి' ఎవ అరుస్తున్నారు

రోజుతూ, రొప్పుతూ సన్నగా రివటలాగా వున్న వక మనిషి పరుగెత్తుతున్నాడు అతని వెనకాలే అరుస్తూ ఆయాసపడూ్త వురుంగా వున్న వక యువకుడు పడ్డాడు నల్గురూ పరుగెత్తుతున్న దొంగని పట్టుకున్నారు అతనికి దేహశుద్ధి జరిగింది ఆ దొంగని గట్టిగా పట్టుకుని– అతని చొక్కా జేబుల్ని వెతికి అందులోంచి రెండు పది రూపాయల నోట్లు తీసి నలుగురికీ చూపించాడు ఆ యువకుడు

'చూడండి సినిమాకని వచ్చాను బాగా రష్‌గా వుంది పిక్‌పాకెట్ చేసి పరుగు మొదలెట్టాడు!' అని వివరించి– వెనుదిరిగి తన దార్ని తాను పోయాడు జనంలో కల్సిపోయాడు క్షణాల్లోనే. వాళ్ళ ఇద్దర్నీ ఎక్కడో చూసినట్టున్పించింది ఆ గుంపు దగ్గరికి వెళ్ళిన నరసింగరావు, నేను ఇంకా అక్కడ్నే నిలబడి వుండటం గమనించి– తిరిగి, నా దగ్గకి వచ్చాడు

'డాక్టర్! వాళ్ళని గుర్తు పట్టారా?' అని అడిగాడు నన్ను

'లేదే ఎవరూ వాళ్ళు? ఎక్కడో చూసినట్టుందయ్యా' అన్నాను

'వాళ్ళేనండీ' రోజులు అట్లా వున్నయ్' దుష్టుడు సజ్జనుడ్ని 'దొంగా' అని ఎలుగెత్తి పిలుస్తున్నాడు దొంగ దొరలాగా నటించి గౌరవ మర్యాదల్నీ అధికారాన్నీ దోచుకుంటున్నాడు. దుర్మార్గుడు పెద్దమనిషిలాగా వేషాలు వేసి అతి సులువుగా

ఘోరమైన దుష్కృత్యాలని కొనసాగిస్తున్నాడు ప్రపంచం ఇట్లా మారిపోయింది ఇంక మనం బాగుపడేది ఎట్లాగండి?!' అన్నాడు నిర్వేదంగా

'నువ్వు ఏం చెప్తున్నావో నా కర్థం కావటంలేదు నరసింగరావ్!' అన్నాను

'నర్సయ్య ఇప్పుడు మన కళ్ళ ముందే దుర్మార్గానికి బలయ్యాడు సార్ నేను నరసయ్యని అడిగి అంతా తెల్సుకున్నాను కళ్ళ వెంట నీరు పెట్టుకున్నాడు అతని భార్యకి జబ్బుగా వుందట భార్యకి మందుల కోసమని ఇరవై రూపాయలు అప్పుజేసి మందులు కొనుక్కొని వెళ్లాలని వచ్చాడు నర్సయ్య కొడుకు ఈ వూరి బజార్లో కనపడి– డబ్బు కావాలని పీడించటం ప్రారంభించాడు. పేర్రాజు, చివర్కి జేబులో చెయ్యి పెట్టి బలవంతాన లాక్కోవటాన్కి ప్రయత్నించాడు అందుకని భయపడి పారిపోసాగా డు నర్సయ్య నరసయ్య వెనకే పడి 'దొంగ దొంగ' అని అరచి అల్లరిచేసి, నలుగుర్తోనూ అతనికి దేహశుద్ధి చేసి, అతని జేబుల్లోంచి డబ్బు వూడలాక్కొని, అంతలో దూరాన పోలీసు కనపడగా, ఏవో కల్లబొల్లి కబుర్లు చెప్తూ చల్లగా జారుకున్నాడు పేర్రాజు! విన్నారా సార్! ఇదీ ఇప్పుడు మన కళ్ళెదుట జరిగిన సంగతి' అని నిట్టూర్చాడు నరసింగరావు

'మరి ఆ నర్సయ్య ఏమంటాడు?' అన్నాను పళ్ళు కొరుకుతూ

'లబో డిబోమంటాడు ముసలామెకి మందులెలాగా? అని లబలబలాడాడు'.

"అంతేనా? పోలీసు రిపోర్టు ఇవ్వవచ్చు గదా! వాడికి శాస్తి చేయించవచ్చుగా!'

'వద్దు వద్దు– అని అడ్డం పడ్తాడు పోలీసుల్దాకా ఎందుకులే అంటాడు'

'పోలీసువాళ్ళు పేర్రాజుని బొక్కలో తోసి దుమ్ములు నలగ్గొడ్తారు అది నర్సయ్య భరించలేడు నర్సయ్య భార్య సహించలేదు– చచ్చిపోతానని శోకాలు పెడ్తుంది కడుపు తీపి! కని పెంచిన ప్రేమ బంధం! త్రోసిరాజనలేని అనుబంధం '

నిజమే కాదని ఎవరూ అనరయ్యా కాని ఆ దుర్మార్గుడు పేర్రాజుకి ఏదీ ఆ గ్రహింపు? దీనికి అంతు ఎక్కడ? పేర్రాజుకి పెళ్ళి కాలేదా?' బాధ్యత లేదా?'

'అన్నీ అయినయ్ ఇద్దరు పిల్లలు' కూడా ఇల్లాలు మంచిది వాళ్ళనీ రాచి రంపాన పెడ్తాడు డబ్బు కావాలి ఎంత సేపూ జేబులో రూపాయుంటే వూళ్ళో కాల్నిలవదు అది ఖర్చు పెట్టేదాకా మనసు నిలకడగా వుండదు సంసారాన్నీ తల్లిదండ్రుల బరువు బాధ్యతల్నీ నెత్తికెత్తుకుని కుటుంబం గౌరవ ప్రతిష్టల్ని కాపావలసిన తరుణ వయస్సు పేర్రాజుది. కాని పేర్రాజు 'అట్లా' తయారయ్యాడు. అది నర్సయ్యకి దిగులు...'

ఇంతకీ నర్సయ్య ఏం చేస్తానంటాడు? ఇదంతా అతన్కి ఆనందంగానే వుందా?'

'ప్చ్! దుఃఖిస్తాడు! వాడి పాపాన వాడ్నే పోనీ– అంటాడు ఆ చీటీ తీసుకుని మందుల షాపులో మందులు కొనిపెట్టి ఇచ్చి వచ్చాను. నర్సయ్య భార్య మంచం దిగటం లేదట! పాపం'

కొన్ని కొన్ని విషయాలు గమనిస్తూ వుంటే చాలా దారుణంగా అన్పిస్తాయి, నర్సింగరావ్'– నిర్వేదంగా అన్నాను

'అవున్సార్' నర్సింగరావు గొంతు బరువుగా మూల్గింది

ఈ జీవుడి తాపత్రయం అటువంటిది బిడ్డలు బిడ్డలు అంటాడు నేనూ నాదీ– అనుకుని కన్న సంతానం కోసం నానా తాపత్రయాలూ పడతాడు ఆ స్వార్థంలో ఎన్నో పాట్లు పడతాడు ఆ బిడ్డ దారి తప్పి దుర్మార్గుడుగా తయారయితే దిక్కు తోచక అల్లాడుతాడు కర్మ పరిపాకం పట్టి పల్లార్చుగా దిక్కుతోచక గిజ గిజలాడుతాడు– ఆ విదంగా



# న్యాయపీఠం

బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

బీహారు రాష్ట్రంలో గయ దగ్గర అర్వాల్ గ్రామం ఉంది 1986 ఏప్రిల్ 19వ తేదీన అర్వాల్‌లో 700 వరకు పేద రైతులు సమావేశం జరుపుకుంటున్నారు అక్కడికి పోలీసు బలగంతో పోలీసు సూపరింటిండెంట్ వచ్చి వారిని చుట్టుముట్టి ఫైరింగ్ చేశారు పోలీస్ ఫైరింగ్‌లో చాలామందికి గాయాలు తగిలాయి 21 మంది మరణించారు ఒక కాలువ

## పోలీసు కాల్పుల్లో మరణించిన వారికి నష్ట పరిహారం

ఒడ్డున ఉన్న భూమి కోసం ధనవంతులైన భూస్వాములకు, పేద రైతులకు మధ్య ఈ తగవు ప్రారంభమైనది పోలీసు కాల్పుల్లో మరణించిన వారికి, గాయాలు తగిలిన వారికి, న్యాయమైన నష్ట పరిహారం మంజూరు చేయవలెనని ప్రజా హక్కుల సంఘం సుప్రీమ్‌కోర్టులో రిట్ పిటిషన్ వేశారు ఈ లోపల పాట్నా హైకోర్టులో కూడా రిట్ పిటిషన్ వేశారు ప్రభుత్వం రెవెన్యూ బోర్డు మెంబర్ చేత దర్యాప్తు జరిపించింది. ఈ సంఘటనపై రాష్ట్రంలో చాలా ప్రచారం జరిగింది ఈ వ్యవహారమంతా హైకోర్టులో విచారణ జరగడం న్యాయమని సుప్రీమ్ కోర్టు నిర్ణయించారు కాని నష్ట పరిహారం గురించి సుప్రీమ్ కోర్టువారు విచారణ చేశారు ప్రభుత్వం మరణించిన వారికి పదివేల రూపాయల చొప్పున 21 మందికి నష్ట పరిహారం మంజూరు చేశారు ఈ నష్ట పరిహారం న్యాయంగా లేదని సుప్రీమ్‌కోర్టు వారు అభిప్రాయపడ్డారు చనిపోయిన వారి కుటుంబాల వారికి ఇరవై వేల రూపాయల చొప్పున 21 మందికి నష్టపరిహారం చెల్లించాలని సుప్రీమ్ కోర్టువారు ఆదేశం జారీ చేశారు గాయాలు తగిలిన వారికి కూడా ఒక్కొక్కరికి ఐదు వేల రూపాయలు నష్టపరిహారం చెల్లించాలని సుప్రీమ్ కోర్టువారు 1987లో ఆదేశాలు జారీ చేశారు □

## విచిత్ర నీతి

కన్న తల్లిదండ్రులే కనిపించే దైవాలు అంటుంది సంస్కృతి సంస్కారం కొరవడిన మనిషికి అదేమీ పట్టదు కేవలం స్వార్థంలో కళ్ళు పొరలు గ్రమ్మి, మనిషి మృగంలాగా ప్రవర్తిస్తే- ఆ కారణంగా తలెత్తిన సమస్యలకి పరిష్కారం లభించదు కాదనటానికి వీలులేదు అవుననుకుంటానికి అవకాశం వుండదు అదొక సుడిగుండం

సైన్సు సమాధానాలు చెప్పలేదు- కొన్ని ప్రశ్నలకి విజ్ఞానం విశ్లేషణ చెయ్యలేదు- అన్ని విషయాలనీ

నరసయ్య పరిస్థితి నాక్కూడా సొల్యూషన్ దొరకని పజిల్‌లాగా అన్పించింది

పేర్రాజుని పిలిపించి కసిదీరా ఆ చెంపా, ఈ చెంపా వాయగొడదామనిపిస్తుంది 'కార్పణ్యంతో కళ్ళు మూసుకు పోయిన మూర్ఖ మానవుడా! కళ్ళు తెరువు జరాబారంతో ఇంత మనశ్శాంతి కోసం అల్లాడుతున్న నీ ముసలి తల్లిదండ్రుల మీద కనీసం కొంచెం కనికరం చూపించి, వక మనిషిలాగా ప్రవర్తించు. జన్మనిచ్చిన పెంచి పెద్ద చేసి నిన్ను ఇంత వాడ్ని చేసినందుకు ప్రతిఫలంగా కృతజ్ఞతని చూపించకపోతే పోనీ, కాని కృతఘ్నుడవై పగబట్టిన పాములాగా కాటు వెయ్యకు అటువంటి పని ఎంతో నీచమయినది. ఘోరమయినది పరమ చండాలమైనది. నిన్ను పాప కూపంలోకి పడ లాక్కునిపోయే ఇటువంటి పనులు నీకు తగవు' అని చెప్పాలనిపిస్తుంది. ఆ దుష్టుడికి

కాని-

నేనెవరు? పేర్రాజు ఎవరు? నరసయ్య ఎవరు?

నాకూ వాళ్ళకీ ఏమిటి సంబంధం? వాళ్ళ స్వంత విషయం ఇది నా ప్రమేయానికి ఆస్కారం ఏమిటి? వాళ్ళ స్వంత విషయాలలో జోక్యం చేసుకొంటానికి నాకేమి హక్కు వుంది?

ఈ ప్రశ్నలు నా మనస్సును నొక్కివేశాయి నా ప్రయత్నాన్ని అణగద్రొక్కాయి ఆ తర్వాత వకనాడు అర్ధరాత్రి వేళ నన్ను నిద్రలేపి కూర్చోపెట్టాడు నరసింగరావు

'డాక్టర్ అర్జంటుగా హాస్పిటల్‌కి రావాలి' అని నన్ను పిల్చుకుని వెళ్ళాడు 'కాజువాలిటీ'లో తల పగిలి నెత్తురు ముద్దలాగ వున్న నర్సయ్యని చూసి వులిక్కిపడ్డాను వెంటనే ఆపరేషన్ చేసి ట్రీట్‌మెంట్ ఇవ్వబట్టి బ్రతికి బయటపడ్డాడు నర్సయ్య

చూశారా డాక్టర్! ఎంత ఘోరమో!' నరసంగరావు విచారంగా అన్నాడు

అవును నర్సయ్యకి ఇంత పెద్ద గాయం ఎల్లా అయింది?' అని అడిగాను నేను

'తండ్రి మీద పేర్రాజుకి కోపం వచ్చి, కట్టె తీసుకుని వచ్చి బుర్ర బద్దలుగొట్టాడట హాస్పిటల్‌కి తీసుకు రావటం కాస్తాలస్యమయి వుంటే, ముసలాయన బ్రతికేవాడు కాదు

'ఇది చాలా అన్యాయం, నర్సింగరావ్' అన్నాను విచారంగా

'అవును ఇక వాడ్ని క్షమించటానికి వీలులేదు సార్ పోలీసు కేసు పెట్టాం ఇప్పుడు వాడు తప్పకుండా జైలుపాలవక తప్పదు ఈ విషయంలో మా వూళ్ళో వాళ్ళు చాలా పట్టుదలగా వున్నారు' అన్నాడు నర్సింగరావు

ప్రతి నేరానికీ తగిన శిక్ష పడవలసిందే అందులో ఇటువంటి నేరానికి మరీ కఠిన శిక్షపడటం న్యాయం

వారం రోజుల తర్వాత నర్సయ్య దగ్గర స్టేట్‌మెంట్ తీసుకోవటానికి మా హాస్పిటల్‌కి వచ్చాడు ఇన్‌స్పెక్టర్

'నర్సయ్యగారూ! మీరు భయపడవలసిన అవసరం లేదు జరిగింది జరిగినట్టుగా స్టేట్మెంట్ ఇవ్వండి' అని రాసుకున్నాడు రెండు చేతులు ఎత్తి నమస్కారం పెట్టి- నరసయ్య ఇలా స్టేట్మెంట్ ఇచ్చాడు, ఇన్‌స్పెక్టర్‌కి

'వృద్ధాప్యం వలన నాకు చూపు సరిగ్గా లేదు ఆ రోజు రాత్రి సరిగ్గా కనపడక తూలి పడ్డాను నా తల వెళ్ళి వక ఇనుపపెట్టెకు తగిలి బలంగా గాయమయింది ఇది కేవలం నా పొరపాటు నా కర్మ నాకు తగిలిన ఈ గాయానికి ఎవ్వరూ కర్తలు కారు' పచ్చి అబద్ధం!- ఈ విషయ తెలిసిన ఎవరయినా చెప్తారు

ఆ స్టేట్మెంట్‌ని చించి అవతల పారేసి, తెల్ల మొహం వేసుకుని ఇన్స్‌పెక్టర్ వెళ్ళిపోయాడు ప్రత్యక్షంగా అంతా చూస్తూ వుండిన నర్సింగరావ్ కోపంతో పిచ్చెత్తినట్లు అయిపోయాడు

'నర్సయ్యా!' నీకు బుద్ధిలేదు ఇంత దారుణంగా అబద్ధం ఆడటాన్కి నీకు సిగ్గూ లేదు ఛీ ఛీ' అని అరిచాడు నరసింహారావు, నా ఎదుటే

నర్సయ్య చేతులెత్తి నర్సిగరావుకి నమస్కారం చేశాడు

'బాబూ! నాకు బుద్ధిలేదు మమకారం నన్ను సిగ్గు లేని వాడినిగానూ అబద్ధాలకోరుగాను చేసింది నేను చెప్పిందంతా అబద్ధమే నన్ను క్షమించండి' అని కళ్ళ వెంట నీరు పెట్టుకున్నాడు

సాధారణ తర్కానికీ, మామూలు జన జీవన రీతులకీ అందనటువంటి- ఒక అతి సహజ విచిత్ర జీవన నీతిని అవగాహన చేసుకొనటానికి నా మనస్సు ప్రయత్నిస్తూ వుంది. ఆ ప్రయత్నం ఇంకా సఫలీకృతం కాలేదు □

# కార్టూనిస్టులకు సూచనలు !

* కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
* ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
* వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
* వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
* సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
* ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నిగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
* పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
* రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
* మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.




(గత సంచిక తరువాయి)

ఒకనాడు రామేశ్వరము మంగమ్మ యింటికి పోయెను. ఆ గృహము సినిమా దాటిన తరువాత రెండు మూడు వీథులకు పైనున్నది అచ్చటికి గుండేరు చాల దగ్గఱ మంగమ్మ మునుపటి మంగమ్మ కాదు. ఏడాదిలో ఆమెలో ఉన్న వైదికపు చాదస్త మంతయు పోయి పరమ లౌకికము, గడేకారితనము, నిర్భయము కావలసిన గుణము లన్నియు పట్టువడెను. భర్త, స్త్రీకిని ప్రపంచమునకును మధ్య తెఱవంటి వాడు. తెఱ దీసి వేసినచో లోకజ్ఞత. దొడ్డి పెట్టిన వేల్పుగిడ్డి- సర్వము పిదుకును

రామే. నా కొక నాల్గు వందల రూపాయలు కావలయును

మంగః నా దగ్గఱ ఎచ్చట ఉన్నవి?

రామే· ఈ పది రోజులలో సినిమా మీద వచ్చిన పన్నెండు వందల రూపాయ లేమి చేసితివి?

మంగ అది నా డబ్బా, మీ డబ్బా? అది బ్యాంకులో వేసితిని.

రామే· బ్యాంకులో నుండి తీసి కొనుము

మంగ ఒకవేళ మీమీద ఈ కేసు వచ్చిన ఎడల మన డబ్బు ఖర్చు గాకుండ ఉండ గలందులకే గదా, మీ రంతయు నా పేర పెట్టినది ఇప్పుడు డబ్బు తీసి వాడినచో నా పేర ఎందులకు? మీ పేరనే ఉండి ఉండ వచ్చును

రామే ఆస్తియు, నేను కట్టించిన మేడయు, సినిమాయును పరాధీనము కాకుండ నీ పేర వ్రాసితిని ధనమున కేమి? ధన మవసర మైనచో వాడుకొన వలయు ననియే కదా! ఇప్పుడు నేను ప్లీడర్లు కీయవలయును తక్కిన ఖర్చు లున్నవి నాలుగు వందలైన గాని తేలదు

మంగ బ్యాంకు మూసి ఉందురు తిరిపు పదునొకండు గంటలకు కదా!

రామే ఇప్పుడు నీ దగ్గర ఏమియు లేదా?

మంగః అఱన్నర ఉన్నది-

రామేశ్వరము వెడలి పోయెను అతనికి మంగమ్మ మాటాడిన ప్రతి మాటయు ఏదో విపరీతముగా తోచెను. అదివఱ కెన్నడును తోచని అనుమాన మొకటి తోచెను. ఛీ! తన్ను నమ్మి తానే సర్వ జగత్తుగా నున్న మంగమ్మ అట్లు చేయునా? మఱునాడు పన్నెండు గంటలకు రామేశ్వరము మంగమ్మ యింటికి పోయెను ఇంటి తలుపు తాళము వేసి ఉన్నది మంగమ్మ బ్యాంకుకు పోయిన దనుకొనెను ఆమె ఎప్పుడును పోదే! సామాన్యముగ తానే ఎప్పుడును పోవును ఒకవేళ పోయినదేమో! తానును బ్యాంకు వద్దకు పోయెను అచట ఎవ్వరును లేరు అతడు మరల తిరిగి వచ్చి ప్రక్కనున్న వారి నడిగెను వారు ఆమె ఏదో చాల తొందర పనిమీద బెజవాడ పోయినది రెండు మూడు రోజులలో వచ్చెదనని మీతో చెప్పమన్న దని చెప్పిరి సినిమా ఆడుట లేదు ఫిలిము లిప్పటి వాని కప్పుడు డబ్బీయ వలయును అందుచే వచ్చిన ఫిలిములు రైలు స్టేషనులోనే మిగిలి ఉన్నవి వానిని దీసికొన లేదు. సినిమా ఆడినగదా డబ్బు వచ్చుట! సినిమా ఆడుటకు కావలసిన జను లందఱు జైలులోనే ఉండిరి. అది మూల పడెను పట్టాభిషేకము నాటి ఎలక్ట్రిసిటీ ప్లాంటు కనుల పడ్డప్పటి నుండియు రామేశ్వరమునకు సినిమా ఊహ పుట్టెను. అయిదా రేండ్లు పట్టి ఊహయే అయిపోయెను ఆ ఊహ ఊహించిన న్నాళ్ళు సినిమా జరుగలేదు. కొన్ని ఆశలు ఫలించినట్లే ఫలించి అంత నిర్మూతములై పోవును. ఇది మఱి కొందఱకు.

రామేశ్వరము కేసంతయు చలపతి మీదికే త్రిప్పవలయునని ప్రయత్నము చేయుచుండెను. బయటనున్న రామేశ్వరము తన విముక్తి కొఱకు ప్రయత్నించునని ఆ దౌర్భాగ్యు డూహించుచుండెను. పోలీసువాండ్రు దొరికిన ప్రతిపెట్టను తిక్కలు విరువ వలయునని చూచుచుండిరి న్యాయ వాదులు లా పాయింట్లు వెదుకుచుండిరి పాయింటునకు పది వందలు వారి లెక్క రామేశ్వరము ప్రెసిడెంటుగా తెగసంపాదించెను. ధనమంతయు ఏమికావలె? కేసుపట్టుకొన్నది. జనవరి 10వ తారీఖున వాయిదా ఫిబ్రవరి 10.

కిరీటి మఱల కాలేజీలో చదువుటకు వచ్చెను. మునుపటి కిరీటికి ఇప్పటి కిరీటికి ఏమియు సంబంధము లేదు. మునుపటివాడు నవ్వడు ఇప్పటివాడు నవ్వేమి- విరగబడి నవ్వును మునుపటివాడు పరాచికము లాడడు. ఇప్పటివాని కదేపని. అతడు విషాదమూర్తి; ఇతడానంద మూర్తి 'ఒంటరిగా వచ్చితివి. శశిరేఖను తీసికొని రాకపోతివా? ఈ మూడు నెలలిచ్చటనే ఉండెడిది ఇక్కడ అన్నగారున్నాడని, వానికొక యిల్లున్నదని, వదినగారు నీ భార్యను చూడలేదని నీకు జ్ఞాపక మున్నదా? నేనీ సంగతి బాపట్లలోనే చెప్పితినిగదా!" అని ధర్మారావనెను

కిరీటి అన్నా! నా భార్య యైనంతనే అధికారము నాదనుకొంటివి కాబోలు నేను రమ్మంటిని "వారెవరి యింటికో తీసికొని పోదునందువే" మని మా అత్త మామ లడుపుపెట్టిరి నేను నాతో కలసి కాపుర

జరిగిన కథ – 39 : రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు గవర్నరు గారు సుబ్బన్న పేటలో పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తాడు సుబ్బన్నపేటకి బస్తీ కళవస్తుంది జోస్యులు భార్య మంగమ్మను రామేశ్వరము లొంగ దీసుకుంటాడు జోస్యులు రామేశ్వరమును ఏమి చేయ లేక చచ్చి పోదామని అనుకుంటాడు దేవదాసి గిరిక ప్రతిరోజూ ఆలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది హరప్ప నాయడు తాను చేయవలసిన పనులను గురించి ఆలోచిస్తూ ఉంటాడు కిరీటికి· అతనిమామ పిల్లనివ్వనని అంటాడు జోస్యులను ఎవరో కొట్టి చంపుతారు ధర్మారావు కిరీటి దగ్గిరికి వెడతాడు రైల్లులోని ప్రయాణీకుల బాధలకు ధర్మారావు విచారిస్తాడు కిరీటి సత్యాగ్రహం వల్ల అతని మామ పిల్లనిస్తానని అంటాడు కిరీటికి శశిరేఖకు వివాహం అవుతుంది ధర్మారావు పెళ్ళి అయ్యేవరకు కిరీటిని అంటిపెట్టుకునే ఉంటాడు దొంగ నోట్ల కేసులో రామేశ్వరమును, సినిమా రౌడీ చలపతిని పోలీసులు నిర్బంధిస్తారు రామేశ్వరము తనకున్న ఆస్తినంతటిని మంగమ్మ పేర పెడతాడు మంగమ్మ ఒకనాడు డబ్బంతా తీసుకుని బెజవాడ వెళ్ళిపోతుంది

మున్నప్పుడైన తీసికొని పొగలుగుదునుగదా!" అంటిని. వారప్పు "దట్లే తీసికొని పొమ్ము కార్యమై నెలనాళ్ళు తిరుగని పిల్లను పొరుగూరికి పంపించుట న్యాయము కాదనిరి

ధర్మా: కార్యమై నెల నాళ్ళు తిరుగని పిల్లయేమి? ఇంత అల్లరి లేకుండ ఈ కార్య మారేండ్ల క్రిందనే చేసినచో ఈపాటి కిద్దరు ముగ్గురు పిల్లలు పుట్టిదువారు

కిరీటీ నీవన్నచో బాగున్నది నేననగలనా.

ధర్మా అనలేకేమి నీ కెట్టిన్న అత్తవారు. ప్రేమ వారిమీద ఉండక నామీదనా ఉండును?

కిరీటీ నీవు పరిహాసములాడ నారంభించితివా, వానికి చివర ఉండదు

ఇరువురును ధర్మారావు ఇంటికి పోయిరి అరుంధతి కిరీటిని చూచెను ఆమె అతనితో మాటాడదు లోనికి పోయెను ధర్మారా వింటిలోనికి పోయి "మఱది పెండ్లి కొడుకై వచ్చెను ఈ పూట అన్నములోని కేమి చేసెదవు అనెను అప్పటికి పొద్దు క్రుంకి శుక్లాష్టమి అగుట వలన సగము నిండిన చంద్రుడు గగన మధ్య భాగమున తోచుచుండెను

అరుం · అన్నములోని కేమియులేదు ఉన్న దొండకాయలు పిందె దగ్గర నుంచి నిన్న దులిపితిని గాకరపాదుకు నా కోపికలేక నీళ్ళు పోయుటలేదు లేడ్డి దొరలు తీగబచ్చలి తిందురా?

ధర్మా ఆ తినకేమి శ్రీకృష్ణరాయలవారు తిందురనియే చెప్పెను

అరుం. మీరీ బాదము చెట్టెక్కగలరా?

ధర్మా ఎక్కి

అరుం· ఎక్కి ఆ వాసముపెట్టి అదుగో అకాశమున ఉన్న శశిరేఖను గొట్టుడు అది తరిగి వేయించెను.

కిరీటి రాకచే మహానంద మగ్నుడై ఉన్న ధర్మారావున కానందము పట్టరానిదయ్యెను అతడు చావడిలోనికి పరుగెత్తుకొని పోయి "కిరీటీ! మీ వదినే యిట్లనుచున్నదోయి" అని చెప్పెను ముగ్ధుడై పెండ్లి కొడుకు ముసి ముసి నవ్వులు నవ్వెను ప్రతిదినము శశిరేఖ వద్ద నుండి జాబు రావలయును, కిరీటీ అన్నము తినవలయును రాకపోవుట అనునదిలేదు ఆ ఉత్తరములు చిత్రములుగా ఉండును అందు ధర్మారావు చూడరానిదేదియు ఉండదు కిరీటి చదువుకొని ధర్మారావు చేతికిచ్చును.

బాపట్ల, మాఘ శు 2

ముద్దు బావా! నాకీనాడు చందమామయు కనబడుటలేదు మా బావయు కనబడుటలేదు నీవు వెళ్ళి పదిరోజులు కాలేదు. ఎప్పుడు వత్తువు? శశిబావతో కలసి ఉండుటకు తపస్సు చేసినన్నాళ్ళు పట్టలేదు ఏడాది తపస్సునకు ఫలమొకరోజులో యెనిమిదేండ్లు తపస్సు చేసితిని పదునారు రోజులు నీవు నా దగ్గర నుంటివి. నీవెంత ప్రియమైన వస్తువో!

ఇట్లు, నీ దాసి– శశి.

బాపట్ల మాఘ శు 12

కిరీటీ నిన్న ఉపవాసము నేడు ప్రొద్దుననే భోజనము పారణ చేసిన దినముననే కదా మన ప్రథమ సమాగమము! ఈ రాత్రి తెల్లవారులును నేను కిరీటీ జపము చేసెదను మీ కేమి మహారాజులు! అన్న ఉన్నాడుమీకు కాలము చక్కగా గడచును. కళాశాలలో తోడిమిత్రులు కలరు నేనీ వెన్నెలలో, నీవా చీకటిలో..

ఇట్లు, నీ మేనమామ కూతురు

బాపట్ల మాఘ 15

నిన్నేమని సంబోధించవలయునో తెలియదు భార్య పేరుతో పిలువరాదు నేను మీకు భార్యనైనంతనే మిమ్ము "బావా"! అని పిలువరాదు "ప్రాణప్రియా" మొదలయినవి నీతి జాతి లేని నవలలలోని నాయకుడు వ్రాయునవి ఏమని పిలువను? ఇదివరకు కిరీటీ అని బావా అని పిలిచితిని మఱల అట్లే సంబోధింతునేమో! మొన్న మీ ఉత్తరములో నేనేదో వ్రాసిన విషయమునకు, ధర్మారావు నవ్వినాడని వ్రాసితివి. నా ఉత్తరము లాయనకు చూపించుచున్నావా? మంచిభర్తవు నేనేమో గోప్యముగా బ్రతికి బ్రతికి నా ప్రేమ అంతయు బాలా త్రిపుర సుందరికి తప్ప మఱి ఎవ్వరికిని తెలియకుండ రక్షించుకొంటిని. నీవేమో యీ రహస్యమును నలుగురి నోళ్ళ కెక్కించుము నాకు కోపము వచ్చుచున్నది ఈ పూర్ణిమ



చంద్రుడు నీ అంత అందగాడుకాదు నా కితనిని చూచిన కొలది ఒడలు మండిపోవుచున్నది వీనికి సిగ్గునట్లు నీ వెప్పుడు వత్తువు?

ఇట్లు, వెన్నెలదారులలో నీకైచూచచున్న నీ శశి

నెల్లూరు మాఘ బ 12

నా ప్రాణమా! ఈ సంబోధన లుత్తరము వ్రాయవలసి వచ్చిన నాకు కష్టముగా నున్నవి అసహ్యముగా ఉన్నవి ప్రతి ఉత్తరము మొదట ఇట్లే సంబోధించవలయునా? యింక ఉత్తరము

లిట్టు వ్రాయను మీ అక్కగారు, వదినె– నాకొక క్రొత్తనమూనా చెప్పినది. "మహారాజ రాజశ్రీ ప్రాణనాధులకు మీ పాదదాసి శశి అనేక నమస్కారములు" పూర్వ ముత్తరము లిట్లు వ్రాసెడివారట ఈ నమూనా మన దేశములో నుండి ఏల పోయినది అట్టి నమూనా ఉత్తరమునకు కిరీటమువలె ఉండును ప్రియమైన ఫలానా" అని మొదలు పెట్టినచో ఉత్తరము బోడిగా నుండదా? నేను నీ అనుజ్ఞ లేకుండ నీ ఊరు వచ్చితిని. నీవు నన్ను క్షమించవా నీవు వెళ్ళి నాలుగైదు శని అదివారములు గడచినది ఇది మరునాడు వత్తుననుట కాబోలు! ఎన్నన్న దోషమేమున్నది? నీ కొఱకు నేనింత కష్టబడుట నాదే తప్పు నేను మాత్రము పడలేదా అందువు కాబోలు! పురుషులకు స్త్రీల కిదే భేదము పురుషులకు వాంఛిత వస్తులాభమైన తరువా త అది మనదేకదా అన్న ఊహతో నే బ్రతుకుదురు తన్నిత్యానుభమమందు వారికి నిరంతరాభిలాష ఉండదు స్త్రీలట్లుకాదు వస్తులాభము కలుగువరకు పురుషులంత ప్రయత్నించక పోవచ్చును వారికి లాలసమెందు లభించిన అర్థము ఎడబాసి ఉండలేరు నా మనస్సెప్పుడును తక్కిన స్త్రీలవలె గాక నీకు దాచకుండ చూఱ యిచ్చితిని చేతిలో చిక్కిన నన్ను నీ యిష్టము, నీటనో పాలనో ముంచుము రా; ఱేపు శనివారమునాడురా! నీ కొఱకు బాపట్లలో నుందును రాకపోతివా, మా నాయనగారికి మన పెండ్లినాడు నీ వుత్తరము వ్రాసియైనట్లే నేనగుదును

ఇట్లు,

నీకై రోజులు లెక్కపెట్టుకొనుచున్న నీ శశి

శశిరేఖ వ్రాసిన ఉత్తరము లిట్లుండును ధర్మారావా ఉత్తరములు చూచి అమెకు కిరీటి ఎడగల ప్రేమకు, వారి జగన్మోహనమైన దాంపత్యమునకు, అమె బుద్ధి వైశారద్యమునకు మహానంద మనుభవించును ఒకనాడు ధర్మారావు కిరీటితో ఇట్లనెను 'తమ్ముడా! నీ ఉత్తరములు, నీ ప్రేమ, నీ భార్య, నీవు– నాకు ప్రతిలవమును మహానంద హేతులువుగా నున్నారు నాకీ అనందము నీ వామెకొఱకు బడిన కష్టము లెఱిగియుండుటచేత ద్విగుణీకృతమైనవి గావలయును నాకు నీ కథ అంత అనందము కలిగించవచ్చును ఇతరులకు నా అనందము చూచినచో ఒక విధమైన ఉన్మాదముగా తోచవచ్చును

రామేశ్వరము కేసు మఱల వాయిదా నాలుగైదు రోజాలున్నదనగా మంగమ్మ ప్లీడరు వద్దకు పోయెను రామేశ్వరమునకు శిక్ష పడునా, పడదా అని విచారించెను శిక్ష పడకుండుటకు బ్రహ్మదేవుడైనను భంగము చేయలేడు సంగతి అంతయు చక్కగా ఋజువగును చలపతి కూడ రామేశ్వర మంతవాడైనచో కేసు చలపతి మీద స్థిరపడెడిది అప్పుడు తప్పుకొనుటకు వీలుగ ఉండెడిది. ఇప్పుడు తప్పుకొనుటకు దుర్ఘట"మని న్యాయవాది చెప్పెను ఆ నాడు మధ్యాహ్నము కో– ఆపరేటివ్ బ్యాంకుకు పోయి మంగమ్మ తనకు రావలసిన ధనమంతయు తీసికొనెను అమె అనాడే బెజవాడ పోయెను. ఆస్తి అంతయు అమె పేర అదివరకే రిజిష్టరు చేయబడి ఉండెను ధనము పుచ్చుకొని అమె యెచ్చటికి పోయెనో తెలియదు రామేశ్వరము తరువాత నాల్గు రోజాలకు సుబ్బన్నపేటకు వచ్చి అమె వర్తమానము లన్నియు తెలిసికొని లోపలనున్నవన్నియు అపహరించవలయునని అమె యింటి తాళము పగులగొట్టి లోన ప్రవేశించెను లోన ఏమియు లేదు కాగితములున్న అమె పెట్టియు నగలున్న పెట్టియు అమె చీరలున్న పెట్టియు మూడునులేవు. పాత్ర సామగ్రి, పరువులు, మంచము మొదలయిన సంసారోపయుక్తములయిన వస్తువులన్నియు చెదిరిపోకుండ సురక్షితముగా ఉన్నవి. అతడు సర్వము దొరకునని అనుకొనెను. ఏమియు దొరకలేదు.

వాయిదా వచ్చెను.. జనమందరును కోర్టునిండ గుంపులు కూడిఉండిరి.

సాక్ష్యములు విచారించుటకు నీ నెలనాళ్లను పట్టెను ఆ నాడు రామేశ్వరమును విచారించుట అయ్యెను రామేశ్వరము చెప్పిన ప్రతి సంగతియు అసందర్భముగా నుండెను ప్రతి మాటలో అతడు తనకట్టుత్రాళ్ళు తానే తెచ్చుకొన్నట్లుండెను. ఇట్టిదే కేసువచ్చినను 'సాక్ష్యము లన్నియు విచారించు నప్పటికి మూడు నాలుగు నెలలు పట్టును కాని రామేశ్వరము యొక్క దుర్జనత్వము చేత మండిపోవుచున్న మాజిస్ట్రేటు తక్కిన ముద్దాయిల సాక్ష్యములన్నియు ఈ నెలనాళ్లలోనే ముగించెను ప్రతి పదమున రామేశ్వరమునకు చక్కగా తెలిసి వచ్చెను, తాను పోయిన యౌద్ధత్య మంతయు తన కింతమంది శత్రువులను గడించి పెట్టినని అధికారమున్నప్పుడెవ్వనికిని లోకము తన్ను గూర్చి ఏమనుకొనుచున్నదో పట్టదు లోకముయొక్క న్యాయము "నవ్వుచు చేసితిమి, ఏడ్చుచు అనుభవించుచుంటిమి" అని అని పించును మాజిస్ట్రేటు తక్కిన వారందరిని తొలగించి రామేశ్వరమును, చలపతిని సెషన్సుకు 'కమిట్" చేసెను ఆ సాయంకాలమే యిద్దరును బందరు తీసికొని పోబడిరి

బందరులో రామేశ్వరము చెఱసాలలో ఉండగా, రంగారావుగారు జామీనుపై విడుదలకు చాల ప్రయత్నము చేసిరి జడ్జి ఒక దొర ఇట్టి దొంగనోట్ల కేసులు పది పదునొకండిదివరకే అతడు విచారించి ఉండెను. ఇది లోకమునందు చాల ఘోరముగా ఉన్నది ఇట్టి కేసు వచ్చినప్పుడల్లా గట్టిగా శిక్షింపవలెనని ఆయన ఊహ. అందులో ఏబదిమంది ముద్దాయీలలో నలువది ఎనమండు గురు విడుదల, ఇద్దరు సెషన్సుకు వచ్చుట, జమీందారుగారి అన్ని ప్రయత్నములు నిష్ఫలము లయ్యెను. సుసానీ అంగిలేయ స్త్రీ, అమెపోయి చెప్పినచో దొర వినును. సుసానీ తాను చెప్పననెను. అమెకు కాసావాంధ్ర ద్వారా జోస్యులకథ అంతయు తెలియును. అమె నిలువెల్ల మండిపోయినది. పైగా హిందువు లిల్లరు మహాకాముకులు, పశువుల్ను, హత్యాకారులని అమె అభిప్రాయపడెను సుసానీ చేత చెప్పించుటకు వీలు లేకయే పోయెను. అదియుగాక అమె మరల తన తల్లి దండ్రులను చూచుటకు పోవు ప్రయత్నముల మీద ఉండెను. మూడేండ్లకు వత్తునని చెప్పినది. అట్టి మూడేండ్లు రెండు గడచినవేమో అందుచేత అమె అసలే చెప్పుటకు వీలులేక పోయినది

జిల్లా కోర్టునకు పోయిన తరువాత రామే



శ్వరమునకు తెలిసెను. ఇది తాతాచార్యులుగారి ముద్ర పడినదని, తప్పించుకొను దారిలేదు ఆయన తాను జేసిన, కార్యములన్నియు ఒంటరిగా చెఱసాలలో కూర్చుండి తనలో తాను పునశ్చరణ చేయును ఒకనాడు పొద్దుకుంక బోవుచున్న దనగా నిర్బంధితుల నందఱిని వారి వారి గదులలోనికి పంపించి తాళము వేసిరి. గదికి వెనుకవైపున గజము వెడల్పుగల గోడ, అది కొండరాయి. దానిపైని గచ్చు చేసిరి అందులో నుండి యేమియు కన్పించలేదు మూడు వైపుల గోడలు నాల్గవవైపున ఇనుపచువ్వల తలుపు అందునుండి చూచినచో వెలుగు చీకట్లు కనిపించవలయును అచ్చటి వెలుగునుబట్టి సూర్యోదయాస్తమయములు లెక్క. సూర్యు డుద యించిన గంట సేపటికిగాని అచ్చట సూర్యోదయము కాదు ఇంక గంట కస్తమించు ననగా అక్కడ అస్తమించును చీకటి పడిన తరువాత వెలుగు చూచు ప్రాప్తిలేదు ప్రొద్దు పోయి అంతయు సరిగానున్నదో లేదో అని చూచుట కొక లాంతరు వచ్చును. ఆ లాంతరు వెంట వెలుగుకన్న ఘోరముగా దీర్ఘములైన నడచుచున్న కాళుల రెండు పెద్ద నీడలు వచ్చును. అవి అంతలో అంతరించి పోవును తరువాత ఏకాకీత్వము, గాఢాంధకారము రామేశ్వరము తానూహించ సాగెను. "మూడేండ్ల ముచ్చట కెంత ఘోరమైనది? మూడేండ్లలో నేనంత సంపాదించితిని? ఒక మేడ కట్టితిని సినిమాహాలును, స్థలమును సర్వము చెడి అమ్ముకొనినను పదివేలు వచ్చును మేడకు పదివేలయినది పదివేల వరకు ధనము నిల్వఉన్నది పేదలయిన గుమాస్తాల నోరుకొట్టి ఉపాధ్యాయుల నోరుకొట్టి, బోర్డుల నుండి ప్రయాణపు బిల్లుల ఖర్చు వ్రాసి, కంట్రాక్టునిచ్చిన ప్రతి విషయము లోను డబ్బు గుంజి, యింత డబ్బు సంపాదించితిని భార్యలేదు, పిల్లలు లేరు మంగమ్మ ఉన్నది మంగమ్మ కనుపించి నెలనాళ్ళయినది అదియేమో నాకాప్తురాలని ఆస్తి అంతయు దానిపేర వ్రాసితిని దాని భర్త చచ్చినను దానికి నేను క్షౌరము చేయించ లేదు అది నాకు క్షౌరము చేసినది అది పూర్వ మెంతో అమాయకురాలు నేడింత గడుసైనదేమి? అసలు ఆడదానిలోని తత్త్వమే అది స్వైరిణీ లోకజ్ఞానము నార్జించుట కేమి కొదువ! సినిమాలలోనున్న వారందరికిని దానియందే ఎక్కువ అబిమానము దానిని నేనేకదా చెరిపినది అది నన్ను మరల చెరిపినది న్యాయమైన పనియే జరిగినది. న్యాయమైన పని యేమిటి! నేను చెరలోనుండి వదలి వచ్చిన తరువాత దాని ప్రాణము లేరెదను అది నన్నింత మోసము చేయునా? న్యాయవాదుల కిచ్చుటకు నావద్ద దమ్మిడి లేకపోయెనే! రంగారావుగారి వేమని అడుగుదును అడిగి మాత్ర మేమి లాభము అటు దివా నీయనీయుడు ఇటు సుసానీయాయనీయదు



సంక్రాంతి ముగ్గు
ఈమని భానులక్ష్మీ కుమారి, వినుకొండ

చలపతికి నాతోబాటు పదేండ్లు వేసినను వానికి తగిన శిక్ష కాదు వాడు నర హంతకుడు

జోస్యులను 'తలమీద బాది చంపినాడు నేను వలదురా అంటిని వాడు వినలేదు నీవు చేసినది పాపమురా అంటిని. వాడు 'అయ్యా!" మీరు చేసినదే పాపము నేను చేసినదే పుణ్యము మీరు చేసిన పాపమునకు న్యాయస్థానములు, న్యాయపతులు న్యాయవాదులు మిమ్మేమియు జేయరు న్యాయ శాస్త్రపు చట్టములు మిమ్ము చాల విధములుగా సంరక్షించును. ఒక మనిషిని బాధపెట్టి, వాడు బ్రతుకుట కష్టమగునట్లు మాయోపాయములచేత వానిని బాధించుము, వానిమీ దభియోగము లేదు. మిక్కిలి కోపమువచ్చి ఆ ఆవేశములో వానిని చంపుము, న్యాయస్థానములు వాని కురిశిక్ష విధించును ఇది యేమి న్యాయము బాబూ!' అనెను వాడు చెప్పినదే బాగున్నది "ఏమిరా అతనిని చంపుట ఉపకారము చేయుటయా?" అనగా, వాడు "దొరలు బాధపడుచున్న గుఱ్ఱములను, కుక్కలను చంపెదరట వారు చేసినది న్యాయమైనచో నేను చేసినదియు న్యాయమే! అతడు తనభార్య తన్ను వదలిపోయినదని మహాదుఃఖితుడై పిచ్చిఎక్కి తిండిలేక తిరుగుచుండెను అతనికి సుఖమా పాడా! అతడు చచ్చిపోవుటయే మంచిది" అనెను ఆనాడు మేమందరమును నవ్వితిమి ఆ నవ్వుట, ఆ త్రుళ్ళుట నేటికి కట్టికుడిపినది. ఈ కోర్టులో నన్ను గూడ వదలిపెట్టుదురేమో! కేసు మఱల విచారించినచో ఎట్లు పోయి ఎట్లు వచ్చునో? నను వదలి పెట్టినచో నీ మంగమ్మను, మాజిస్ట్రేటును, ఇన్స్పెక్టరును అందరిని గడ్డి గరిపించనా! నా ఎత్తెంత! వీ రెంత? నన్నెంత అన్యాయము చేసిరి అన్నిటికన్న మంగమ్మ చేసిన పనియే బాగున్నది అమాయకురాలు, 'పల్లెటూరుది ఏదో మగని చాటున పడి సంసారము చేసికొనుచున్నది ఇంటిలో తిని యింటివాసములు లెక్క పెట్టినట్లు దానికి ధనాశపెట్టి మహాఘోర కార్యము నాచరించితిని అసలా చేసిన పనికే తూర్పుబండి ఎక్కవలసినది పది నెల లాలస్యమైనది.

మరునాటి ఉదయమున రామేశ్వరముతో మాట్లాడుట కొక స్త్రీ వచ్చినది ఆమెను రామేశ్వరము గదిదగ్గరకు తెచ్చిరి. అతడు చువ్వల వెనకనుండి ఆమెను చూచినంతనే కోపముతో కూడిన ముఖ లక్షణములు ప్రకటించెను ఆమె యిట్లనెను 'నేను పల్లెటూరి పిల్లను' నీవేమో ధనవంతుడ వనుకొని భ్రష్టురాలనై పోతిని నన్ను నీవు చేసిన మోసములకు నీకి శిక్షయైనందుకు నాకు చాల సంతోషముగా ఉన్నది నీవీ నోట్లు సృష్టించుట చేసితివిగాన నా పేర ఆస్తి వ్రాసితివి లేకపోయినచో నేనేమి కావలసినది? ఆస్తి నా ఆధీనమైనదని నీవు దుఃఖించకుము ఆ యాస్తితో నీవు చేసిన వానికన్న మంచి పనులు చేయుదును. నీవు పదేండ్లు, ఆతేండ్లయిన తరువాత వచ్చినప్పుడు నా మాటలలోని నిజము నీకు తెలియగలదు నాకిపుడు పదునేడేండ్లు నేను పట్టి





# రాజకీయ బసవన్నలు

గంగిరెద్దుల వాళ్ళు కనిపిస్తారు
ప్రతి ఏటా సంక్రాంతి పండుగకు
మేళం ఎలా ఉన్నా వేషం
పాతదైనా వాళ్ళ రాక
మనకు ఎంతో శోభ
* * *
యజమాని ఎలా చెప్తే
బసవన్నలా చేస్తాడు
అందుకే గంగిరెద్దును
డూ డూ బసవన్న అంటారు
* * *
పండుగలు పబ్బాలు లేకున్నా
బసవన్న పాఠం
రాజకీయాలలో కనిపిస్తున్నది
* * *
బసవన్న డూ డూ డూ అంటే
వాళ్ళు డిటో డిటో అంటున్నారు
అలా అనకపోతే
క్రమశిక్షణ చర్య తప్పదు
అందుచేత క్రమశిక్షణ
కావాలంటే రాజకీయ
బసవన్నలు మనకు తప్పదు
వాళ్ళు గంగిరెద్దుల వేషం
వేయక పోతే ఒప్పదు

-ఎం ఎస్ ఎం

పసిపిల్లను నేను బ్రతికి బట్టకట్టవలసిన దినములు చాల ఉన్నవి ఎంత చెడినను ఇంక నలుబది మూడేండ్లు బ్రతకవచ్చును నేను నీ కపకారము చేసితి ననుకొనకుము నేను చేసినది ప్రత్యపకారము " రామేశ్వరము రక్తాక్షుడై కన్నుల నుండి కోపము లుమిసెను ఆమె లెక్కలేనట్లు తిరస్కారముచేసి వెడలిపోయెను

సహాయ నిరాకరణోద్యమములో నిర్బంధింపబడిన ఒక మిత్రుడు బందరు సబ్ జైలులో ఉండెను ధర్మారా వతనిని చూడవచ్చెను మ్యాజిస్ట్రేటుగారి అనుజ్ఞ గైకొని దర్మారావు చెఱలోనికి ప్రవేశమై మిత్రునికై వెదకుచు వచ్చుచుండెను ఒక గదిలో అతనికొక పరిచితమైన ముఖము కనబడెను ధర్మారావు నిలువబడి చూచెను రామేశ్వరము ధర్మారావును చూచెను ఇద్దఱి కన్నులు కలిసినవి ధర్మారావు చూపులో వైమనస్య మగపడెను రామేశ్వరము చూపులో క్రూరత్వ మగపడెను ధర్మారావు తన మనస్సులో ఇంక సుమారొకపదేండ్ల దాక గణాచారి, వీడు కనబడినంతనే వీని నుండి తప్పించుకొనుటకు వీధి వెంట పరువెత్త నక్కరలేదు అనుకొనెను రామేశ్వరము మనస్సులో నేను మఱల వచ్చిన తరువాత పని పట్టవలసిన వారిలో వీడొకడు అనుకొనెను ధర్మారావు నడచిపోయెను

తరువాత ఇరువది రోజులకు రామేశ్వరము కేసు

## వేయి పడగలు

విచారణ చేసి అతని కేడేండ్లును, చలపతి కెనిమిదేండ్లును శిక్ష వేసిరి ఆనాడు సాయంకాలము ఇద్దరును తూర్పు బండిఎక్కిరి ధర్మారావు బెజవాడ పోవుటకు తాను గూడ రైలెక్కెను అతడేదో పని ఉండి అనా దకస్మాత్తుగా బందరు వచ్చెను రామేశ్వరము తలబోడి చేతులకు "బేడి" ధర్మారావనుకొనెను వీనిమీద పిడుగు పడుట తప్పెను "

# పదునారవ అధ్యాయము

సంవత్సరము తిరిగి వర్షర్తువు వచ్చినది కిరీటి పరీక్ష అయ్యెను సుబ్బన్న పేట వదలివెళ్ళి నాల్గు నెలలయ్యెను మొదటినెల రోజువిడిచి రోజు ధర్మారావునకు జాబులు వ్రాసెను అవి ఒక్కొక్కటి నాల్గుపుటలు రెండవనెల మూడుపుటలు నాలుగు రోజుల కొకసారి, ఇప్పుడు పదిరోజుల కొకసారి అదియును కార్డు కార్డులో సగము

దర్మారావున కిది న్యాయముగానే తోచెను. కాని వారి యిరువురి అంతరాత్మలలో ఒకరికొకరు దూరముగా లేరు దూరమైనది ఉత్తరముల్ల వత్తిడి ధర్మారావు పది ఉత్తరములు వ్రాసెను ప్రతి ఉత్తరము లోని చివరి వాక్యమిది నీవును, శశిరేఖయు ఎప్పుడు వత్తురు? కిరీటి ఇప్పుడు వత్తు నిప్పుడువత్తు నని వ్రాయును కిరీటి వర్షర్తువు వచ్చినంతనే వత్తునని వ్రాసెను వర్షర్తువు వచ్చెను వచ్చిన వర్షర్తువు దొడ్డిలోని కూర పాదులు పండించెను అతిదులు వచ్చుచున్నారు వారికి కావలయునని కాబోలు దొడ్డిలోని చేమంతి మొక్క పూయించెను హేమంతములో పూయు సేమంతికా కుసుములు తొందరపడి వర్షావేళ పూచెను ఆ మొక్కనాటి రెండేండ్లయినది అది యింతవరకు పూచినదికాదు శశిరేఖ వచ్చుచున్నది ఆమె జడలోనికి పూవు లేవీ అన్నట్లు సేమంతిక పచ్చ పరికిణీ కట్టిన పదియేండ్ల కన్నెవలె పూవయ్యెను ఇంక పట్టణపు గడ్డి చేమంతిపూలు వాసనలేనివి – తనపైకి దండయాత్ర వచ్చుచున్నవని తెలిసె కాబోలు! కుసుమించు శక్తి ఉన్న కొంచెము వ్యర్థముగా పంత చేసి కొందము, దీపముండగనే యిల్లు చక్క బెట్టుకొను మన్నారు ఇంకరెండు మూడేండ్లకు మించి నా ప్రతిబలేదు చెన్నపురి పూలు తరుముకొని వచ్చుచున్న వని ఆమె తొందరపడి పూచెను మందారతరువు, రేక మందార ముద్దమందార రెండును పూచి సేమంతికా మందార పుష్పములు దొడ్డిఉన్న ముత్తయిదువు తాల్చిన పసుపు కుంకుమల వలె ఖండితానాయిక యొక్క ఈర్ష్యా క్రోధదృగంచల కాంతులవలె వికసిల్లెను వర్షర్తువు పొలాలనిండ నిండిన నీళ్ళలో కురిసి, పడుచున్న చినుకు పడినచోట ఎల్లను బొట్ల పూలు పూయించెను కాపుపడుచులు మాలెతలు పొలాల మీద ఊడ్పు చుండిరి రంయిమని దూరము నుండి ధ్వనివచ్చును రైలేమో అని వెను తిరిగి చూతురు హోరుమను గాలితో వానవచ్చి పడును చిన్న చిన్న మట్టి బెడ్డలతో విసరి కొట్టినట్లు వర్షపు పెద్ద పెద్ద చినుకులు చెంపల వరకు ఛెడీలుమని కొట్టును అబ్బో! నా మగడైన ఇంతదెబ్బ కొట్టలేదే!" అని ఒకతె అనగా మఱిఒకతె నిన్ను వానమగడు వదలి పెట్టువా ఇంటిలోని మగడు వదలిపెట్టిన నమను ఊడ్చుచు కొందరు తల ఎత్తకయే ఊడ్చు చుందురు వర్షము వారి వీపుల మీద స్వారి చేసి పోవును పొలముగల యజమాని తాటియాకుల గొడుగులో పొలము గట్టున కూర్చుండును లేదా నారుకట్టలు దూరదూరాలకు విసరి వేయు చుండును వరుసము వచ్చి తాటిఆకుల గొడుగు మీద శ్రీకృష్ణుడు కాళియాహి శిరస్సునవలె నృత్యము చేయును భగవంతుని కాలిగజ్జెలు మ్రోగు చుండును ప్రణయినీ మధురకోపమువలె రివ్వున, వచ్చి రివ్వున పోయిన చిలుపవానలు కాపుల వసనములు తడిపొడిగా చేయును మఱల ఎండబెట్టును మఱలతడుపును మూడు నెలలు కాచిన యెండలకు చర్మము, మాంసము, మజ్జ, అస్థివఱకు ఉష్ణమై, నేడు వచ్చిన నీలమేఘ స్రవద్వర్షాబిందువులకు శరీరములు చల్లనై ప్రాణములు హాయి అనిపించెను (ఇంకా ఉంది)

# సినీ చిత్ర నటి సుమలత



# సమాధానాలు

**సి. వి. ధనుంజయరావు, రెంటచింతల**

ప్ర : ఏమండోయ్! మా పక్కింట్లో పొద్దస్తమానమూ అత్తా కోడళ్ళు తగువులాడుతుంటారు. భర్తేమో సదా భార్యనే వెనకేసుకువచ్చి, తల్లి మీద కోప్పడుతూంటాడు. ఇది న్యాయమంటారా?

జ : ఇంతకీ, మీరు సదా మీ పక్కింటి వైపే చెవులు రిక్కించి ఉంచడం న్యాయమంటారా?

**ఎస్. వి. పూర్ణమ్మ, తెనాలి**

ప్ర : గడచిన దినములు తలచిన ఎందుకు అంత మధురంగా ఉండును?

జ : అవి మళ్ళీ రావు గనుక.

**ఉకోండ అరుణ, సికిందరాబాద్**

ప్ర : సినీ తారలచే సమాధానము ఇప్పించడంతో ఆంధ్ర సచిత్ర వారపత్రిక వారి ఉద్దేశ్యము ఏమిటండీ?

జ : ఇలాంటి సందేహాలను నివృత్తి చేయడమే... కదా?

**బండారు వెంకటసాయి, ఇచ్ఛాపురం**

ప్ర : భగవంతుడు మంచీ- చెడూ, పాప పుణ్యములను విమర్శించి శిక్షించును కదా? అలా కాక, మంచినే సృష్టించి; పాప కార్యములందాసక్తి లేకుండా చేసినచో- మానవుడు వినాశనమునకు గురి కాకుండా ప్రగతిని సాధించువాడు కదా అని...?

జ : భగవంతుడు వెలుగుతో పాటు చీకటిని, మంచితో పాటు చెడును సృష్టించాడు. అందుకే వాడి లీలలు ఎవరికీ అర్థంకావు- అన్నారు వేదాంతులు.

**జవ్వాది ప్రభావతి, వేటపాలెం**

ప్ర : సుమలతగారూ! ఆరోగ్యము మహాభాగ్యము. ఎంత వరకు నిజము?

జ : డాక్టర్లకు తప్ప.

**చల్లా గీతాంజలి, చిట్టమూరు**

ప్ర : ప్రేమించి పెళ్లాడడం మంచిదా, పెళ్లాడి ప్రేమించడం మంచిదా?

జ : గతులు వేరయినా గమ్యమొక్కటే!

**వి. ఎన్. ఆచార్యులు, భన్స్‌వాడ**

ప్ర : నా కలలు నిజమయ్యాయి. మీరు నమ్ముతారా?

జ : మీరు సులభ సాధ్యమయిన కలలనే కంటుంటారేమో!

**మొవ్వా శ్యామలరావు, సీతాఫలమండి**

ప్ర : సుమలతగారూ! నేను సమస్త జ్ఞానమూ సముపార్జించి ప్రాజ్ఞుడగుటకు ఎంత కాలము పట్టును?

జ : దీనికి కాలపరిమితి ఏముందీ? బఠాణీ చెట్టు త్వరలో నే పెరుగుతుంది. మర్రిచెట్టు పెరగడానికి ఎంతో కాలం పడుతుంది.

**వై. సుగంధి, పూతలపట్టు**

ప్ర : నేను జీవిత మనే పరీక్షలో ఫెయిలయ్యాను. ఇటుపైన నాగతేమి?

జ : జీవితంలో కూడా మార్చి పరీక్షలే కాక అక్టోబర్ పరీక్షలు కూడా ఉంటూంటాయి. అంచేత, మరి కాస్త ఓపికపట్టి చూడండి.

**తాళ్ళపల్లి ఉషారాణి, వెల్దుర్తి**

ప్ర : మీరు తెలుగు చిత్రాలకు పుచ్చుకునే పారితోషికానికీ, ఇతర భాషా చిత్రాలకు పుచ్చుకునే పారితోషికానికీ తేడా ఏమిటి?

జ : తేడా ఏమీ లేదు. ఏభాషలో నైనా ప్రతి రూపాయికీ వంద పైసలు చొప్పునే పుచ్చుకుంటాను.

**దర్భా వ్యాఘ్రేశ్వర శర్మ, సీలేరు**

ప్ర : నా మిత్రుడొకడు ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని ఆశపెట్టి, వంచించి, మరో యువతిని వివాహం చేసుకున్నాడు. అతన్ని ఏమనాలి?

జ : కనీసం కట్టుకున్న భార్యకైనా ద్రోహం చేయకు బాబు- అంటూ అతన్ని ప్రార్థించండి. □

## గమనిక

ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎంపిక కాలేదు-సం.

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న.......................................................

...............................................................

...............................................................

పంపినవారి పేరు.......................................

పూర్తి చిరునామా.......................................

# సినిమా విశేషాలు

## శ్రీ.వి.జి.

### కె. విశ్వనాథ్ దర్శకత్వంలో భాను ఆర్ట్ క్రియేషన్స్ చిత్రం

"మూడో షెడ్యూల్ జనవరి 16 నుండి ఫిబ్రవరి 5 వరకు... వైజాగ్‌లో ప్రత్యేకంగా నిర్మించిన సెట్‌లో మిగతా భాగం పూర్తవుతుంది. ఆ తర్వాత భువనేశ్వర్, కోణార్క సూర్య దేవాలయంలో రెండు పాటలు పిక్చరైజ్ చేయవలసి ఉంది" అన్నారు భాను ఆర్ట్ క్రియేషన్స్ అధినేత సిహెచ్. ఎ. అప్పారావు. ఈయన కె. విశ్వనాథ్ దర్శకత్వంలో నిర్మిస్తున్న సంగీత నృత్య ప్రధాన చిత్రంలో వెంకటేష్. భానుప్రియ, ఒడిస్సీ నర్తకి అయిన అమెరికన్ యువతి షరాన్ లోవెన్, సాక్షి రంగారావు, షణ్ముఖ శ్రీనివాస్, కనకారావు, సెల్వరాజ్, మిశ్రో, దేవి లలిత, శ్రీలక్ష్మి, శ్రీ శైలజ, కొందరు రంగస్థల కళాకారులు పాల్గొంటున్నారు. టి. సాయినాథ్ మాటలు. సీతారామశాస్త్రి పాటలు, ఇళయరాజా సంగీతం లోక్‌సింగ్ ఛాయ, అరుణ్ శిల్పం, నందూరి విజయ్ సహకార దర్శకత్వం, లక్ష్మణరావు-రవి ప్రకాష్ సహాయ దర్శకత్వం, జగన్మోహనరావు-రాజగోపాల్ ప్రొడక్షన్, జి. జి. కృష్ణారావు కూర్పుతో కె. ఎస్. రామారావు సమర్పణ.




సారీ డైరెక్టరుగారూ! ఇంటి దగ్గర ముగ్గేసి రావటం వల్ల కాస్త ఆలస్యం అయింది.

'చుట్టాలబ్బాయి'లో కృష్ణ, సుహాసిని

# ఈ సంక్రాంతి



**విజయశాంతి :-** సర్వ సౌభాగ్యాలనూ తెచ్చేది సంక్రాంతి అంటారు... సంక్రాంతి అనగానే చిననాటి అమాయకపు రోజులే స్ఫురణకొస్తాయి. అప్పుడు ఏ బాధ్యతలూ లేవు గనుక ఎంతో ఉత్సాహంగా పండుగ జరుపుకునేదాన్ని. అయినా, ఆ పాత రోజులను తలచుకొని మురిసిపోవడంలో ఎంత ఆనందముంది!



**సుమలత :-** నిరుడు సంక్రాంతికి, అంతకు క్రితం సంవత్సరం కూడా టి. వి. లో క్రికెట్ మేచ్ చూస్తుండిపోయాను. ఈ ఏడు మన జట్టుకి, వెస్ట్ ఇండీస్ జట్టుతో పోటీ ఉంది... తెల్లవారు ఝామునే లేచి, తలార స్నానం చేసి, రంగు రంగుల ముగ్గులు పెట్టి, భోగిమంటలతో చలికాచుకుని, పిండివంటలు, కొత్త బట్టలు, పేరంటాలు, విందులు, వినోదాలతో ఎంత ఘనంగా పండుగను జరుపుకున్నా క్రికెట్ మేచ్ ఇచ్చే థ్రిల్ వేరు.



**భానుప్రియ :-** గుమ్మడి పువ్వుల కోసం పనికట్టుకుని రెండు మూడు మైళ్ళ దూరమైనా పక్క ఊరికి వెళ్ళి తెచ్చుకుని గొబ్బెమ్మలు పెట్టడం అప్పటి సరదా... మరి, ఇప్పుడో...? మా అన్నయ్య ఏటేటా శబరిమలైకి వెళ్ళొస్తుంటాడు. సరిగ్గా సంక్రాంతప్పుడే ఆ పుణ్య స్థలంలో మకరజ్యోతి కనిపిస్తుంది. సాయంత్రం ఆ సమయానికే మా ఇంటి దగ్గర పెద్ద జ్యోతి వెలిగించి, పూజ చేస్తాం.



**శారద :-** కొత్త సంవత్సరంలో వచ్చే మొదటి పండుగ సంక్రాంతి. నిరుడు సంక్రాంతి నుంచి 1987 చివరి వరకు మనదేశంలో ఎన్నో సమస్యలు, గొడవలు, అల్లర్లు, విపరీతాలు జరిగాయి. కొన్ని నిత్యావసర వస్తువుల ధరలు మిన్నుముట్టాయి. ఉన్నవారికి ప్రతి రోజూ పండుగే. కాని లేనివారికి కనీసం పండుగ రోజుల్లోనైనా కడుపు నిండా అన్నం పెట్టాలని భగవంతుని ప్రార్థిస్తున్నా.

(సేకరణ : జి. వి. జి)



# శివాజీగణేశన్ - 60

(ఇటీవలే ప్రముఖ తమిళ నటుడు శివాజీ గణేశన్ ఎం. పి., షష్ఠిపూర్తి మహోత్సవం వైభవోపేతంగా జరిగింది. ఆ మహా నటుని జీవితంలోని కొన్ని ముఖ్యమైన అంశాలు)

• ఒక నాటకంలో ఛత్రపతి శివాజీగా అమోఘంగా నటించినందుకు "శివాజీ" అనే బిరుదును ద్రావిడం కళగం స్థాపకులు స్వర్గీయ ఇ. వి. రామస్వామి నాయకర్ ప్రదానం చేశారు.

• శివాజీగణేశన్ నటించిన తొలి తెలుగు చిత్రం అంజలీ పిక్చర్స్ "పరదేశి"

• అత్యల్ప వ్యవధిలో నే వంద చిత్రాలు పూర్తి చేసిన ఘనత ఈయనది (1952-1964)

• ఈయనతో ఎక్కువ చిత్రాలలో నాయికగా నటించినది కె. ఆర్. విజయ.

• "గూండు కిళి, తిరుంబి పార్, పెణ్ణిన్ పెరుమై" చిత్రాలలో ఈయన విలన్‌గా నటించారు.

• "వాళ్విల్ ఒరు నాళ్" చిత్రంలో తనకన్నా వయసులో ఎంతో పెద్దవాడైన శ్రీరాంకు తండ్రిగా నటించారీయన.

• విదేశీ చలన చిత్రోత్సవానికి పంపబడిన తొలి తమిళ చిత్రం "వీర పాండ్య కట్ట బ్రహ్మన" (ఆఫ్రికా). ఈ చిత్రంలో ఎన్నో పెద్ద పెద్ద డైలాగులను ఈయన ఒకే టేక్‌లో ఓ. కే. చేశారు.

• ఎన్. టి. ఆర్; ఎ. ఎన్. ఆర్. లతో కలిసి ఈయన నటించిన చిత్రం "చాణక్య చంద్రగుప్త".

• ఎం. జి. ఆర్. తో కలిసి నటించిన చిత్రం "గూండు కిళి".

• శ్రీరాం, వైజయంతిమాల నటించిన "మర్మ వీరన్" చిత్రంలో ఒకే ఒక షాట్‌లో ఈయన కనిపిస్తారు.

• "నవరాత్రి" చిత్రం తర్వాతనే ఈయన పారితోషికం 'ల'కారం దాటింది.

• ఒక్క పాటైనా లేని చిత్రం "అందనాళ్", ఈయనకు ఒక్క పాటైనా లేని చిత్రం "తిల్లానా మోహనాంబాళ్" రెండో చిత్రంలో ఈయన నాగస్వరం విద్వాంసుడు నటించారు.

• "సింగినాదం కేక్కుదు" అనే యుద్ధ నిధి ప్రచార చిత్రంలో ఈయన ఒక పాట పాడారు.

• ఈయన తండ్రి రైల్వేలో పని చేశారు. అంచేత "పచ్చ విళక్కు" అనే చిత్రంలో ఇంజన్ డ్రయివర్‌గా నటించడానికి ఎంతో సంబరపడ్డారు.

• ఈయన 125వ చిత్రం "ఉయర్ంద మనిదన్". 250వ చిత్రం "నామ్ ఇరువర్". ఈ చిత్రాలను ఎ. వి. ఎం. సంస్థ నిర్మించింది.

• సినీ నటుడవడానికి ముందు ఈయన తిరుచ్చి దగ్గరున్న పెరంబలూర్ అడవుల్లో వేటకు వెళ్ళేవారు.

• శివాజీ ఏ చిత్రాన్నీ స్వయంగా డైరెక్ట్ చేయక పోయినా "రక్త పాశం" చిత్రాన్ని మాత్రం కొంతవరకు డైరెక్ట్ చేశారంటారంతా.

• "తంగ పతకం" తర్వాత ఈయన ఏ నాటకంలోనూ నటించలేదు. ఈయన ఏదైనా నాటకాన్ని చూశాక వెంటనే గ్రీన్ రూమ్‌లోకి వెళ్ళి నటీనటుల్నీ అభినందించడం మామూలు.

• పాత్రికేయులను ఎంతో సాదరంగా ఆహ్వానించి, వారి ప్రశ్నలకు ఓపికతో సమాధానాలివ్వడం ఈయన ప్రత్యేకత.

• దేవర్ ఫిలిమ్స్‌వారి చిత్రాలలో నటించని తమిళ హీరో ఈయనొక్కరే.

(జి. వి. జి)


సురేష్ మూవీస్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ సమర్పించు
శ్రీ ఉషా ఆర్ట్ ప్రొడక్షన్స్
రక్తతిలకం
బి.గోపాల్
కె.అశోక్ కుమార్

# 1987లో విడుదలైన తెలుగు చిత్రాలు

| చిత్రాలు | దర్శకుడు | సంగీత దర్శకుడు |
|---|---|---|
| డబ్బెవరికి చేదు | రేలంగి నరసింహారావు | సాలూరి వాసూరావు |
| అరణ్యకాండ | క్రాంతికుమార్ | చక్రవర్తి |
| మొనగాడు | ఎస్. బి. చక్రవర్తి | చక్రవర్తి |
| ఉదయం | కోడి రామకృష్ణ | చంద్రశేఖర్ |
| దొంగ మొగుడు | ఎ కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| సంసారం ఒక చదరంగం | ఎస్ పి ముత్తురామన్ | చక్రవర్తి |
| దాదా | ఎన్. రవీంద్రరెడ్డి | చక్రవర్తి |
| భార్గవరాముడు | ఎ. కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| మజ్ను | దాసరి నారాయణరావు | లక్ష్మీకాంత్‌ప్యారేలాల్ |
| తండ్రీకొడుకుల చాలెంజ్ | ఎం. మల్లికార్జునరావు | చక్రవర్తి |
| పున్నమి చంద్రుడు | విజయబాపినీడు | చక్రవర్తి |
| వీరప్రతాప్ | బి విఠలాచార్య | శంకర్-గణేశ్ |
| అమెరికా అబ్బాయి | సింగీతం శ్రీనివాసరావు | ఎస్. రాజేశ్వరరావు |
| ఓ ప్రేమ కథ | రాజశ్రీ | ఎం రంగారావు |
| చైతన్యం | జి సత్యమూర్తి | చక్రవర్తి |
| ఉమ్మడి మొగుడు | బి భాస్కరరావు | చక్రవర్తి |
| నమ్మినబంటు | రవిరాజా పినిశెట్టి | చక్రవర్తి |
| తల్లి గోదారి | వీరం మస్తాన్‌రావు | రమేష్‌నాయుడు |
| మండలాధీశుడు | ఎం. ప్రభాకరరెడ్డి | రాజ్-కోటి |
| అల్లరి కృష్ణయ్య | నందమూరి రమేష్ | చక్రవర్తి |
| ఆనంద తాండవం | ఎ. రఘురామిరెడ్డి | ఎల్ వైద్యనాథన్ |
| కల్యాణతాంబూలం | బాపు | కె వి. మహదేవన్ |
| రౌడీ పోలీస్ | మౌళి | రాజన్-నాగేంద్ర |
| లాయర్‌సుహాసిని | వంశీ | ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం |
| దొంగోడొచ్చాడు | కోడి రామకృష్ణ | చక్రవర్తి |
| మకుటంలేని మహారాజు | కె బాపయ్య | చక్రవర్తి |
| హంతకుడి వేట | నివాస్ | చంద్రశేఖర్ |
| సంకీర్తన | గీతాకృష్ణ | ఇళయరాజా |
| చిన్నారి దేవత | రాజానాయుడు | చక్రవర్తి |
| ఆరాధన | భారతీరాజా | ఇళయరాజా |
| కలెక్టర్‌గారి అబ్బాయి | బి గోపాల్ | చక్రవర్తి |
| మరణశాసనం | ఎస్ ఎస్ రవిచంద్ర | రాజ్-కోటి |
| నేనే రాజు- నేనే మంత్రి | దాసరి నారాయణరావు | జె. వి. రాఘవులు |
| వీరవిహారం | క్రాస్‌బెల్ట్ మణి | రాజ్-కోటి |
| సర్దార్ ధర్మన్న | బి. భాస్కరరావు | రాజన్-నాగేంద్ర |
| కాబోయే అల్లుడు | రేలంగి నరసింహారావు | చక్రవర్తి |
| జగన్మాత | ధనకోటేశ్వరరావు | చక్రవర్తి |
| సాహస సామ్రాట్ | కె రాఘవేంద్రరావు | చక్రవర్తి |
| పడమటి సంధ్యారాగం | జంధ్యాల | ఎస్. పి బాలసుబ్రహ్మణ్యం |
| తేనెమనసులు | ఎస్. వి. రాజేంద్రసింగ్ | బప్పీలహరి |
| కార్తీకపౌర్ణమి | ఎ. కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| శ్రుతిలయలు | కె విశ్వనాథ్ | కె వి మహదేవన్ |
| లాయర్ భారతీదేవి | జి రామ్మోహనరావు | కె వి మహదేవన్ |
| పుణ్యదంపతులు | అనిల్‌కుమార్ | చక్రవర్తి |
| ప్రెసిడెంటుగారి అబ్బాయి | తాతినేని రామారావు | చక్రవర్తి |
| అజేయుడు | జి. రామ్మోహనరావు | చక్రవర్తి |
| నాకూ పెళ్ళాం కావాలి | విజయబాపినీడు | వాసూరావు |
| రేపటి స్వరాజ్యం | పరుచూరి సోదరులు | చక్రవర్తి |
| రొటేషన్ చక్రవర్తి | రేలంగి నరసింహారావు | సత్యం |
| తాయారమ్మ తాండవకృష్ణ | కొమ్మినేని | చక్రవర్తి |
| భారతంలో అర్జునుడు | కె రాఘవేంద్రరావు | చక్రవర్తి |
| ప్రేమదీపాలు | సి ఎస్ బోస్ | పెండ్యాల |
| చక్రవర్తి | రవిరాజా పినిశెట్టి | చక్రవర్తి |
| సర్దార్ కృష్ణమనాయుడు | ఎ. కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| ప్రేమ సామ్రాట్ | ఎ మోహన్‌గాంధి | సత్యం |
| పెళ్ళిళ్ళోయ్ పెళ్ళిళ్ళు | గోపాలకృష్ణ | రాజ్-కోటి |
| త్రిమూర్తులు | కె మురళీమోహనరావు | బప్పీలహరి |
| మువ్వగోపాలుడు | కోడి రామకృష్ణ | కె వి. మహదేవన్ |
| చైతన్యరథం | ధవళ సత్యం | జె వి రాఘవులు |
| పగ సాధిస్తా | విజయనిర్మల | రాజ్-కోటి |
| శంఖారావం | కృష్ణ | బప్పీలహరి |
| గాంధీనగరం రెండవ వీధి | పి. ఎన్. రామచంద్రరావు | జి ఆనంద్ |
| బ్రహ్మనాయుడు | దాసరి నారాయణరావు | జె వి రాఘవులు |
| రాగలీల | జంధ్యాల | రాజన్-నాగేంద్ర |
| ఇదా ప్రపంచం | ముత్యాల సుబ్బయ్య | చక్రవర్తి |
| ఇంటిదొంగ | కోడి రామకృష్ణ | కె వి మహదేవన్ |
| ముద్దాయి | కె ఎస్ ఆర్ దాస్ | చక్రవర్తి |
| అందరికంటే ఘనుడు | శ్రీధర్ | ఇళయరాజా |
| పసివాడి ప్రాణం | ఎ కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| అక్షింతలు | మౌళి | కె వి మహదేవన్ |
| రాము | వై నాగేశ్వరరావు | ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం |
| గుండమ్మగారి కృష్ణులు | రేలంగి నరసింహారావు | చక్రవర్తి |
| కులాల కురుక్షేత్రం | శరత్ | కె వి మహదేవన్ |
| విజేత విక్రమ్ | ఎస్ ఎస్ రవిచంద్ర | చక్రవర్తి |
| ధర్మపత్ని | తాతినేని ప్రసాద్ | చక్రవర్తి |
| ప్రతిస్పందన | అనిల్‌కుమార్ | చక్రవర్తి |
| అల్లరి పాండవులు | ఎం బాలయ్య | రాజ్-కోటి |
| గౌతమి | క్రాంతికుమార్ | ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం |
| విశ్వనాథనాయకుడు | దాసరి నారాయణరావు | జె వి రాఘవులు |
| మన్మధలీల కామరాజు గోల | రేలంగి నరసింహారావు | వాసూరావు |
| పరాశక్తి | పి చంద్రశేఖరరెడ్డి | రాజ్-కోటి |
| అగ్నిపుత్రుడు | కె రాఘవేంద్రరావు | చక్రవర్తి |
| దయామయుడు | విజయచందర్ | సత్యం |
| స్వయంకృషి | కె విశ్వనాథ్ | రమేష్‌నాయుడు |
| మదనగోపాలుడు | పి కృష్ణమోహనరెడ్డి | శివాజీరాజా |
| డామిట్ కథ అడ్డం తిరిగింది | కె వాసు | శివాజీరాజా |
| యుగకర్తలు | ఆదిత్య | సుభాష్-గోపి |
| అల్లుడుకోసం | ఎం ఎస్ కోటారెడ్డి | సత్యం |
| శ్రీనివాస కల్యాణం | కోడిరామకృష్ణ | కె. వి మహదేవన్ |
| భలే మొగుడు | రేలంగి నరసింహారావు | సత్యం |
| కృష్ణలీల | రవిరాజా పినిశెట్టి | రాజ్-కోటి |
| దూరపు కొండలు | ప్రసాద్ నల్లంరెడ్డి | శంకరజీ |
| ఆత్మబంధువులు | దాసరి నారాయణరావు | చంద్రశేఖర్ |
| సామ్రాట్ | వి మధుసూదనరావు | బప్పీలహరి |
| చందమామ రావే | మౌళి | సత్యం |
| మారణహోమం | ఎ. కోదండరామిరెడ్డి | చక్రవర్తి |

| | | |
|---|---|---|
| శారదాంబ | క్రాంతికుమార్ | చక్రవర్తి |
| స్వాతంత్ర్యానికి ఊపిరి పోయండి | యు. వెంకన్నబాబు, చిన్నా | జె. ఆనంద్ |
| శ్రీమతి ఒక బహుమతి | విశు | శంకర్-గణేశ్ |
| రౌడీ బాబాయ్ | సత్యారెడ్డి | రాజ్-కోటి |
| ముద్దుల మనమడు | ఎ మోహన్‌గాంధి | చక్రవర్తి |
| మా ఊరి మగాడు | కె బాపయ్య | చక్రవర్తి |
| అత్తగారూ జిందాబాద్ | పి. చంద్రశేఖరరెడ్డి | డాక్టర్ భానుమతీ రామకృష్ణ |
| కిరాయి దాదా | ఎ. కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| మనవడొస్తున్నాడు | కోడి రామకృష్ణ | కె. వి. మహదేవన్ |
| భానుమతిగారి మొగుడు | ఎ కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| అర్జున్ | కె విక్రమ్ | రాజ్-కోటి |
| అహ! నాపెళ్ళంట | జంధ్యాల | రమేష్‌నాయుడు |
| ఆహుతి | కోడి రామకృష్ణ | సత్యం |
| ముద్దుబిడ్డ | పి చంద్రశేఖరరెడ్డి | కె వి మహదేవన్ |
| పుష్పక విమానం | సింగీతం శ్రీనివాసరావు | ఎల్ వైద్యనాథన్ |
| అగ్నిపుష్పం | ఈరంకి శర్మ | ఎం. ఎస్. విశ్వనాథం |
| ప్రజాస్వామ్యం | పరుచూరి సోదరులు | చక్రవర్తి |
| సత్యాగ్రహం | జంధ్యాల | రమేష్‌నాయుడు |
| దొంగ కాపురం | కోడి రామకృష్ణ | కె. వి మహదేవన్ |
| దొంగగారూ స్వాగతం | జి రామ్మోహనరావు | చక్రవర్తి |
| జేబుదొంగ | ఎ కోదండరామిరెడ్డి | చక్రవర్తి |
| రాక్షస సంహారం | రాఘవ | చక్రవర్తి |
| మహర్షి | వంశీ | ఇళయరాజా |

(సేకరణ : జి. వి. జి)

## ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1987 సినిమా బాలట్ పత్రం

ఉత్తమ చిత్రం........................................

ఉత్తమ నటుడు........................................

ఉత్తమ నటి........................................

ఉత్తమ దర్శకుడు........................................

ఉత్తమ సంగీత దర్శకుడు........................................

ఉత్తమ సహాయ నటుడు........................................

ఉత్తమ సహాయ నటి........................................

ఉత్తమ హాస్య నటుడు........................................

ఉత్తమ హాస్య నటి........................................

ముగింపు తేదీ 15-2-1988

పంపినవారిపేరు ........................................

చిరునామా ........................................

........................................

# తారల ముగ్గులు



2





5



3



4







1



ఏ, ఏ తారలు ఏ, ఏ ముగ్గులు పెట్టారు? తెలుసుకోవాలంటే – 82వ పేజీ చూడండి

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు4 నెలలనుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలు కావాలి. దీన్ని సెరిలాక్ లాభంతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం:**
సెరిలాక్ ప్రతి మోతాదులోను (ప్రతిసారి మీ పాపకు తినిపించే సెరిలాక్ లోను) మీ పాపాయికి కావలసిన పోషకపదార్థాలు. ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వు పదార్థాలు. విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళల్లో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం:**
సెరిలాక్ మంచి పోషకపదార్థాలకు మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం:**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలు పంచదార ఉన్నాయి. దానిని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయ్యారు.

**ఎంపిక లాభం:**
పాపాయికి ఆహారం తినిపించడం మరింత ఆహ్లాదకరంగా చేసేందుకు, యిప్పుడు ఎంచుకునేందుకు రెండు రకాల సెరిలాక్ దొరుకుతోంది. 4 నెలల నుంచి సెరిలాక్ వీట్. 6 నెలల తరువాత కొత్తసెరిలాక్ ఆపిల్. మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారు చేయడంలో. పరిశుభ్రతను పాటించేందుకు డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.

> ఉచితం
> పాపాయి ఆరోగ్య రికార్డు పుస్తకం కోసం వ్రాయండి.
> సెరిలాక్ పోస్ట్ బాక్స్ నం. 3
> న్యూ ఢిల్లీ-110 008.










## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# సీరియల్

# డి.ఎస్.పి. విజయ్

## ఆమూరి సావిత్రి




(గత సంచిక తరువాయి)

అడివి వాళ్ళకి తల్లి. ఏదో ఒకటి పెట్టి వాళ్ళ ఆకలి తీరుస్తుంది. వన్య మృగాల్లో తినటానికనువైన వాటితో పాటు లక్క, మాదుపాకు ... చింతపండు.. తేనె... వెలక్కాయలు లాంటివమ్ముకుని సంపాయించిన దబ్బుతో వాళ్ళ కడుపు నిండుతుంది.

ఏమీ దొరక్కపోతే చెరువులో ఉన్న తామర తూడులు పైకి లాగి వాటి అడుగునున్న తెల్లని భాగాన్ని తింటారు. ప్రభుత్వం వాళ్ళ సంక్షేమానికి పాటుబడటం.. ఫారెస్టువాళ్ళతో కాస్త కాస్త పరిచయంతో వాళ్ళలో అతి చిన్న మార్పొచ్చింది అదేమిటంటే... అవసరమైతే. మగాళ్ళతో మాట్లాడాలిసొస్తే.. గుడిశ బయటకొచ్చి ఆడవాళ్ళు మాట్లాడటం ప్రారంభించారు. అదీ.. అవసరమయినంత వరకే

ఏ పరిస్థితిలోనూ ఇంకో మగాడు మాత్రం ఆ గుడిశలోపలికి వెళ్ళకూడదు అలా వెడితే . దాని మొగుడు నిలువునా పాతేస్తాడు. ప్రౌఢ వయసు దాటిన ఆడవాళ్ళకీ నియమాలు వర్తించవు... వాళ్ళ జీవన విధానంలో కూడా కొంత మార్పొచ్చింది... ప్రభుత్వం ఇచ్చిన ఎరువులు, విత్తనాలు మొదలైనవి తెచ్చుకుని కొంత భూమి సాగుజేసుకుని అవసరమయినంత వరకూ ధాన్యం పండించుకోటం... పశువుల పెంపకం. పొట్టి చేతుల చొక్కాలు, నిక్కర్లు ధరించటం... ట్రాన్సిస్టర్లో పాటలు వినటం .. భాషలో రవ్వంత మార్పు... ఇవి. వాళ్ళ ఆచార వ్యవహారాల్లో ఉన్న క్రూరత్వం మాత్రం ఎవరూ మార్పలేక పోయారు.

బాహ్య స్వరూపాలు మారినట్లున్నా వాళ్ళ అంతఃకరణలలాగే ఉన్నాయి...

వాళ్ళలో కొన్ని తండాలవాళ్ళు ఊళ్ళ మీద పడి దోపిడీలు చేస్తారు. మిగిలినవాళ్ళు అలాంటి వాటి జోలికి వెళ్ళకుండా కష్టపడి జీవిస్తారు

పోలీసులు మాత్రం వీళ్ళు దొరికారంటే వాళ్ళా వీళ్ళా అనే భేదం లేకుండా అన్ని తండాల వాళ్ళనీ హింసిస్తుంటారు అనుమానం మీద.

అందుకే... అడివిలో ఎక్కడన్నా పోలీసు వాసన పసిగడితే చాలు... ఆమడ దూరం పారిపోతారు చెంచులు.

ఈ రోజు వాళ్ళ గూడెం ఉన్న చోటున రేపటికి ఆ ఆనమాలు కూడా దొరకదు.

వెదురుతో గుడిశల్ని అతి వేగంగా నిర్మించుకోగలరు వాళ్ళు. సెంట్రల్ జైలు నుంచి పారిపోయిన గజదొంగ గంగులు ఆ అడవిలోనే యధేచ్ఛగా జీవిస్తున్నాడని తెలిసినా... అది ఎంత నమ్మకమయిన వార్తయినా పోలీసులు వాడిని పట్టలేరు. వాడి కోసం గాలించి గాలించి చివరికా ఫైలు మూసుకోవలసిందే.

ఆ ఫారెస్టులో ఎత్తైన కొండలు వరసగా ఒకదాని వెనుక ఒకటి దట్టమయిన చెట్లతో నిండి ఉన్నాయి.

చిన్నప్పట్నుంచీ ఆ కొండల్ని అతి వేగంగా ఎక్కి రావటం బాగా అలవాటు చెంచులకి.

పోలీసాఫీసర్లు ఒక కొండ సగం ఎక్కే లోపల వాళ్ళు అనేక కొండల్ని లాఘవంగా దాటుకుని వెళ్ళిపోతారు... గెరిల్లా పద్ధతిలో చాటు నుంచి యుద్ధం చేస్తారు. ఆ బాణాలు గురి తప్పవు. ఎన్నాళ్ళు మాటు వేసినా వాళ్ళు ఆ కొండలు దిగి రారు. చెంచులు ఎక్కడుంటే అక్కడే కొద్ది సమయంలో ఓ గుడిశ నిర్మించుకొని, ఏదో ఒకటి తిని ఆకలి తీర్చుకుంటూ ఎన్నాళ్ళయినా హాయిగా మనుగడ సాగించుకోగలరు. వాళ్ళ అవసరాలు.. కోరికలు మరీ పరిమితమైనవి. కానీ... పోలీసులు అన్నాళ్ళు అడివిలో ఉండాలంటే కష్టం. అక్కడ ఏమీ దొరకదు... ఏ అవసరమూ తీరదు... క్రూర మృగాల బెడద... పొంచి వున్న శత్రువు చర్యల గురించిన కలవరం... వీటన్నిటితో విసుగెత్తి క్యాంపు ఎత్తేసి వెనక్కెళ్ళిపోతారు.

అడవిలో చెంచుల రాజ్యం.. అడివి దాటితే పోలీస్ రాజ్యం అన్నట్లుంటుంది ..

వాళ్ళకు సమీపంగా రాగలిగిన ఏకైక పోలీసాఫీసర్ విజయ్ ఒక్కడే. అతనిమీద వాళ్ళకి కొండంత నమ్మకం...

అయినా... చెంచీతని ఓదార్చే విషయంలో కూడా అతని పరిధులతని కున్నాయి... వాటిని అతను దాటకూడదు... ఎర్రని ముతక చేనేత చీర మోకాలి వరకూ దోపి, మాదుపాకుకోస్తోంది చెంచీత...

తెల్లని శరీరంతో పుష్టిగా ఉండే చెంచీతకు ఆ చీర చక్కగా నప్పింది. ఆమె మొగుడికి ఒంట్లో బాగుండక పడకేస్తే... చెల్లి, పినతల్లితో కలిసి అడివి కొచ్చిందామె.

ఆకు కోస్తూ కోస్తూ వాళ్ళ నుంచి దూర దూరంగా జరిగి చెట్ల చాటుకు మాయమయింది చెంచీత...

అక్కడ కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్న చెంచు యువకుడు ఆమెని కలుసుకున్నాడు. అతని పేరు పోతరాజు. పోతరాజు పచ్చగా... ధృఢంగా... నొక్కుల జుట్టుతో చెంచు వేషం కట్టిన హీరోలా ఉంటాడు...

అతని చూపులు కాంక్షగా చెంచీతని అల్లుకు పోతున్నాయి. అతను వేరే గూడెపు మనిషి. అలా వేరే మనిషి అక్కడికి రాగూడదు.

ఆ గూడేళ్ళవాళ్ళకి అడివిలో ఎవరి హద్దులు వాళ్ళకుంటాయి. ఆ హద్దుల్లోపలివి వాళ్ళ సామంత రాజ్యాలు. ఒకరి రాజ్యంలోకి ఒకరు ప్రవేశించటానికి గానీ... ఇలా ఆడపిల్లలతో మాట్లాడ్డానికి వీల్లేదు. అలా మాట్లాడుతూ ఎవరైనా దొరికితే వాళ్ళని నిర్దాక్షిణ్యంగా వధించటానికే మాత్రం వెనకాడరు ఆ రాజ్యపు మగాళ్ళు...

**జరిగిన కథ- 24:** విజయ్‌కి జగదీష్ పరిచయమవుతాడు. గోదావరి వరదల్లో మాధవరావు కుటుంబం కొట్టుకుపోతుంది. వైజయంతి ఏమయిందో తెలియదు. విజయ్‌కి ఊరట కలిగించడానికి జగదీష్ ప్రయత్నిస్తుంటాడు. కొత్త సి. ఐ. జగన్నాథం జరపబోయిన అత్యాచారాన్ని నివారించి విజయ్ సి. ఐ. తో శత్రుత్వం తెచ్చుకుంటాడు. ఆ సందర్భంగా పరిచయమైన చెంచులతో వాళ్ల గూడానికి వెళ్ళి పరిశోధన ప్రారంభిస్తాడు.

పోతరాజు చెంచీతని బోనాలపల్లిలో ఒక కొట్లో సరుకులు కొనుక్కుంటుండగా చూశాడు వెంట ఆమె భర్త ఉండటంతో చూసీ చూడనట్లు మౌనం వహించాడు

అలా వాళ్ళు నాలుగైదుసార్లు కలవటం తటస్థించింది అతని కళ్ళు. వాటిలో తన పట్ల గల కోరిక ప్రేమ ఆసక్తి చెంచీతని ఆకర్షించసాగాయి

అసలలాంటి అనుభూతి ఒకటుంటుందని ఆమెకి తెలీదు చాటు చాటుగా చూసుకుంటున్నా మాట్లాడుకోకపోయినా అతని పట్ల ఆమెకూ ఆకర్షణ ఏర్పడింది

తన మొగుడు వాడిలో ఉండే మోటుతనం క్రూరత్వం మురికితనం ఆమెకు వెగటును కలిగిస్తున్నాయి సానపెట్టని వజ్రంలాంటిది చెంచీత

మనసులో కలిగే కోరికలకు నాగరికత అక్కర్లేదు తన వాళ్ళతో కలిసి అప్పుడప్పుడు అడివి దాటి ఊళ్ళోకి రావటం తమ గూడానికొచ్చే కొందరు నాగరికుల ప్రవర్తన ఇవన్నీ మామూలు చెంచు యువతుల కన్నా చెంచీత మీద ఎక్కువ ప్రభావాన్ని కలిగి ఉన్నాయి

ఇందుకు కారణం సహజంగా ఆమె చురుకైనది, తెలివైనది కావటమే
కోరికలు అనుభూతులుగా మారటానికా ప్రభావం కొంత తోడ్పడింది
పోతరాజును తన పక్కన ఊహించుకోటం ప్రారంభించింది చెంచీత
మొదటిసారి అతని గూడెపు సరిహద్దుల్ని దాటి తనకోసం తమ ప్రాంతాని



# నచ్చిన సన్నివేశం

**త**మ ఆశ్రితులు ఎలాంటి గూండా లయినా పోలీసులు వాళ్ళని కాపాడాలి. వాళ్ళ జోలికెళ్ళగూడదు. కావాలంటే వాళ్ళకు బదులు అమాయకుల్నయినా అరెస్టు చేసుకోవాలి. వారి చర్యలను ప్రశ్నించకూడదు. అడ్డం వెళ్ళకూడదు. వాళ్ళు చెప్పినట్లు వినకుండా ఎదురు తిరిగిన ఏ ఆఫీసర్నయినా సరే శంకరగిరి మాన్యాలు పట్టించడం, ప్రమోషన్లు రాకుండా అడ్డు పడటం, మానసిక వత్తిడి తేవటం ఇంకా లొంగకపోతే మర్డర్ చేసి పారెయ్యడం... ఈ విషయాలను గూర్చి ఆలోచిస్తుంటాడు డి. యస్. పి. విజయ్.

పదవిలో ఉన్నామనే అహంకారంతో రాజకీయ నాయకులు పోలీసు డిపార్ట్ మెంట్ను వారి స్వార్థానికి ఉపయోగించుకొంటున్న ఈ సన్నివేశం నాకు నచ్చిన సన్నివేశం.

– బి. వెంకటరావు, దాచేపల్లి (గుంటూరు)

★ ★ ★

"**ఎం**దుకేమిటి నానీ నువ్వంటే ఎవరికి ఇష్టం వుండదు. అందంగా చురుకుగా అమాయకంగా ఉండే నిన్ను ఇష్టపడటానికి వేరే కారణాలు కావాలా?" నానీని దగ్గరగా తీసుకుంటూ ప్రేమగా అన్నారు విజయ్.

"మమ్మీ కూడ అచ్చం ఇలాగే అంటుంది అంకుల్. రంగారావుకు నేనంటే ఎందుకు కసి. వాడు దుర్మార్గుడు. అందుకని వాడికి మంచి వాళ్ళంటే గిట్టదు. మమ్మిని వాడెక్కడ దాచాడో గదూ. నన్ను కొట్టినట్లే తనను కొడతాడేమో. నాకు వర్లేదంకుల్ కాని మమ్మిని కొడితే ఓర్చుకోగలదా" అంటూ రచయిత్రి నానీతో పలికించిన మాటలు నాకు ఎంతో బాగా నచ్చాయి.

– పి. వాసు, అనంతపురం

★ ★ ★

**నా**సిదగ్గర బర్త్ డే చాక్లెట్ అందుకున్న విజయ్ నానీని ఆశీర్వదించి బెడ్రూమ్లో కెళ్ళి బద్ధకంగా పడుకుంటాడు.

"అంకుల్? పొద్దున్నే మళ్ళీ నిద్రపోవటం మంచిది కాదుగా? మరి మీరిప్పుడు పడుకున్నారేం?"

"రాత్రంతా నిద్ర పోలేదుగదమ్మా మరి" అంటాడు విజయ్.

"రాత్రంతా మేలుకుని ఉంటే ఆరోగ్యం పాడవుతుందట. నేను ఎగ్జామ్ టైంలో నైటవుట్ చేస్తానంటే మమ్మి ఒప్పుకునేదికాదు".

బోసి నవ్వుల బాబు నానీ తేనె లొలికే తీయటి మాటలు నేతిమిఠాయిలే. అమ్మగుర్తొచ్చి నాని కళ్ళలో తిరుగుతున్న కన్నీటిని చూసి డి. ఎస్. పి. విజయ్ నానీని ఓదార్చే సన్నివేశం

## డి. ఎస్. పి. విజయ్

కొచ్చిన పోతరాజు సాహసానికి అదిరిపోయింది చెంచీత

"దొరికితే?" అన్నది భయంగా

"చంపుతారు అంతేగా? నిర్లక్ష్యంగా అన్నాడు పోతరాజు

'ఎల్లిపో', అన్నదామె ఆదుర్దాగా

"పోను" ఖచ్చితంగా అంటున్నాడు పోతరాజు కాస్త కూస్త చదువుకున్నాడతను

"ఆడది తన ఇష్టమొచ్చిన వాడితో ఉంటుంది దాని మీద ఇంకోడి పెత్తనమేమిటి? అనుకుంటాడతను

అయినా గూడెపు కట్టుబాట్లు ఉల్లంఘిస్తే ఏమవుతుందో అతనికీ తెలుసు

చెంచీత మీద పడ్డ మనసును వెనక్కి తీసుకోవటం అతని తరం కావటంలేదు

అలా అతను తన కోసం ప్రాణాలకు తెగించి వచ్చెయ్యటం చెంచీతకు ఆశ్చర్యంగా ఇష్టంగా భయంగా ఉంది

ఒక ఆడదాని మీద మగాడికి ప్రాణాలకు తెగించేంత ఆకర్షణ ఉంటుందనే విషయం ఆమెకు తెలీదు

కానీ ఇలా ఇంకోసారి కలుసుకోటం అసాధ్యమనే విషయం ఆమెకూ తెలుసు

అయినా పోతరాజు మళ్ళీ వచ్చాడు

నేరేడు చెట్టు మీద అతను క్రాస్‌గా విసిరిన బాణమే అతనొచ్చాడనటానికి గుర్తు

అది చూసే ఆమె అలా పారిపోయివచ్చింది

"నాతో వచ్చెయ్యి మా గూడానికెళ్ళి పోదాం అంటూ బ్రతిమాలుతున్నాడు పోతరాజు

ఆమెకూ అతన్ని ఒదులుకోవాలని లేదు అందర్నీ కాదని అతనితో వెళ్ళిపోవాలని పిస్తోంది

అతను తనకు కావాలి

మొగుడు . తండ్రి చెల్లి ఈ బంధాలన్నిటి కన్నా పోతరాజే ముఖ్యం అనిపిస్తోంది

ఈ ముగ్గుల సీజనంతా
రాత్రిళ్ళు లేటుగా ఇంటికి
వెళ్ళడానికి వీల్లేకుండా
పోతోందోయ్!!
రమ

అద్భుతంగా వున్నది.

–డా. వేసారపు మాధవయ్య, పుత్తూరు

★ ★ ★

కళ్ళు తెరుచుకుని దెయ్యంలా చీకట్లో చూస్తూ పండుకొంది సౌందర్య. "ఆ శ్రీధర్ గాడ్ని ఏమి చేయాలి. హత్య చేస్తే తాను ఉరికంబం ఎక్కినా కొందరు ఆడపిల్లలైనా వాడి బారి నుండి రక్షింప బడతారు. వాడిని ముక్కలు ముక్కలుగా నరకైనా నరకాలి. లేదా కటకటాల వెనుక క్రుళ్ళి, క్రుళ్ళి చచ్చేలా చేయాలి. అపుడుగాని నాపగ చల్లారదు. కాని ఎలా? తాను ఏమయినా మిగతా వాళ్ళు నాలాగ శ్రీధర్ గాడు లాంటి స్వార్ధ పరులకు బలి కాకూడదు...." చప్పున ఆలోచన మెరిసింది. ఆమెలో అతని గురించి చాలా విన్నది. కోరితే అతని సహాయమే కోరాలి. ఆతడే సమర్ధుడు. ప్రతీ ఆఫీసరు 'విజయ్' బాటను అనుసరిస్తే సౌందర్య లాంటి అమాయకురాళ్ళకు



రక్షణ కలుగుతుంది. ఈ సన్నివేశం ఈ నవలకే ఎంతో ఉన్నతమైనది.

–దేవగురు గణేష్, సామర్లకోట

★ ★ ★

"ఇక నేనేం చెయ్యను? ఎలా బ్రతకను? ఈ ప్రపంచానికి నా మొహం ఎలా చూపించను? నడిబజారు పాలయిన నా కళం కిత చరిత్రను కళ్ళారా చూసిన ఈ మనుషులు నన్ను బ్రతకనిస్తారా? ఏం చెయ్యాలి నేను?" అంటూ హిస్టీరిక్‌గా ఏడుస్తోంది సౌందర్య. శ్రీధర్‌కి శిక్ష పడగానే ఆమెలో అంతవరకు ఉన్న "పగ" తాలూకు బింకం సడలిపోయి, పూర్వపు పిరికితనం చోటు చేసుకుంది.

"సౌందర్యా! ఇంతవరకూ నేను కూడా ఊహించనంతటి ధైర్యాన్ని ప్రదర్శించారు. ఇప్పుడు హఠాత్తుగా ఇంత పిరికివారైపోతున్నా రెందుకు?

ఈ ప్రపంచం ముఖం చూడ్డాని కేమయింది మీకు? కుళ్ళు, క్రూరత్వం, దగా, వంచనలతో నిండి ఉన్న ఈ సమాజం మీలాంటి అమాయకు రాళ్ళను చూసి తనే సిగ్గుతో తలదించుకోవాలి.

జరిగిందాంట్లో మీ తప్పేముంది?

యవ్వనం ఒక పూదోట లాంటిది.



ఆ తోట విరబూసి కళకళలాడుతున్న వేళ, జాగ్రత్తగా సంరక్షిస్తాడని, దానికి బాధ్యత వహిస్తాడని, నమ్మి మీరొక తోటమాలిని ఆశ్రయించారు.

కాని మానవత్వంలేని ఆ మనిషి ఒక పశువుగా మారి తనలాంటి కొన్ని పశువుల సాయంతో ఆ తోటను ధ్వంసం చేశాడు. అలా జరిగిందని ఏడుస్తూ, "నిరాశతో" ఏ మూలో మిగిలిఉన్న పచ్చదనాన్ని కూడా నాశనం చేసుకునేవాళ్ళు నా దృష్టిలో శుద్ధ మూర్ఖులు, అవివేకులు.

ధైర్యం తెచ్చుకుని, శ్రమపడి ఓర్పుతో ఆ తోటను బాగు చేసుకొని, తిరిగి అలాంటి పశువులకు అవకాశం ఇవ్వకుండా, గతానుభవం తాలూకు చేదు ఇచ్చిన వివేకంతో, మనిషికి పశువుకీ తేడా తెలుసుకుని జీవితాన్ని గడపగలవాళ్ళు వివేకవంతులు" అంటాడు విజయ్.

ఇక్కడ సౌందర్య, విజయ్‌ల సంభాషణలు, ఆ ఉపమానాలు రచయిత్రి ప్రతిభకు చక్కని నిదర్శనాలు.

-ఎన్. వెంకటేశ్వర్లు, చీరాల ■

---

కుచ్చు?

వాడు గుర్తు రాగానే ఆమె తల్లి పేగు కదిలి కలుక్కుమంటోంది.

వాడు లేకుండా ఎలా?

వాడు, పోతరాజు ఇద్దరూ కావాలి తనకి.

అది అసాధ్యం.

తన మొగుడు వాడిని తన కివ్వడు.

ఇలా ఎవరితో నన్నా వెళ్ళి పోతే.... మొదటి భర్త బిడ్డల్ని ఇవ్వడు.

"నువ్వు నా దగ్గరకు ఖాళీగా వచ్చావు. వెళ్ళేటప్పుడు కూడా.... ఎలా వచ్చావో అలాగే ఒంటరిగా వెళ్ళాలి. నా వల్ల కలిగిన వాళ్ళు గనక ఈ బిడ్డలు నా బిడ్డలే!" అని బిడ్డల్ని ఉంచుకుంటాడు. అది చెంచుల సాంప్రదాయం.

దొరికితే.... భార్యనీ, ఆమె ప్రియుడినీ చంపేస్తాడు. తెలియ కుండా పారిపోతే.... తిరిగి ఆ పడుచు ఈ గూడెం వేపు అడుగు పెట్ట టానికి వీల్లేదు. తల్లి తండ్రి లాంటి పుట్టింటి బంధాలతో పాటు, కన్న మమకారానికి కూడా సమాధి కట్టియ్యాలి.

దొంగచాటుగా ఆ తల్లి తన బిడ్డల్ని కలుసు కున్నట్లు తెలిస్తే.... తల్లితో పాటు బిడ్డల్ని కూడా సంహరించే అతి క్రూరమైన సాంప్రదాయం వాళ్ళది.

ఆ అనాగరిక అటవిక ప్రపంచం కూడా పురుషాధిక్యత కలిగి నదే. సాంప్రదాయాలు మగాడికే ఫర్‌గా ఉంటాయి. ఆడది మగాడికి బానిస. వాడి ఆదేశాల ప్రకారం ఆమె నడుచు కోవాలి. మగాడు ఎంత మందినయినా పెళ్ళాడొచ్చు! అతవి భార్య మాత్రం పరాయి మగాడి వేపు కన్నెత్తి చూడ కూడదు. ఆఖరుకు.... తల్లికి తన బిడ్డల మీద కూడా ఏ అధికారమూ ఉండదు. ఆ అధికారం కూడా మగాడిదే!

భర్త నుంచి విడిపోతే.... ఏ పరిస్థితిలోనూ బిడ్డ నివ్వరని తెలిసిన చెంచీత ఒణికి పోతోంది....

ఆమెకు కొడుకంటే ప్రాణం.

వాడు లేకుంటే ఎప్పుడో పోతరాజుతో వెళ్ళి పోయేది...

"చెంచీతా! ఇంకోసారి మన మిలా కలుసుకోలేక పోవచ్చు. తిరిగి నువ్వు మీ గూడెంలో అడుగు పెడితే ఇహ నాకు దక్కవు. వచ్చెయ్యి చెంచీతా." ఆమె చేతిని గుండెల కానించుకుని బ్రతిమాలుతున్నాడు పోతరాజు.



అతని శరీరంలో నుంచి వస్తున్న విద్యుత్తరంగా లామెను తాకి ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి....

మగాడు ముట్టుకుంటే కలిగే అనుభూతి ఇంత తియ్యగా ఉంటుందని ఆమెకి తెలీదు..

ఆమెకిదంతా కొత్తగా ఉంది.... మత్తుగా ఉంది .. దీన్ని ఒదులు కోవాలని లేదు...

పెళ్ళయిన కొత్తలో.. . మొదటి రోజు భర్త ముట్టుకున్నప్పుడు కూడా ఆమె కిలాంటి స్పందన కలగ లేదు . .

ఈ ఆవేశం గురించి ఆమెకు తెలీదు....

భర్తలో క్రూరత్వం .. మోటుతనం తప్ప ఇలాంటి సరసత నామె ఎన్నడూ చూడలేదు ..

ఈ బతిమాలటం.... తనంటే ఇలా పడి చచ్చిపోవటం.... నాగరికత సంతరించుకున్న అతని మాటలు.. ఆ గొంతులో మెత్తదనం.... చెంచీత మీద ఘాటైన మత్తు పదార్థంలా పని చేస్తున్నాయి....

కుచ్చు గుర్తుకు రాగానే ఈ మత్తు ఒక్కసారిగా ఒదిలి పోతోంది. రెండు బలమైన వ్యతిరేక శక్తుల మధ్య నలిగిపోతూ... ఎటూ తేల్చుకోలేని నిస్సహాయ పరిస్థితిలో కుమిలిపోతోంది చెంచీత.

ఎవరితో నైనా చెప్పుకోటానికి లేదు.

చెపితే... కొంపలంటుకుపోతాయి.

పోతరాజు చెపితే. . కుచ్చును ఒదిలేసి తనతో నే వచ్చెయ్యమంటాడు. 'నావల్ల పుట్టే బిడ్డల్ని చూసి కుచ్చును మరిచిపో" అంటాడు.

అదెలా సాధ్యం? ఊహూఁ! అలా కుదరదు.

ఉన్నట్టుండి చెంచీతని రెండు చేతులతో చుట్టి గుండెల కదుముకుని, ఆమె పెదవులను నాలుకతో అద్ది ముద్దు పెట్టుకున్నాడు పోతరాజు.... కింది పెదవిని పళ్ళ మధ్య పెట్టి సున్నితంగా నొక్కి... ఆమెను అమాంతం పైకి లేపాడు ఎత్తుకు పోవటానికుద్యుక్తుడవుతున్నట్టు.

సరికొత్తగా ఉన్న ఆ చర్యకు చెలించి పోతున్న చెంచీతకు ఆ క్షణంలో కుచ్చు గుర్తు రాలేదు.

"అగు వచ్చే అమాసనాడు రాత్రి, సుక్క పొడవక ముందు నే నీడ కు వస్తాను . అ ప్పుడిద్దరం ఎల్లిపోదాం" అన్నదామె దృఢంగా.

"నిజంగానా? ఒట్టు?" చెయ్యి చాపాడతను.

ఆ చేతిలో చెయ్యేస్తూ "బోనాలమ్మ సాక్షి. నిజంగా వస్తాను."

"నువ్వారోజు గనక ఈడ నాకు కనపడక పోతే... నాతో రాకపోతే ఆ తెల్లారి ఇక్కడికొచ్చి చూసుకో. నేను ఇక్కడే చచ్చి పడుంటాను. గడిపితే నీతో నే బతుకు గడపాల. లేకుంటే. బోనాలమ్మ కాహుతై పోవాల' ఆవేశంగా అన్నాడు. పోతరాజు

ఆమెను గుండెల కదుముకుని వెర్రెత్తిన వాడిలా ముద్దులు పెట్టుకో సాగాడు తను...

ఆ ఉధృతానికీ .. కోరికకూ పూర్తిగా దాసోహమై వివశురాలైంది చెంచీత ఇప్పుడామె మనసులో కుచ్చును గురించిన ఒక్క స్మృతి కూడా లేదు

"తప్పకుండా వస్తానంటున్నాగా! అలాంటి పని చెయ్యకు. ఇహనెళ్ళు. ఆళ్ళ కనుమానమొస్తది." అతన్ని విడిపించుకుంటూ అన్నదామె

ఆమె చెంపల్ని మునిపంటితో నొక్క బోతున్న పోతరాజును తప్పించు కుంటూ "నా మొగుడి కనుమానమొస్తది. అలా గాబ్బిట్టమాకొ అమాసనాడు పారొస్తాగా" అంటూ అతన్ని ఒదిలించుకుని రివ్వున పరుగెత్తిందామె.

"అంతిదేంటో అదికి! తనంటే పడిసస్తడు!" పోతరాజును తలుచుకుంటూ మెరుపులా వచ్చి తనవాళ్ళకు కాస్త చాటుగా నిలబడి బంకతియ్యసాగింది చెంచీత.

"ఈడున్నవా! సచ్చినం ఎతకలేక" అన్నది నీల్లి.

"ఈడ బంక ఉంటే... ఎతుక్కుంటూవచ్చా," అన్నది చెంచీత. అంతా కలిసి బంకలాగే హడావుడిలో పడటం చూసి "అమ్మయ్య" అనుకుందామె నిశ్చింతగా...

పనంతా అయ్యాక . తీరిగ్గా పడుకోగానే ఆమెలో ఆలోచనలు తిరిగి మొదలయ్యాయి...

ఎవరికోసం ఎవర్ని ఒదులుకోవాలి?

ఎవరు కావాలి?

ఇద్దరూ కావాలి.

చచ్చినా కుదరదు.

పోతరాజు కావాలి.... కుచ్చు ఒద్దు.

ఊహూఁ! కుచ్చు కావాలి.

అయితే.... కుచ్చు కావాలి. పోతరాజొద్దు.

అమ్మో! అదు కూడా కావాలి. ఆడు లేకుంటే తను బతకలేదు.

అలాకుదర్దు.

ఎన్నిసార్లు ఆలోచించినా ఇవే ప్రశ్నలు, ఇవే సమాధానాలు

ఏదో ఒక సమాధానాన్ని ఎంచుకోలేక పోతోందామె.

"పోనిద్దూ! వెధవగోల. ఎప్పటిలా ఇంట్లోనే పడుంటే ఒదిలి పోతుంది." అనుకుంటుంది కాసేపు.

కానీ.... పోతరాజు రూపం .... ఆవేశం... కోరిక.... అభిమానం. తలుచుకుంటే... ఏమైనాసరే అతన్ని ఒదులు కోకూడదు

అతనే కావాలి.... అతనితో వెళ్ళిపోవాలి అనిపిస్తుంది.

కుచ్చు! అమ్మో! వాడు లేకుండా తనెలా బ్రతుకుతుంది?

పారిపోతే?

వాడితో సహా పారిపోతే?

దొరికితే ఇద్దర్నీ చంపేస్తారు.

తను చచ్చినా పర్లేదు. వాడికేం కాకూడదు.

తన పినతల్లికి తనంటే చాలా ప్రేమ.

ఆమెను సహాయమడిగితే?

కనీసం... ఆ ఆలోచన రావటానిక్కూడా ఆమె ఇష్టపడదు. ఆ అదురులో తన తండ్రికీ సంగతి చెప్పేస్తుంది.

అసలు.... అమాస రోజు తనూ, పోతరాజూ ప్రాణాలతో బయట పడగలరని గట్టి నమ్మకమేలేదు. తమ హద్దులు చాలా విశాలమైనవి ఆ పరిధి దాటే లోపల పట్టుపడగూడదు.

జరుగుతుందా అలా?

ఏమో!



బోనాలమ్మ దయుంటే బయటపడొచ్చు.

కుచ్చూ కూడా తమ వెంటఉంటే అది సాధ్యపడదు.

తామిద్దరూ అయితే తప్పించుకోటానికి కాస్తయినా వీలుంటుంది. వీడితో సహా పరుగెత్తాలంటే కష్టం.....

కుచ్చూను ఒదిలి వెళ్ళటమే మంచిది. కనీసం వాడయినా ప్రాణాలతో ఉంటాడు

కుచ్చూను తీసికెళ్ళటం అసాధ్యమని తేలాక ఆమె పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారయింది....

నిద్దట్లో కుచ్చూ కదిలి, తల్లివేపు తిరిగి ఆమె మెడచుట్టూ చెయ్యేసి గుండెల మధ్య ఒదిగిపడుకున్నాడు.

అప్రయత్నంగా చెంచీత కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఇంక కొద్ది రోజుల్లో తను వీడినొదిలేసి పోబోతోంది. అప్పుడెవరి పొట్టలో తలదాచుకుంటాడు?

తోటి పిల్లలతో ఆడుతూ తగాదాలుపడి, తన్నులు తింటే.... ఎవరితో చెప్పి ఓదార్పు పొందుతాడు?

సూరీడొచ్చే రాక ముందే పాలు పిండి, కాచి వీడి చేత ఎవరు తాగిస్తారు?

తనంత ప్రేమగా వీడి నెవరు చూసుకుంటారు?

ఆమెలో ఉన్న తల్లిపేగుకు ఎవరో బలవంతాన నిప్పు పెడుతున్నట్లుంది

ఆ బాధను బిగబట్టుకుంటూ నిశ్శబ్దంగా దుఃఖిస్తోందామె...

కుచ్చూ జుట్టునూ, ఒంటినీ ఆర్తిగా నిమురుతోంది....

నిన్ను ఒదిలిపోనురా. నిజంగాపోను." అనుకుంటోంది.

అంతలో నే పోతరాజు కళ్ళముందు నిలిచాడు...

చెంచీతా ... రావూ!? నీకోసం ప్రాణాలకు తెగించి వచ్చాను.... నువ్వు రాకపోతే బోనాలమ్మ కాహుత్తై పోతాను... బ్రతికితే అదినీతో నే.... చెంచీతా! రావూ!? అతని మాటలు... చేతలు... అతనికి తనిచ్చిన వాగ్దానం గుర్తొచ్చి ఆమె మనసును కుదించి అటువేపు లాక్కుంటున్నాయి...

ఈ సంఘర్షణను భరించలేక.... ఏం చెయ్యాలో తోచక నిస్సహాయంగా ఏడుస్తోంది చెంచీత....

ఆ అమావాస్య లోపున జరిగిన ఓ సంఘటన ఆమె నిర్ణయంలో అనూహ్యమైన మార్పును తెచ్చింది.

ఉండాలా ... వెళ్ళాలా అనే రెండు సమస్యలకూ ఓ పరిష్కారం కుదిరిపోయింది....

అంతకు కొన్ని నెలలముందు సింగారి అనే చెంచుయువతి మొగుణ్ణొదిలేసి, వేరే గూడెపు చెంచుయువకుడితో లేచిపోయింది. ఆమెకూ ఒక కొడుకున్నాడు వాడు ఆమె మొదటి భర్త దగ్గరే ఉండి పోయాడు. ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆమె కొడుకును కనీసం కళ్ళతో చూసుకోటానికి కూడా వీలవలేదు

అందుకే . సాధారణంగా ఇలాంటి సంఘటనలా చెంచుగూడెంలో జరగవు.

ప్రియుడితో వెళ్ళి పోయిన సింగారికి ఒక నెల రోజులు గడిచే నరికి కొడుకును చూడాలనే కోరిక కలిగింది.

కొత్త ఉధృతం కొంత తగ్గి, అక్కడ ఇమడిపోయాక ఆమెమనసు కొడుకును గురించి ఆలోచించటం.... తహ తహలాడటం ప్రారంభించింది.

వాడిని కలుసుకోటం అసాధ్యమయే కొద్దీ వాడిపట్ల ఆమెకు గల మమత.... అభిమానం ఒక్కసారిగా పొంగి పొరలసాగాయి....

(ఇంకా ఉంది)

# వారఫలం

## 8-1-1988 శుక్రవారం మొదలు 14-1-1988 గురువారం వరకు

★ **మేషం:** గొప్పవారి స్నేహమున్నది మాటకు గౌరవాధిక్యమయిన సమయం ఉద్యోగరీత్యా అనుకూలం ప్రసిద్ధుల సహాయం లభ్యమవుతుంది. వ్యాపారంలో అనుకూలమే స్త్రీలకు కళాకాంతులుంటాయి కళా రంగావకాశాలు, అంతో యింతో లాభించే వారమే

★ **వృషభం:** గత కొన్ని వారాలకన్నా వృషభ రాశికి అనుకూలం. ఇంట శుభం జరుగనున్నది సమయానికి పైకం అందే మార్గమున్నది. ఆప్తమిత్రులు యింటికి రానున్నారు ఒకానొక విషయంలో అధిక ఆదాయం, అనుకూలత చేకూరనున్నది. స్త్రీలకు · ధనలబ్ధి, ఉద్యోగాభివృద్ధి

★ **మిధునం:** వారఫలం సర్వానుకూలం ప్రసిద్ధులయిన వారి సాహచర్యం చేకూరుతుంది ఉద్యోగస్థులకు లాభమున్నది 'బ్యాంకు' ఉద్యోగులకు సర్వానుకూల వారం లావాదేవీలందు అనుకూలం.గ్రహించండి స్త్రీలకు రాజకీయాలందు ఎలాంటి అనుకూలత లేదు వ్యాపారమా! అదీ అంతే

★ **కర్కాటకం:** ఈ రాశి జాతకులకు సర్వానుకూలత చేకూరగల సమయం. వృత్తి ఉద్యోగాలందు చెప్పదగిన అనుకూలత చేకూర గల సమయం. మీ యింట శుభం చేకూరుతుంది మాటకు విలువ చేకూరుతుంది స్త్రీలకు వారమంతా ధనాదాయానికి లోపం రాదు స్థితి లోపమూ లేదు.

★ **సింహం:** కళా సాహితీ రంగాశాలు చేకూరుతాయి. అందుమూలాన ధన లోపం రాదు కొందరకు శుభ కార్యాలోచనలు చేకూరుతాయి రాజకీయాలందు జోక్యం ఎంత మాత్రం తగదు. స్త్రీలకు ఉద్యోగరీత్యా మేలు కొందరకు 'ఇంక్రిమెంట్సు'కు ఆస్కారం. గ్రహించండి

★ **కన్య:** ఉత్తమ వార ఫలం సర్వే సర్వత్రా మేలున్నది. రాజకీయ వ్యవహారాలందు జోక్యం చేసికొని యిటీవల బాధపడినారుగా! అవమానానికి కూడ గురి అయినారుగా! ఇకనైనా వదులుకోండి.స్త్రీలకు యోగదాయకం అన్నిరంగాలందు మేలే

★ **తుల:** 'శని' గ్రహశీస్సులున్నాయి రావలసిన పైకం సమయానికి అందటమే గాక, మీ అవసరాలన్నీ సాంగంగా నెరవేరుతాయి సాహితీపరంగా కొందరకు అవకాశాలుంటాయి అందే ధనలబ్ధి స్త్రీలకు వృత్తిరీత్యా శ్రమదాయకం కృషి చేయక తప్పదు

★ **వృశ్చికం:** ఒకానొక విషయంలో అమిత శ్రమకరమయిన పరిస్థితి ఏర్పడుతుంది నలుగురిలో ప్రసిద్ధి ఏర్పడుతుంది రాజకీయాలందు ప్రవేశించి కొందరు చెప్పరాని బాధ అనుభవించారుగా! ఇక మీదట దూరంగా ఉండాలి స్త్రీలకు మొగమాటంతో లేనిపోని యిబ్బందులకు గురి అవుతారు గ్రహస్తారుగా!

★ **ధనుస్సు:** సమయానికి డబ్బు అందటం, అవసరాలు తీరటం వారఫల విశేషం గ్రహిస్తే ముందుగా జాగ్రత్త వహించవచ్చు వృత్తిరీత్యా సర్వానుకూల సమయం ప్రసిద్ధులతో మంతనాలు సాగించటం కూడ వారవిశేషం స్త్రీలకు సుఖశాంతులు, బంధుసమాగమం వ్యాపారం చేసేలాగైతే మేలే

★ **మకరం:** ఈ రాశి జాతకులకు సర్వానుకూలత చేకూర గల వారం ఉద్యోగమందు అనుకూల మార్పు రానున్నది ఆనందదాయకమయిన సమయం సాహితీరంగాన శక్తియుక్తులు గల వారికి అనుకూలం స్త్రీలకు మంచివారి సహవాసం. తద్వారా సహాయం లభ్యం కాగల వారం

★ **కుంభం:** మీ వ్యాపారం అనుకూలంగా సాగిపోగలదు మీ యింట శుభ కార్యాలోచనలుంటాయి నివాసాన గౌరవం లభ్యం కాగలదు ప్రయాణం సాగించితిరా! మేలే ఒకానొక విషయంలో ఎంతో మేలు చేకూరనున్నది గమనించండి స్త్రీలకు కుటుంబానందం, ఆదాయమందు అభివృద్ధి

★ **మీనం:** అలా యిలా తిరుగుతూ, కాని వ్యవహారాలకై శ్రమించి, అనవసర విషయాలలో జోక్యం కలిగించుకొని బాధపడటం గ్రహించారుగా! మరలా అలాంటి వ్యవహారాలు ఎందుకు? కార్యభారంతో సతమతం కావటం ఎందుకు? రాజకీయాలందు ఓడినారుగా! ఇకనైనా జాగ్రత్తపడండి స్త్రీలకు · ఆరోగ్యరీత్యా జాగ్రత్త అవసరం వృత్తియందు వికాసమున్నది. గ్రహించండి

# స్వస్తిక్ యూరియా ఇచ్చే వరం
# సుఖ సంపదలిక రైతు పరం

ఆలలుగా తలలూచే పచ్చని పొలాలు
సమృద్ధైన దిగుబడి – అన్నీ పచ్చని అనుభూతులు
సాగుబడి భూములు అలాగే వున్నాయి
దిగుబడి మాత్రం ద్విగుణీకృతం
పొలాలకి చెమటోడ్చే కాయకష్టం చాలదు
**స్వస్తిక్ యూరియా** వాడాలి అదే సరైన పద్ధతి అలాగే
పొందాలి ముందెన్నడూ లేని లాభాలు

★ మెరిసే తెల్లని గుండ్రని గుళికలు.
★ నీటిలో పూర్తిగా కరుగుతుంది.
★ పంటల పరిపూర్ణ పుష్టికి అధిక తమ నత్రజని.
★ పూర్తిగా నత్రజని ఉపయుక్తం.
★ ద్రవంతో క్రిమినాశిని గాని, కీటకనాశిని గాని కలిపి చల్లుకునే వీలు.
★ దృఢమైన 50 కిలోల ప్యాకింగ్‌లో లభ్యం.




# స్వస్తిక్
## యూరియా
46% నత్రజనితో కూడినది



ది ఫర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్.
6-2-30/సి, లకడి-కా-పూల్, హైద్రాబాద్-500 004 (ఆం ప్ర)




## పెళ్ళంటే నూరేళ్ళ పంట

పెళ్ళంటే నూరేళ్ళ పంట అన్న సామెత పూర్వకాలం నుండి వాడుకలో ఉంది. ఆ పంట నూరేళ్ళు ఉంటుందో, నాలుగేళ్ళు ఉంటుందో అసలు ఎన్ని రోజులు ఉంటుందో నమ్మకం లేకుండా పోతోంది నేటి కాలంలో. పడక గదిలో భార్యతో శృంగారం అవసరం అయినంత వరకు ప్రతి మగవాడు భార్య మాటలకు తల వూపుతూ ఆమె ఇష్టానుసారం ప్రవర్తిస్తుంటాడు. మంచం మీద ఉన్నంత వరకు మొగుడు మంచం దిగితే యముడు అన్నట్టుగా పడకగది దాటగానే భార్య మాటలకన్నా తల్లి మాటలకే ఎక్కువ విలువ ఇస్తాడు.

భార్య అంటే ఎంత ప్రేమ చూపించే ఏ మగవాడు అయినా తల్లీ, భార్యకూ వచ్చే వివాదాల్లో తల్లినే ఎక్కువగా సమర్థిస్తాడు. భార్య తన స్వంతం అనే అభిప్రాయంతో కావచ్చు ఆమెనే మందలిస్తాడు. కని పెంచిన తల్లిని నొప్పించ కూడదు. భార్యను రెండు తిట్టినా తిరిగి హృదయంలోకి జేర్చు కొనేది తనే అన్న భరోసాతో తల్లిని సమర్థిస్తాడు.

అక్కడే మొదలవుతుంది అసలు కథ. తన భర్త అనే నమ్మకంతోనే అపురూపంగా పెంచిన పుట్టింటి వాళ్ళను వదులుకుని అత్తవారింట్లో ప్రవేశించే ఆడపిల్ల తన భర్త అత్తగారివల్ల జీవితాంతం ప్రేమగా చూసుకునే తనను తప్పుపట్టేసరికి తట్టుకోలేదు. ఆ క్షణంలో నిస్సహాయతతో ఏర్పడే ఉద్రేకం వల్ల, తన పరిస్థితిమీద తనకే ఏర్పడిన విసుగు వల్ల ఆమె ఏదో ఒక అఘాయిత్యానికి పాల్పడటం తత్ఫలితంగా ఆమె ఈ లోకానికి శాశ్వతంగా దూరం కావటం. తను జన్మనిచ్చిన పసిపిల్లలకు "అమ్మ" ఆదరణను దూరం చేయటం జరుగు-తోంది. ఉమ్మడి కుటుంబాల్లో కానీ, వేరు కాపురాల్లోని భార్యా.భర్తల మధ్య కానీ, సరైన అవగాహన లేకపోవడం వల్ల ఇలా జరుగుతోంది. ఎంతో పెద్ద ఉద్యోగినులు కూడా సరైన ఆర్థిక స్వాతంత్ర్యం ఉండి తాగుబోతు, శాడిస్టు, బంధుప్రీతి, అధికంగా కల భర్త వల్ల బాధలు పడుతున్నారు. వాళ్ళు భర్తల మీద తిరుగుబాటు చేయబోయినా ఈ సమాజం మగవాడినే సమర్థించి ఆ స్త్రీలను వేలెత్తి చూపిస్తారు. అందుకే నూటికి తొంభై ఇలాంటి సంసారాలు అయినా స్త్రీలు ఓర్పు వహించి కాపురం సాగిస్తున్నారు.

సరైన చదువు, ఉద్యోగం లేక భర్తల మీదే ఆధారపడే అభాగినుల బ్రతుకులు మరింత భయంకరంగా ఉంటున్నాయి. మానవ జన్మల బంధాలు, ఆరాటాలు, ఆవేశాలు కేవలం శరీరాల్లో ప్రాణాలు ఉన్నంత వరకే. ఆ ప్రాణాలు కాస్తా గాల్లో కలసి పోతే ఏమీ ఉండదు.

ఈ జన్మఎవరికీ శాశ్వతం కాదు. కేవలం ఒక మానవుడు నిర్మించిన తాజ్‌మహల్ ఇప్పటికీ ఉండిపోయింది. కానీ ఆ మానవుడు ఎప్పుడో మరణించాడు. అలాగే ఎవరైన ఈ లోకంలో ఉన్నంత వరకూ . అహంభావాన్ని చంపుకుని భర్తలను వేధించే భార్యలూ, భార్యలను అన్నివిధాలా హింసించే భర్తలూ సుఖంగా, మనశ్శాంతిగా బ్రతకాలనే నిర్ణయం. తీసుకుని కలసి మెలసి జీవనం సాగిస్తే పెళ్ళి నూరేళ్ళ పంట అన్నది నిజం అవుతుంది.

-దేవినేని ఉష, విజయవాడ




## నవ యువతరం రావాలి



ఈనాడు మన సమాజంలో వివాహం ఒక వ్యాపారంగా మాత్రమే తప్ప స్త్రీ పురుషుల జీవితాలలో అది నూరేళ్ల పంటగా నిలిచే పవిత్ర బంధంగా ఎంత మాత్రం లేదు. కొంత మంది తల్లిదండ్రులు ఈ వ్యాపారంలో గిరాకీ కోసం తమ పిల్లల్ని డొనేషన్లు కట్టి పెద్ద చదువులు చదివిస్తున్నారు, అమ్మకానికి ముందు పశువుని పోషించినట్టు.




విద్యావంతులైన యువకులు తాము ఎంత ఎక్కువ కట్నం తీసుకుంటే అంత గొప్పగా భావిస్తున్నారే తప్ప మన జాతిపిత మహాత్మా గాంధీ "కట్నం ఇస్తేనే గాని వివాహానికి అంగీకరించని యువకుడు తన విద్యని అవమానిస్తున్నాడు. తన దేశానికి అపకీర్తి తెస్తున్నాడు. నారీ లోకాన్ని అగౌరవపరుస్తున్నాడు.... అక్రమంగా సంపాదించిన వరకట్నం ధనంతో తమ చేతుల్ని మలినంచేసుకునే యువకుల్ని సంఘం నుండి వెలివేయాలి" అన్న మాటలను ఒక్కసారి మననం చేసుకుంటే ఈనాడు యువత చాలా సిగ్గుపడాలి.

అందుకే మన జాతిపిత సందేశానికి కార్యరూపాన్ని యిచ్చే "నవ యువతరం" రావాలి.

అప్పుడే మన సంస్కృతిలో వివాహం యొక్క ప్రాముఖ్యం, ఎల్లకాలం ఒక పవిత్ర బంధంగా మిగిలిపోతుంది.

-శ్రీమతి షేక్ ఖాదర్‌వలి,
ముండూరు. (ప. గో)

కూపన్
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### ఈ కాలం పెళ్ళిళ్ళు

పంపిన వారి పేరు..........................................

పూర్తి చిరునామా..........................................

..........................................

..........................................

పిన్ కోడ్:

# హైదరాబాద్ నోట్‌బుక్

## వైస్ చాన్సలర్ల సమావేశం :

డిసెంబర్ 18 19 తేదీలలో హైదరాబాద్‌లో దేశంలోని వివిధ విశ్వవిద్యాలయాల వైస్ చాన్సలర్ల, ఉన్నత విద్యా సంస్థల అధినేతల మహాసభ జరగడం గొప్ప సంఘటన డిసెంబరు 18వ తేదీన రాష్ట్ర గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషి ప్రారంభిస్తూ, విశ్వ విద్యాలయాలు స్త్రీలకు ఉన్నత విద్యా సౌకర్యాలు విస్తరింపజేసి వారి వ్యక్తిత్వం పెంపొందే అవకాశాలు కలిగించాలని కోరారు. విశ్వ విద్యాలయాలు వెలుపలి ఒత్తిడులకు లొంగరాదు. స్వతంత్ర సంస్థలుగా వ్యవహరించాలి. గవర్నర్లను విశ్వవిద్యాలయాలకు చాన్సలర్లుగా చేయడం విశ్వవిద్యాలయ నిర్వహణ వివాదగ్రస్తం కాకుండా వుండడానికే వైస్ చాన్సలర్లు తమ దంతపు గోపుర శిఖరాల నుంచి దిగి వచ్చి, సామాన్య విద్యా సమస్యలను అవగాహన చేసుకొని పరిష్కరించాలి. విద్యా విధానం సంఘం అవసరాలను తీర్చేదిగా వుండాలి వైస్ చాన్సలర్లు ఉన్నత విద్య ఎంత వరకు ఉపయోగించెందో సర్వేక్షణం చేయాలి– అని గవర్నర్ సూచించారు. ఈ మహాసభ అఖిల భారత విశ్వ విద్యాలయ్ల సంఘం ఏర్పాటు చేసింది. కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ అనిల్ బోర్డియా తమ ప్రధాన ప్రసంగంలో విశ్వవిదాలయాలు పరీక్షలను వేళకు నిర్వహించడం లేదని విమర్శించారు విశ్వ విద్యాలయాచార్యులు మడిగ కట్టుకొని కూర్చోక సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ కార్య కలాపాలలో పాల్గొనడానికి అనుమతించాలని ఆయన కోరారు.

వైస్ చాన్సలర్ల సంఘం అధ్యక్షులు ప్రొఫెసర్ జి. రామ్‌రెడ్డి తమ ప్రసంగంలో ఉపాధ్యాయ శిక్షణ ఆవశ్యకతను ఉపాధ్యాయుల బాధ్యతను గురించి చెప్పారు విశ్వవిద్యాలయాల సంఘం 19వ తేదీన జరిపిన చర్చల పర్యవసానంగా పెక్కు తీర్మానాలు జరిగాయి నూతన విద్యా విధానం సక్రమంగా అమలు జరుగడానికి ప్రతి విశ్వవిద్యాలయంలోనూ కార్యాచరణ సమితిని నెలకొల్పాలన్నది తీర్మానాలలో ఒకటి ఉపాధ్యాయులకు ఆయా విషయాలలోను బోధన పద్ధతిలోను తగు కౌశలం కలిగించడానికి తగిన శిక్షణ ఇవ్వాలని మరొక తీర్మానం చేయబడిందని అధ్యక్షుడు డాక్టర్ రామ్‌రెడ్డి మహాసభానంతరం పత్రికా రచయితల గోష్ఠిలో అన్నారు విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తి, బాధ్యత ఎంత వరకు కొనసాగుతున్నాయనే విషయాన్ని పరిశీలించడానికి కేంద్ర ప్రభుత్వం విద్యాశాఖ మాజీ కార్యదర్శి శ్రీ ఆనంద్ స్వరూప్ అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించడానికి తీర్మానించామని ఆయన అన్నారు. వివిధ శిక్షణ విధానాలను వివిధ స్థాయిలలో సంఘావసరాలకు అనుగుణంగా పునర్నిర్మించాలని, గ్రామీణ సంస్థలకు అనుగుణమైన పథకాలను రూపొందించడం విద్యా బోధనకు ప్రత్యేకంగా టిలివిజన్ రేడియోల ద్వారా పథకాల నిర్మాణం, స్త్రీలకు ప్రత్యేకంగా కేంద్రాలు ఏర్పాటు చేయడం గురించి తీర్మానించారని ఆయన తెలిపారు. నూతనాధ్యక్షుడుగా మహారాష్ట్రంలోని పర్భణి విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ వి. వి. సాల్వి ఎన్నికయ్యారు. ఆగ్రా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ ఎస్. కె. అగర్వాల ఈ సంఘానికి ఐదు సంవత్సరాల పాటు కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఈ విశ్వవిద్యాలయాల సంఘం 62వ సమావేశం డిసెంబర్ 16, 17న జరిగింది. 18, 19 లలో నూతన విద్యా విధానం అమలుపై విశ్వవిద్యాలయాల పాత్రపై జాతీయ మహాసభ జరిగింది. వంద మందికి పైగా వైస్ చాన్సలర్లు, ప్రముఖ విద్యావేత్తలు పాల్గొన్నారు. పంజాబీ విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ భగత్‌సింగ్, జీవాజీ విశ్వవిద్యాలయం (గ్వాలియర్) వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ కె. కె. తివారీ, బరోడా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ ఎస్. కె. షా, గాంధీ విశ్వవిద్యాలయం (కొట్టాయం) వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ యు. ఆర్. అనంతమూర్తి మొదలయినవారు విద్యార్థి సంఘాల ఎన్నికలలో రాజకీయాల ప్రాబల్యం, మాదక ద్రవ్యాల వాడకం, విద్యార్థులు చదువు పూర్తి చేయక ఆగిపోవడం, విశ్వవిద్యాలయాల స్వతంత్ర, ప్రతిపత్తి, ఉద్యోగావకాశాలు కల్పించే కోర్సులు, నూతన విద్యా విధానం అమలు, భారత దేశంలో ఉన్నత విద్యా భవిష్యత్తు మొదలయిన విషయాలపై పత్రికా ప్రతినిధుల ప్రత్యేక గోష్ఠులలో తమ అభిప్రాయాలు తెలిపారు. విశ్వవిద్యాలయాలకు హెచ్చు స్వతంత్ర ప్రతిపత్తి అవసరమని, విశ్వవిద్యాలయాల నిధులు హెచ్చుగా అవసరమని, అందరికీ విద్య అనే లక్ష్యం సాధించ దలిస్తే, గ్రామీణ ప్రాంతాలకు విద్యాసౌకర్యాల వ్యాప్తి మున్నగు విషయాలలో ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు. మాదక ద్రవ్యాల వాడకం భారతీయ విశ్వవిద్యాలయాలలో తీవ్రంగా లేదని, దానిని అరికట్టడానికి తగు చర్యలు పౌర సలహా సంఘాలు మొదలయిన వాటి ద్వారా తీసుకుంటున్నామని వారన్నారు

## ఎన్నాళ్ళకెన్నాళ్ళకు?

హైదరాబాద్ నోట్‌బుక్ పెక్కుసార్లు జంట నగరాలలో జనసమ్మర్దం తగ్గించడానికి అక్కడక్కడ కీలక ప్రాంతాలలో సురంగ మార్గాలు అవసరమని మొర పెట్టుకుంది ఇన్నాళ్ళకు దానిఫలితంగా ఈ నెల ప్రారంభం నుంచి జంట నగరాలలో సురంగ మార్గాల నిర్మాణం ప్రారంభమైంది దీని తొలిదశగా ఆర్. టి. సి. క్రాసురోడ్డులో సురంగ నిర్మాణం కొనసాగుతున్నది దానివల్ల తాత్కాలికంగా కొంత ఇబ్బంది కలిగినా భావి ఫలితాన్నిబట్టి ఆ ఇబ్బందిని సహించక తప్పదు ఈ చోట సురంగ మార్గం తర్వాత అబిడ్స్ సుల్తాన్‌బజార్ చౌరస్తాలలో సురంగ మార్గాల నిర్మాణం కొనసాగుతుందని తత్సంబంధిత అధికారులు ప్రకటించారు మరి రెండు చోట్ల మాత్రమే సురంగ మార్గాలు చాలవు ఎక్కువ బస్సుల రాకపోకలు గల చార్‌మినార్ నాంపల్లి స్టేషను బషీర్‌బాగ్ లిబర్టీ సెక్రటేరియట్, గౌలిగూడ బస్‌డిపో కింగ్స్ సర్కిల్ గార్డన్ హోటల్ సర్కిల్ సికిందరాబాద్ రైల్వే స్టేషన్, అఫ్జల్‌గంజ బస్ స్టాప్ బహాదూర్‌పురా చౌరస్తాలలోను సురంగ మార్గాలు కావాలి అధికారులు గమనించాలి

## ఉపశ్రుతి :

ప్రబంధపరమేశ్వర పరిశోధనపరమేశ్వర అని కవిబ్రహ్మ, వాఙ్మయ బ్రహ్మ అని బ్రహ్మ శివుల పేర్లతోనే బిరుదులుంటాయే స్థితికారకుడయిన విష్ణువు వేదకవి విష్ణు పరిశోదన విష్ణు సాహిత్యపారాయణ వాఙ్మయ విష్ణు అని విష్ణువు పేరుతో ఎందుకు బిరుదులుండవు?– అనడిగారు మిత్రులు శ్రీ వాకాటి పాండురంగారావు బ్రహ్మ శివుడు ఎప్పుడు చురుకుగా తిరిగేవారు విష్ణువు పడుకునో శ్రీ భూదేవుల మధ్య తీరిగ్గా కూర్చునో వుంటాడు సోమరిగా, కనుక ఆయన పేరు ఎందు కనుకున్నారేమో!– అన్నారు ఆ ప్రశ్నకు నా మిత్రులొకరు.

—తిరుమల రామచంద్ర

అఖిల భారత విశ్వ విద్యాలయ మహా సభలో పాల్గొన్న వైస్ ఛాన్స్‌లర్లు





# దూరదర్శనం

లత

## శక్తి

కొత్త సీరియల్ నాటిక ఈ రోజు నుంచీ ప్రఖ్యాత తమిళ రచయిత జయకాంతన్ కథలు ఆధారంగా నాటికా గుచ్ఛం ప్రసారం చేస్తున్నారు అందులో మొదటి కథ శక్తి

ఒక మేనమామ తన మేనకోడల్ని తను మంచివాడనుకున్న వాడికి ఇచ్చాడు ఒక రోజు ఆకాశరామన్న ఉత్తరం వస్తుంది అతని భార్య శీలం మంచిది కాదని అది వరకే తను ఇరవయ్యేళ్ళు పెద్దవాడినని బాధ పడుతున్న గిరీష్ కర్నాడ్ ఇది నమ్మి మామాజీని అడుగుతాడు ఆయన అబద్ధం అంటాడు భార్య నడుగుతాడు అది పొరపాటు అని బయలు దేరపోతుంది కాని అతనామెను వెనక్కి తీసుకొస్తాడు జయకాంతన్ కథలు బాగుంటాయి నీటుగా హాయిగా ఉంది కథ

శనివారం నాడు సోవియట్ గంతులు చూపించారు క్రికెట్ – సోవియట్ ఈ సంవత్సరం ఈ బాధ ఎక్కువయింది నిన్న సినిమా లేదు గాని అర్ధరాత్రి సినిమా రతన్ పాత సినిమా చూపించారు సగం అన్నా చూడక ముందే నిద్ర వచ్చింది చాలా మంది అనుభవం అదే అనుకుంటాను వాటిని చూపాలనుకుంటే పగలు లేదా తొమ్మిదింటికి ప్రారంభించటం సముచితం ట్రాన్స్‌మిషన్ ఎలాగూ పెరుగుతుంది అలాటప్పుడు మధ్యాహ్నం నాలుగింటికి మొదలు పెట్టి తెలుగు వార్తల వరకూ చూపించవచ్చును కాని మండీ హౌస్ ఉల్లాసీదొషిద్యూల్సు బాగా లేవు



## రామాయణ్

హనుమదాదులు – స్వయం ప్రభామందిరంలో ఆతిథ్యం తీసుకుంటారు – హేమ అనే అప్సరస భవనాన్ని స్వయం ప్రభ కాపాడుతున్నది హేమ కూతురే మండోదరి తరువాత సంపాతి వృత్తాంతం – సముద్ర లంఘనానికి హనుమని పొగుడు



'రామాయణ్' లో అరుణ్‌గోవిల్, దీపిక

తున్నారు వానరులు రామ కథలో సుందరకాండ బాగుంటుంది – డాక్టరు స్వామి గారు – పఠించడం వలన జరిగే చెడేమీ లేదు సుందరకాండ వలన చిన్న అసౌకర్యమే కలిగి పెద్ద కష్టం తప్పిపోయింది మీకు రామనామం మీద భారతీయుల నమ్మకం అలాటిది దానికి మడీతడీ అవసరం లేదు – రంగనాథం గారూ – రామానందసాగర్ పుణ్యాత్ముడు – ఆయన్ని మర్డర్ చేయనవసరం లేదు వాల్మీకంలో సీతని పోలుస్తాడు అలాగే ఎత్తుకుంటాడు తరువాత రామాయణం మారి ఈ తీరుకొచ్చింది గాని – సీత రావణుడి కూతురంటీ వివరాలు నేను వ్రాసిన స్వర్ణ సీతలో చదవండి బుధుడు రోహిణిని ఎత్తుకున్నట్టు – అన్నాడు వాల్మీకి కవిచంద్రుడు రోహిణికి బుధుడు కుమారుడు రామానందసాగర్‌జీ అందినంత వరకు సవ్యంగా తీస్తున్నారు మీరు అనుమానాలు లేకుండా రామాయణం చూడండి లోకం అంతా మెచ్చుకుంటున్నది సంతోషించండి అది మన జాతీయ కావ్యం ఎంత వక్రీకరించినా రామాయణం రామాయణమే! బంగారం లాగే అది పాడవదు

## స్త్రీల కార్యక్రమంలో

ఎంకన్న కాపురం – నాటిక రచన శ్రీమతి శారదా అశోకవర్ధన్

స్త్రీల కార్యక్రమంలో జానపద నృత్య నాటిక వేయవచ్చునా? అందులో ప్రసన్నరాణి బాగా నృత్యం చేసింది – పూర్వం ఎంకన్న కాపురం అనే పేరుతో ముదిగొండ లింగమూర్తి గారు ఒక నాటకం వ్రాశారు రచన ఒక మాదిరిగా ఉంది – స్త్రీల కార్యక్రమం ఇలా ఉండకూడదనుకుంటాను అలవాటుగా ఏ మల్లాది సుబ్బమ్మగారో కులాంతర వివాహాల్ని గురించో సతిని గురించో మాట్లాడితే గాని నాకు బాగుండదు

## స్త్రీ

గుజరాతీ పల్లెటూర్లో సంతోబా అనే చిత్ర కారిణి ఉంది ఆవిడకి చదువు రాదు వేలిముద్ర తప్ప ఈ పాత్ర వేసింది మానసీ ఉపాధ్యాయ

సంతోబా అయిదుగురు పిల్లల తల్లి అయినాక భర్త చనిపోతాడు ఆ రోజుల్లో గుజరాతులో సింహాలు విచ్చల విడిగా తిరిగేవి కాబోలు నిప్పుతో సింహాన్ని తోలేస్తుంది సంతోబా అనంతరం హాండ్‌లూమ్ టెక్స్‌టైల్‌ని ఆకర్షించేట్టు డిజైన్లు వేస్తుంది ఈ రోజు ఎనభై ఏళ్ళ సంతోబా ఆర్థికంగా నిలదొక్కుకున్న భారతీయ స్త్రీ – కథ బాగానే ఉంది కాని ?

## భక్త నందనార్

మాలవాడైన నందనార్ నానా అవస్థలూ పడి అరిచి పాములతో కరిపించుకొని – నాట్యం చేసి పాటలు పాడి చిదంబర నటరాజస్వామిలో ఐక్యం అయినాడు – ఇది అరవం నుంచి డబ్బింగు ముతకహాస్యం అంటే చెవిటి వాడూ మొగం మీద ఉమ్మితువరలూ లాటివి తప్పవు కాని టోటల్‌గా ఫరవాలేదు □

### తారల ముగ్గులు

1 సుమలత
2 గౌతమి
3 విజయశాంతి
4 భానుప్రియ
5 శారద


Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada . 520 003 Acting Editor M Madhava Rao, Chief Editor S Radhakrishna. Phones Business 61247, 61248, 75569 Editorial 75667